# కృతజ్ఞతలు

ఈ పుస్తక ప్రచురణకు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, శ్రీ శివలెంక శంభుప్రసాద్ ధర్మనిధి, మద్రాసువారు రూ|| 2500/- ఆర్థిక సహాయ్యం చేశారు. వారికి నా కృతజ్ఞతా పూర్వక వందనాలు.

-తిరుమల రామచంద్ర

# మూడు వాఙ్మయ శిఖరాలు

తిరుమల రామచంద్ర

ప్రాకృత అకాడెమీ
1-4-880/19, బరోడాబ్యాంకు కాలనీ,
న్యూ బాకారం, హైదరాబాద్-380

# రెండు మాటలు

మృతమివ పయసి నిగూఢం భూతే భూతే చ వసతి విజ్ఞానమ్,
సతతం మన్థయితవ్యం మనసా మన్థానభూతేన.

(బ్రహ్మబిందూపనిషత్)

ధనవృద్ధా వయోవృద్ధా విద్యావృద్ధా స్తథైవ చ,
తే సర్వే జ్ఞానవృద్ధస్య కింకరాః శిష్యకింకరాః. (భార. సభా.)

శ్రీ తిరుమల రామచంద్రగారు నాకు సాహితీసుగతుని స్వగతంతో పరిచితులు అంతకన్నా తొలుత మావారికి లాహోరులో మిత్రులు. ఇప్పుడు మా అందరికీ ఆత్మీయులు. నిన్న ఆకస్మాత్తుగా వస్తూ 'యశోదగారూ నా పుస్తకానికి మున్నుడిగా రెండు పేజీలు మించకుండా రెండు మాటలు వ్రాయండి.' అంటూ వెళ్ళిపోయారు. నేను నమ్మలేదు— తీరాచూస్తే పుస్తకం నా బల్లపై ఉంది. నన్ను ఋణగ్రస్తను చేశారు.

పుస్తకం తెరిస్తే ముగ్గురు సూర్యులు. మానవల్లి రామకృష్ణులు, వేటూరి ప్రభాకరులూ, నిడుదవోలు వేంకటరావులూ. అవును! ఈ ముగ్గురూ మూడు వాఙ్మయ శిఖరాలు. ఈ మూడు శిఖరాలకు దివిటీపట్టిన ఈ వెలుగును గూర్చి ఏమని పరిచయం చేయను? రామచంద్రగారు మాటల సందర్భంగా 'మేం పాత్రికేయులం; మాది ఈగజాతి' అన్నారు. అవును! ఈగలు అనేకరకాలు. 'విశిష్టాయా విశిష్టేన గుణవాన్ భవేత్' అన్నట్టు విద్వాంసులతో సహవాసం చేస్తూ, తలలో నాలుక, పూసలలో దారంగా మెదుల్తూ, వారి అంతరాంతరాళాల్లో ప్రవేశిస్తూ సూక్ష్మ సూక్ష్మతర విశేషాలను సంపాదించి, ఆ సారాన్ని సాహితీ జగత్తుకు మధుపులా అందించే ఈగజాతి వీరిది. అందుకే ఈ రచయిత తమ వారు పొరుగు రాష్ట్రంలో వన్నెవాసి తెచ్చినప్పటి ఆనందాన్ని 'అమృతబిందు సంయోగ' రూపమైన అనిర్వచనీయ స్థితిగా పేర్కొన్నారు. ఆ అభినివేశంతోనే తమ అభిమానులనూ, ఆరాధ్యులనూ పరిచయం చేస్తుంటారు. ఈయన పుస్తకం చదువుతూవుంటే స్నేహితులు ముఖాముఖిగా పిచ్చాపాటిగా ముచ్చటించుకున్నట్లే

ఉంటుంది. దిగ్దంతులైన ఈ సాహితీమూర్తులను పరిచేశపెడుతున్నప్పుడు సూటిగా విషయంలో ప్రవేశించరు. తమ అనుభవాలను సహృదయులకు విదితంచేస్తు న్నట్లుగా విషయాన్ని ప్రారంభిస్తారు. అప్పుడు వారికున్న వివిధ ప్రాంత, వ్యక్తి, భాషాదులతోడి పరిచయాన్ని మనచేత అనుభవింపచేస్తారు. అనుకో కుండానే మనం ఆ గహనమైన విషయంలో తలమునకలౌతాం. దిగినతరువాత పారం ముట్టక తప్పదుకదా! వస్తువు ఎంత గహనమైనా సరే విషయ నివేద నావసరంలో అలవోకగా సాగుతారు. అతిశయోక్తు లుండవు, అట్లని సాహితీ గౌరవం కొరవడి ఉండదు, ముగింపుకు వచ్చేవరకు కథోపకథలెన్నో చోటు చేసుకుంటూ మరుగు పడిన మాణిక్యాలనూ, గతకాలంనాటి సాహితీ సంప్రదాయా లనూ, సంస్కృతి విశేషాలనూ ఆవిష్కరిస్తుంటారు.

పుత్రి నిర్విశేషంగా తనను ఆదరించిన మానవల్లి, వేటూరివారి అనుబం ధాలను నిజాయితీతో వివరించిన సందర్భాలు చూస్తే అమాయికంగా బక్కపలు చగా కనిపించే ఈ శ్రీవైష్ణవుడు సామాన్యుడు కాడనీ తెలుస్తున్నది. ఈ మహోన్నత శిఖరాల ఉపరితలాన్ని పరిశోధించడమేకాక అగాధమైన లోతును కూడా తాకుతూ మూర్తిమంతమైన వారి సాహితీవ్యక్తిని ప్రదర్శించినప్పుడు రామచంద్రగారి పరిశోధనపాటవం, బహుభాషా పరిచయం, పాండితీ ప్రతిభలు వ్యక్తమౌతాయి. ఒక్కొక్కసారి ఈ రచయిత ఇంతవరకూ ముచ్చటిస్తున్న సహృదయుల గుంపునుండి విడివడ్తూ రచయితగా నిల్చి కొన్ని సత్యాలను ధైర్యంగా నిశ్చయరూపంలో చెబుతుంటారు. అంతే కాదు; ఎంతో ఆకర్షకంగా, ఆసక్తిదాయకంగా నడుస్తున్న కథవంటి జీవిత విశేషవర్ణనలల్లో చమత్కారంగా భారత, రామాయణ, నానాకావ్య శాస్త్ర నాటకోపనిషత్తులనుండి శ్లోకాలను ఉద్ధ రిస్తూ మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటారు. కేవలం తెలుగు, సంస్కృత భాషాగ్రంథాలనుండేకాక గాథాసప్తశతి, యోగశాస్త్ర, వ్యాకరణ, జనసేనకృత గ్రంథాలనుండి ఇచ్చిన ఉద్ధరణలను చూచినప్పుడు పాఠకులు రామచంద్రగారిని సామాన్య పాత్రికేయులుగా కాక కావ్యశాస్త్రపణివిగాను, ఇనుప గుగ్గిళ్ళను జీర్ణించుకున్న గట్టి గింజగాను గుర్తించక తప్పదు.

ఈ పుస్తకం కేవలం ఈ ముగ్గురు మహనీయుల జీవిత చరిత్రకే పరిమితం కాదు. ఆనాటి ఉద్యమాలూ, విశ్వవిద్యాలయాలు, సమకాలికులూ

తెలుగునాట వెలసిన పత్రికలూ, పత్రికాధిపతులూ, పరిశోధన విధానం, సమస్యలూ— పూరణాలూ, పండిత సభలూ, సన్మానాలూ, కవిపండితులలో ప్రబలిన ఈర్ష్యాసూయలూ, ఆనాటి సాహితీ ప్రక్రియలూ, టాటాకు పుస్తకాలూ, పరిష్కార విధానం, గాంధీ సాహిత్య ప్రారంభకులూ, గ్రంథాలయాలు మొదలైన విషయాలే కాకుండా, ప్రత్యేకంగా ఈ ముగ్గురి వ్యక్తిత్వం, వారి అభిరుచులూ, లోటుపాట్లూ, బిరుదాలు, చేసిన సాహిత్యసేవ, వ్రాసిన గ్రంథాలు, ఆ గ్రంథాలను చేర్చవలసిన ప్రక్రియలతోసహా పేర్కొంటూ ముద్రితాముద్రిత విశేషాలతో భావితరాలవారి పరిశోధనకు ఉపకరించేట్లుగా తీర్చినారు. సాహిత్యాభిమానులకూ, ప్రత్యేకంగా పరిశోధన దృక్కులకు తప్పక చదువదగిన పుస్తకం.

ఇట్లు
బుధజనవిధేయ
**పి. యశోదారెడ్డి**

# మనవి మాటలు

ఇది పరిశోధన గ్రంథంకాదు; నాకు ఈ ముగ్గురు పెద్దలతో ఉన్న పరిచయాన్ని తెలిపే స్వగతం. మానవుడు సంపూర్ణుడు కాడుగదా! ఈ ముగ్గురూ మానవతకోసం మానవతను ఆరాధించిన మానవతా మూర్తులు: వీరిని– ఈ శిఖరాలను చూస్తూ అట్లే ఉండిపోయాను.

మిత్రులు డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు సిద్ధాంతవ్యాసం "వేటూరివారి సారస్వత వరివస్య" నుంచి, గురుపుత్రులు– ఆవిధంగా సోదరులు అయిన డాక్టర్ వేటూరి ఆనందమూర్తి సంపాదకత్వాన వెలువడుతున్న మణిమంజరి నుంచి ప్రభాకరులకు సంబంధించిన కొన్ని విషయాలు గ్రహించాను వారికి కృతజ్ఞతలు.

ప్రాచీనులయిన విజ్జికా, శీలాభట్టారికాదులను తలపించే విదుషి, వాచక్నవి డాక్టర్ యశోదారెడ్డిగారు దీనికి చక్కని ముందు మాటలు–"రెండు మాటలు" వ్రాశారు. ఆమె, ఆమె భర్త, సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ పి. టి. రెడ్డి గారు నాకు ఆత్మీయులు. ఆమెకు కృతజ్ఞుణ్ణి.

ఈ వ్యాసాలను పుస్తకరూపంలో ముద్రించడానికి అనుమతించిన ఆర్థికసాహాయ్యం చేసిన భారతి పత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని చక్కగా ముద్రించి సకాలంలో అందజేసిన విప్లప్రింటర్స్ అధినేత శ్రీ ఎం. విజయసేనారెడ్డి గారికి, తక్కిన కార్యకర్తలకు కృతజ్ఞతలు.

హైదరాబాదు,
ప్రభవ వైశాఖ బహుళ పంచమి
17–5–87

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# మంగళాశాసనమ్

చిరంజీవి శేషశాయి కి,

సౌభాగ్యవతి అనూరాధ కు

మంగళాశాసనాలతో అందజేసిన

వివాహోపాయనమ్

సాటి రాష్ట్రంవారు పొరుగు రాష్ట్రంలోనో, పొరుగు దేశంలోనో కన్న వన్నె వాసి మనకు మన్నన తెచ్చినపుడు ఒళ్ల పొంగిపోతుంది. అమ్మయ్యో! మనమూ ఈ ప్రపంచంలో ఉన్నాము సుమా!- అనిపిస్తుంది. ఆ స్థితిని అలంకారికుల పరిభాషలో విగళిత వేద్యాంతర, బ్రహ్మానంద సబ్రహ్మచారిణి అన్నా అతిశయోక్తి కాదు; యోగుల పరిభాషలో అమృత బిందు సంయోగమన్నా అసమంజసం కాదు. అటాంటి అనిర్వచనీయ స్థితి అందరి జీవితాలలోనూ సంభవమే.

మూడు దశాబ్దాలనాటి మాట; కాంధార్ పరిసరాలలో ఉండగా ఒక సింహసంహననుడు కనిపించాడు. ఒక ధర్మశాలలో భేటీ అయింది. చూడగానే దక్షిణ భారతీయుణ్ణని గ్రహించాడు కాబోలు!- గ్రహించక ఏంచేస్తాడు మరి, ఆజానుబాహులైన పఠానుల మధ్య బిక్కు బిక్కుమంటూ ఉన్న నన్ను? "ఏ ఊరు? ఏంపేరు?" అని ప్రశ్నించాడు. "తెలుగువాణ్ణి, పేరు ఫలానా." అన్నాను. సింహంలాగా నామీదికి లంఘించి, కౌగిలించుకొని "ఓహ్! మా గురూజీ దేశమా? మా గురూజీని మరల దర్శించినట్లైంది." అని ఆనంద తాండవం చేయసాగాడు. నేను పిట్టలాగ ఉక్కిరి బిక్కిరి అయిపోతూ ఉన్నా, ఆ మహాకాయుని ఆపే దమ్ములేవీ! ఆ ఆనందోన్మత్తుని పేరు గుల్జార్‌మూర్తి. కలియుగ భీముడు శ్రీ కోడి రామమూర్తిగారి శిష్యుడు. ఈ సంగతి తెలిసిన తర్వాత నేనూ పరవశుణ్ణయాను. నేనే రామమూర్తిగా తన్నంత తాదాత్మ్యం పొందాను. గుల్జార్‌మూర్తి గురుభక్తి అలాటిది.

ఈలాటి పారవశ్యమే మరికొన్నేళ్ళకు లాహోర్‌లో కలిగింది. దయానంద ఆయుర్వేద కళాశాల ముందు నిలబడి శంకుస్థాపన సమయం తెలిపే చలువ రాతిని చదువుతున్నాను. పండిత దివి గోపాలాచార్యులవారు శంకుస్థాపన చేసినట్టు చెక్కి ఉంది. ఆయన ఆనాటి ఆయుర్వేద చరిత్రకదా! ఆ చలువ రాయి, నన్ను కృష్ణాతీరానికి, ఆంధ్రుల మహావైభవకాలానికి తీసుకువెళ్ళగా, మైమరచి నిలుచున్నాను. ఎవరో వీపుతట్టారు. తిరిగి చూశాను; ఒక పెద్దమనిషి. "ఏమిటి చూస్తున్నారు? క్యా దేఖ్ రహే హైఁ?" అన్నారు ఆయన. "ఈ చంద్ర శిలా ఫలకం." అన్నాను. "ఎక్కడివారు మీరు? కహాఁకే?" అని మరల ప్రశ్నించారు. "ఈ మహానుభావుల దేశమే." అన్నాను. "ధన్య హో!" అంటూ ఆయన తలపాగా తీసి తలవంచి నమస్కరించారు. ఉభయ కుశలోపరి ఎప్పుడు, ఏ సహాయంబడితే అసహాయం పొందవచ్చు నన్నారు. గోపాలాచార్యులవారు శిష్యులను పుత్రనిర్విశేషంగా చూడడం గురువర్యులు శ్రీ సి. వి. సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ పుల్లగుండ్ల నరసింహశాస్త్రి, శ్రీ ఏటూరి శ్రీనివాసాచార్యులు, శ్రీ వేటూరి శంకరశాస్త్రిగార్లు కథలుగా చెప్పడం విన్నవాణ్ణి గనుక, ఆయన శిష్యులకు ఆయనపేరే మూలమంత్రం, ఆయన దేశమే దివ్యలోకం కావడం- అన్యరాష్ట్రంలో ఆకీని- నన్ను మరింత పరవశుణ్ణి చేసింది.

ఇలాటి పారవశ్య విశేషం మరొకమారు దర్భాంగాలో కలిగింది. కొందరు సింధీ మిత్రులతో దర్భాంగా సంస్కృత కళాశాలకు వెళ్ళినప్పుడు "కిం భవంతః శతావధానినః? అవధానేన సంతితర్పయిష్యథః?" అని అక్కడి పండితులు ప్రశ్నించారు. "నాహం శతావధానీ, ఏష మన్మిత్రం వధ్వానీ. అస్య బంధుర్గిద్వానీ." అన్నాను. అందరూ విరగబడి నవ్వారు. "మీరు తెలుగువార మన్నారు గదా! ఇక్కడికి వచ్చి ఆశువుగా కావ్యాలు చెప్పిన గణపతిముని కావ్యకంఠు లయ్యారు." అని వారన్నారు. నా మనస్సు ఊహకందని ఏ అతి మానుష లోకాలకో పయనమయింది— ఇదంతా తెలుగువాణ్ణి గురించి, నన్ను గురించే! "మీ దేశంనుంచి చిదంబరశాస్త్రి అనేవారు వచ్చారు; అవధానాలతో మమ్మల్ని ఓలలాడించారు. కావ్యకళానిధి బిరుదుతో సత్కృతు లయ్యారు." అన్నారు వారు. "ఔను! వారు మావారే! మా తెలుగువారే!" అని గొణిగాను. ఆ ఆనందంలో విశేషముంది. కావ్యకంఠులను, కోడివారిని, దివివారిని నేను

దర్శించుకున్నాను. కాని చనువు తక్కువ. శ్రీ చిదంబరశాస్త్రిగారిని నేను దర్శించుకున్నాను. నలభై ఆరు సంవత్సరాలకిత్రం వారి అవధానం విన్నాను. వారు నా ఇల్లు రెండు మూడుసార్లు పావనం చేశారు. కనుక ఈ ఆనందం నాది ! నా స్వంతంది !

ఇలాంటి పారవశ్యం పరాకాష్ఠపొందింది కాన్పూరులో ముప్ఫయి సంవత్సరాలనాడు. ఒక హిందీ సాహిత్య సమావేశానికి 'మహాపండిత' రాహుల్ సాంకృత్యాయన్, లాహోర్ ఓరియంటల్ కాలేజి వైస్ ప్రిన్సిపల్ డాక్టర్ లక్ష్మణస్వరూప్ మున్నగు పండిత ప్రకాండులు వచ్చారు. రాహుల్ సాంకృత్యాయన్ అంటే పరిశోధకాగ్రేసరులు, మహా రచయితలు, పాట్నా హైకోర్టు న్యాయమూర్తులు కె. పి. జయస్వాల్ బహిఃప్రాణ మన్నమాట. సరే, పరస్పర పరిచయ నమస్కారాల తర్వాత ప్రసంగవశాత్తు "రామకృష్ణకవిగారిని ఎరుగుదురా ? మద్రాసువారమని అంటున్నారే ?" అని ప్రశ్నించారు రాహుల్ జీ. "ఎందుకు ?" అన్నాను. "ఏమీలేదు. ఆయన ఎంత ధన్యజీవి ! ఆయన జీవిత సార్థక్యానికి ఒక్క కుందమాల నాటకమే చాలు. ఎంత మంచి నాటకం ప్రపంచానికి ప్రసాదించారు !" అన్నారు రాహుల్ జీ. "బాగానే అన్నారు. మరి నాట్యశాస్త్రం సంగతో ?" అని ప్రశ్నించారు డాక్టర్ లక్ష్మణస్వరూప్. "ఆయన వెలుగుకు తెచ్చిన సంస్కృత పుస్తకాలన్నీ అలాటివే ఒక్కొక్కటీ చాలు ఆయన జీవితాన్ని ధన్యతమం చేయడానికి." అన్నారు మరొకరు.

నాకు మాట పెగలడంలేదు. గుండె గొంతుకలో కొట్టుకులాడింది. నేనప్పుడు అనుభవించింది మానుషానందం కాదు. ఉపనిషత్తులు ఉద్ఘోషించిన అతిమానుషానంద అనుభూతి అది. అతి కష్టంతో గద్గద కంఠంతో అన్నాను "కవిగారు నాకు బాగా పరిచితులు. ఆయనకింద పనిచేసే భాగ్యం నాకు లభించింది." అక్కడివారందరి చూపుల్లోనూ కవిగారిని దర్శించినంత సంతోషం తెలిపే రాగరేఖ ఒక్కసారిగా మెరిసింది. "ఏమిటి ఈ అభేదాధ్యవసాయం !" అని అనుకుంటూ మైమరచాను. నా మనసు నాలుగు దశాబ్దాల వెనక్కు ప్రయాణం చేసింది.

1927 నాటి మాట. నేనప్పుడు తిరుపతి సంస్కృత కళాశాలలో చదువుకొంటున్నాను. మానవల్లి రామకృష్ణ కవిగారు తిరుమల తిరుపతి దేవస్థానం

విద్యాశాఖాధికారిగా ఉండేవారు, ఆయనకు తాళపత్రి గ్రంథాలు చూచి వ్రాయ డానికి "నకలు నవీసు" కావాలని ఎవరో చెప్పగా ఒకరోజు ఆయన ఇంటికి వెళ్లాను. ఆయన "తాళీదళ సంపుట ప్రకర కాంతారమున" ఉన్నారు. పొడుగాటి శరీరం, కోల ముఖం, నొసట గంధాక్షతలు, ఊర్ధ్వకాయం కొంచెం వంచి నడిచే అలవాటు. అప్పటికే షష్టిపూర్తి అయింది. ఏమైనా, ఎదుటివారికి నివురుగప్పిన నిప్పువంటి వ్యక్తినుమా అనే భావం తెలిపే సౌమ్య గంభీరమూర్తి ఆయనది. నన్ను చూడగానే "ఎవరయ్యా మీరు ?" అని ప్రశ్నించారు. "అయ్యా, మీరు" అనడం ఆయన అలవాటు. "మీకు వ్రాయసం వాడొకడు కావాలని విని వచ్చాను." అని వినయంగా మనవి చేశాను. "కూర్చోండి." అంటూ తాళపత్రాలను ఒకవైపుకు తోశారు. నా చేతిలో ఒక నోటుబుక్కు ఉంది. నా దస్తూరీ నమూనా కోసం దానిలో కొన్ని పద్యాలూ, శ్లోకాలూ వ్రాసుకుని వెళ్లాలెండి. "ఏదీ మీ దస్తూరీ ఎలా ఉందో చూపండి." అని అడిగారు, ఆయన. నా నోటుబుక్కు తెరచి చూపాను. "ఎవరి వీ శ్లోకాలు ?" అని ప్రశ్నించారు. "నావేనండి." అంటూ సంకోచపడ్డాను. "ఏదీ చదవండి." అన్నారు; చదివాను.

> "మంజుల నూపుర శింజిత
> పుంజీకృత రసికలోక హృత్కంఠా,
> కుంజరగమనా గచ్ఛతి
> భంజంతీ మదన మంజులతాం."

అని "మరొకటి చదవండి." అన్నారు.

> "రచయంతీ భంగలతాం
> మంగళగాత్రీ సలీల మంగణకే,
> విటజన హృదయాంగణకే౽
> నంగజబాధాం విశాలయతి నూనమ్ !"

"ఆర్యా ఛందస్సును బాగానే నడిపించారు. కాని 'మదన మంజులతాం' అని స్త్రీ సౌందర్యాన్ని పురుష సౌందర్యంతో పోల్చారేం ? రతి సౌందర్యం మీకు నచ్చలేదా ?" అని ప్రశ్నించారు. సమాధానం చెప్పక నీళ్లు నమిలాను.

"మదనః అంటే ఒక రకం దేశితాళం. మదనే చ ద్రుతౌ గురుః, మదనేన ప్లుతో ప్రోక్తౌ, తాలే మదన సంజ్ఞే తు ద్రుతద్వయశ్చ గురుస్తథా— అని దేశితాళ లక్షణం చెప్పారు. ఆ తాళ మాధుర్యాన్ని భంజిస్తే, అంటే అంతకన్నా మధురంగా నడిచింది అని అర్థం చెప్పుకుందామా :" అన్నారు. "నాకు సంగీత మంటే ఓనమాలు రావండి." అన్నాను. "ఇంతకూ మీ వయస్సెంత?" అన్నారు. "పద్నాలుగేండ్లండి" అన్నాను. "ఇంత పసివయసులో ఎందుకండీ ఈ శృంగారం ?" అని మందలించే ధోరణితో అన్నారు. కొంచెం సిగ్గుపడవలసి వచ్చింది నేను.

ఇది ఆ పండిత ప్రకాండుని సన్నిధిని ప్రథమ పరిచయం. తర్వాత నేను ఆయనదగ్గరికి వెళ్లుతూ ఉండేవాణ్ణి. ఆయనకు నకలు చేసిపెట్టింది కొద్దే. కాని ఆ ఉన్నంతసేపూ సంస్కృత సాహిత్య మధుర ప్రపంచంలో విహరించేవాణ్ణి. అడుగడుక్కూ ఆయన కోహపదని, శార్ఙ్గదేవుడని, సింగభూపాలుడని నాకు అప్పటికి పూర్తిగా కొత్తవైన పేర్లు చెబుతూ, వారి శ్లోకాలు ఉదాహరిస్తూ ఎన్నో విషయాలు తెలిపేవారు. వేణీసంహారం చర్చ వచ్చింది ఒకమారు. "అంతకంటే ముందుదయ్యేః భట్ట నారాయణుడు వ్రాసిన కృత్యారావణం!" అంటూ ఘట్ట ఘట్టాని కొకటి రెండు శ్లోకాకు ఉదాహరించేవారు. ఆయన ధారణాశక్తి శక్తి స్వరూపిణి. ఆయన మెదడొక పావురాల గూడనుకుంటాను; అవసరమైనప్పు డల్లా ఆ అరలగుండా- గూళ్ళ నుంచి విషయాలనే కపోతాలు కర్పూరకాంతులతో మనకు ప్రత్యక్షమయ్యేవి. ఆయన "ఊః ఊఁ హుఁ" అని ప్రారంభించి ఒక రకం యాసతో పద్యాలు, శ్లోకాలు చదువుతూ ఉండే పావురాల గునుపులాగే వినిపించేవి కమ్మగా.

తర్వాత కొన్ని సంవత్సరాలకు చెన్నపురిలో ఆయనకింద పనిచేసే అపూర్వావకాశం కలిగింది- కొన్ని నెలలపాటు శ్రీ ఆర్. అనంత కృష్ణశాస్త్రి అనే వారు మద్రాసు విశ్వవిద్యాలయానికి కొన్ని తాళపత్ర గ్రంథాలు సేకరించి యిచ్చారు. వాటిని వింగడించేపని కవిగారికి అప్పగించారు విశ్వవిద్యాలయంవారు. నేను వారికి అసిస్టెంటును. ఆయన మహాప్రతిభ నా కప్పుడు పూర్తిగా అవగాహనకు వచ్చింది. ఆయన తాటాకుల కట్ట విప్పకముందే ఇది ఈ పుస్తకం, ఇది ఈ ఘట్టంలోది అని త్వరత్వరగా చెబుతూ పోతూ ఉంటే, నలుని కథ

జ్ఞాపకం వచ్చింది. అయినా, ఆయనవద్ద నేర్చుకున్నది అంతంతే. "కూపే వశ్య పయోనిధా వపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్." అని భర్తృహరి ఊరికే అన్నాడా ?

ఆ రోజుల్లోనే అడిగాను ఒకమారు -మీ పుట్టుపూర్వాలు సెలవియ్యండి. ఒక వ్యాసం వ్రాయాలని ఉంది." అని. ఆయన ఒక వెదనవ్వు నవ్వి "నేను అప్పుడే చచ్చిపోతా ననుకున్నారా ? ఇంకా కనీసం 20 సంవత్సరాలన్నా బ్రతుకుతాను. సెంచరీ కొట్టాలనే నా ఆశ, నేను పోయిన తర్వాత వ్రాసేదేదో వ్రాయవచ్చు లెండి." అన్నారు ఆయన నిరీహకు, నిరాడంబరతకు హతాశుణ్ణి అయాను.

ఇంతకూ ఆయన తన రచనలలో తననుగూర్చి చెప్పుకున్నది కూడా చాలా కొంచెమే. ఆ కాలమహిమా, పండితోత్తముల సంప్రదాయమూ అలాంటివి. తమ స్వంత సంగతికంటే తమ రచనా ప్రాశస్త్యమే వారికి కావల సింది. భరతుడు తననుగూర్చి భేరీలు మ్రోయించుకున్నాడా ? కాళిదాసు తన విషయం కాహాపలు ఊదించుకున్నాడా ? రామకృష్ణ కవిగారూ అంతే. ఆయన 1866 లో నుంగంబాకం, మద్రాసులో జన్మించారు. ఆయనది చెన్నపురిలో పేరుమోసిన పండితవంశం. తాతపేరు వెంకట కుప్పాశాస్త్రిగారు. తండ్రి పేరు రామశాస్త్రిగారు. రామశాస్త్రిగారు అష్టాదశ భాషలలోను, బహు విద్యలలోను సమర్థులట. నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలట. భరతకోశం ప్రారంభంలో ఆయన ఇలా చెప్పుకున్నారు :

"ఆసీ ద్వేంకటకుప్పాఖ్యః ప్రవర సోమపీథినామ్,
తత్పుత్రో రామశాస్త్రీతి విఖ్యాత శ్శంసితవ్రతః.
అష్టాదశసు భాషాసు విద్యాస్వపి కృతశ్రమః,
వ్యాఖ్యాతా నాట్యశాస్త్రస్య రసికో జనరంజనః,
తత్పుత్రో రామకృష్ణాఖ్యః..... ... .... ... ...."

అంతమాత్రమే చెప్పుకున్నారు తమను గురించి.

రచయితలకు ప్రథమోత్సాహంలో తమను గురించి చెప్పుకోడం మోజు. కాని ఈ వినీతులకు తమ తొలికావ్యంలోను ఈ మోజు కనిపించదు. ఈయన తొట్టతొలుత రచించిన కావ్యం 'మృగావతి'. దాని పీఠికలో ఉన్నది :

గీ. "చెన్నపురి చూళ నివసించుచున్న వాఁడ
వైదిక బ్రాహ్మణుఁడ మానవల్లి కులుఁడ
రామదైవజ్ఞ పుత్రుఁడ రాజనుతుని
త్యాగరాజపండితుని ప్రియానుజుండ."

అనిమాత్రమే.

కవిగారు చిన్ననాట క్రిశ్చియన్ కళాశాల పాఠశాలలో చదువుతున్న రోజుల్లోనే ఆయన ప్రతిభ వెల్లడయింది. పూవుపుట్టగనే పరిమళిస్తుందన్నారు కదా- పెద్దలు! ఆంధ్రభాషా సాహిత్యాలను గూర్చి ఆయనొక బృహద్వ్యాసం వ్రాశారు. దాని పేరు "ఆంధ్రభాషను గూర్చిన యుపన్యాసము." ఇదే ఆయన మొట్టమొదటి రచన. అది అప్పటి విద్వాంసుల మన్ననకు పాత్రమైంది. అది అప్పుడు కవిపండితులను ఆదరించే "వైజయంతి" పత్రికలో ముద్రిత మైంది. వైజయంతి పత్రికా సంపాదకులు, కాంగ్రెస్ అధ్యక్షులు, పనప్పాకం అనంతాచార్యులు ఒక సభలో మానవల్లి వారిని 'కవి' బిరుదంతో సన్మానించారు. అప్పటినుంచి ఆయన రామకృష్ణ కవిగా విఖ్యాతులయారు. తొంబయి సంవత్సరాల క్రితం వ్రాసిన ఈ వ్యాసంలో నేటికి క్రొత్తగా కనిపించే విషయాలెన్నో ఉన్నాయి. వారి భావి మహాపరిశోధనకు దీనిలోనే దారులు పడ్డాయి.

ఆయన పట్టభద్రులైన (బి ఏ.) తర్వాత వనపర్తి సంస్థానంలో విద్యాశాఖాధికారిగా జీవితం ప్రారంభించారు. అంతకుముందే 'మృగావతి' ప్రథమ కావ్యరచన జరిగింది: అంటే 1890 లో. ఇదికూడ 'వైజయంతి' పత్రికలో మొదట ముద్రితమై 1897 లో పునర్ముద్రణ పొందింది. కవిగారు పైలా పచ్చీసుదశలో చేసిన రచన గనుక ఇది శృంగార రసమయం. ఇది నాలుగాశ్వాసాల ప్రబంధం. మొదటి ఆశ్వాసంలో 108, 208, రెండవదానిలో 167 మూడవదానిలో 134, నాలుగవ దానిలో 158 పద్యాలుంటాయి. "సోమదత్త మహాకవి ప్రణీత కథా సరిత్సాగరాంతర్గతమైన యేతత్కథాప్రపంచంబు"ను కవిగారు :

క. "విమలాచార పవిత్రున
కమృతమయ స్వాంతునకు సదాగమవిద్యా
ప్రమదున కుర్వీపాలో
త్తమ నుతునకు త్యాగరాజ దైవజ్ఞునకున్."

గీ. "తల్లిదండ్రులకన్నను ధర్మపత్ని
కన్న నెక్కుడు ప్రేమతో నన్ను ననుజు
జూచుకతమున గిరిశేషునకు దీని
నంకిత మొనర్తు గన్నిప లట్టె జాలు."

అని దీనిని తమ అన్నగారికి అంకితమిచ్చారు.

ఈ కావ్యం తెలుగు పంచకావ్యాలు పిండిపెట్టిన పంచామృతమంటే సరిపోతుంది. మచ్చుకు నాలుగైదు పద్యాలు ఉదాహరించడం అప్రస్తుతం కాదు.

శా. "మల్లెల్ గోసి మరందబృందముల త
  ర్మస్థాలికా పాలితోఁ
బల్లికవ్యలు నింపగా మునికి నే
  పాళీమణుల్ గోస్తని
వల్లి నిర్మితకాయమానముల త
  ద్వ్యంబైన పూజా విధుల్
సెల్లింపన్ రహి నుద్యమింతురు యువ
  శ్రీగౌరు చందంబునన్." 1-6

ఈయన సీసమాలికలలో భట్టుమూర్తి సంగీతపు లగువు బిగువులు కనిపిస్తాయి :

సీ. అప్సరః ప్రేమాస్పదానీత కల్పపా
  దప పుష్పరుల్లరుల్ దనరుచోట
సామంత సీమంతినీ మంగళారణ్య
  మల్లికాహారముల్ మలగుచోట
అన్యరాజన్య కన్యాహస్త నిర్మిత
  రంగవల్ల్యాదులు గ్రాలుచోట
విప్రనితంబినీ విన్యస్త కేతకీ
  స్తంభ చతుష్కంబు దగులుచోట

గీ. జిగిని జిగురాకు పందిరుల్ క్రిగుడుచోట
మాలతీదామ జాలముల్ వ్రేలుచోట
జగతి నిర్మించి రమ్మువల్ సరస సరస
దీపకళికా విలాసముల్ జూపుచుండ." 2–53

పాదలేపనౌషధహీనుడైన ప్రవరుడు తన పట్టణానికి పోలేక-

"అతిథి సంతర్పణంబు లేమయ్యె నొక్కొ!
అగ్ను లేమైన వొక్కొ నిత్యంబులైన
కృత్యములు బాపి దైవంబ కినుక నిట్లు
పాలుపైచితె మిన్నులు పడ్డచోట ?"

అని వగవడం కవిగారు చక్కగా తమనాయిక మృగావతికి అతికించారు. మృగావతి తనకు తెలియకనే విహంగమంపై కొండచరియ చేరుకుంది. ఇంతలో తటాలున స్మరణ కలిగి–

"ఎచ్చట నున్నదాన నిది
యెక్కడి పర్వతబృంద మెట్లు పో
వచ్చును వత్సభూమి కిట
వ్రాలెడు భాస్కరు డస్తవారిలో
ముచ్చులు బెట్టిదంపు మృగ
ముల్ ఫణిరాజులు దా చరింపరే
యిచ్చట నిల్వలేర్తునె ప్రి
యేశ్వర! వాసతి మిమ్ము జూతునే!" 1–17

అని విలపిస్తుంది. ఈయన ఈ కావ్య ప్రారంభంలో చేసిన భారతీస్తుతి అప్పటికే ఈయనకు గల శాస్త్ర పాండిత్య ప్రకర్షను ప్రకటిస్తుంది :

గీ. "గంధ రస రూప సంస్పర్శకంబులైన
నాల్గు గుణములు శబ్దగుణంబునంద
యడఁగునవి యనంతంబ శబ్దార్థి నగుచు
నమృతమూర్తిని భారతి నాశ్రయింతు." 1–2

చిన్ననాడే మహాకవుల కోవకు చెందిన ఈయన ప్రశక్తియగుణం ఎంతటిదో కావ్య సమాప్తి పద్యం తెలుపుతుంది.

చ. "మును గవితా పయోధి దిగి
    ముత్యము లేర్చిన సత్కవీశులన్
గనుట వయోమనీషలను
    గాలము లూనక మున్గి యేనునుం
గనుడిదె తెచ్చితిన్ శిలయొ
    గవ్వయొ కృతిరత్నమో యెఱుం
గను గవులార యెట్లు నను
    గాచెదరో కరుణార్ద్ర చిత్తులై." 4-158

కవిగారి తక్కిన స్వతంత్ర తెలుగు రచనలు కళింగసేనము, మహావీరుడు, వత్సరాజచరిత్ర మున్నగునవి. భాసుని నాటకాలను మొదట అనువదించింది కూడ ఆయనే.

వనపర్తిలో ఆయన 1901 నుంచి ఎనిమిదేండ్లు ఉన్నారు. అప్పుడు ఆయన జీతం నెలకు వంద రూపాయలు. రెండువందల రూపాయలిస్తే ఎప్పటికీ వనపర్తిలోనే ఉంటానని ఆయన వనపర్తిరాజుగారికి చెప్పారు. కాని రాజుగారు ఇవ్వనన్నారు; దానిపై కొంత మనస్తాపం కలిగింది. ఆయన వెంటనే కట్టుబట్టలతో— తాను సేకరించిన, తాను ప్రేమించిన గ్రంథాలను, తాళపత్ర గ్రంథాలనయినా వెంట తీసుకోక— వనపర్తి వదలారు. అటువంటి ఘర్షణ ఏమి జరిగిందో ఎప్పుడూ ఆయన చెప్పలేదు. ఆ రహస్యం ఆయనతోనే మసి అయిపోయింది. ఇలాంటి వారిని గురించే గాథాసప్తశతిలో ఒక చక్కని గాథ ఉంది.

"కలహాంతరే వి అవిణిగ్గఆఇఁ
హిఅఅమ్మి జరాముపగఆఇం,
సుఅణ కఆఇఁ రహస్సాఇఁ
డహఇ ఆయుక్ఖఏ అగ్గీ," 4-21

(కలహాన్తరే ప్యవినిర్గతాని
హృదయే జరాముపగతాని,
సుజనశ్రితాని రహస్యాని
దహ త్యాయుఃక్షయే అగ్నిః.)

ఇది హాలుని గాథ. హాలుడు రాజనీతి చతురుడైన చక్రవర్తి. కనుక అతనికి రహస్య గోపనమంటే ఏమిటో తెలుసు; అది పెదవి దాటితే పృథ్వి దాటుతుందని కూడ తెలుసు. అందుకనే సజ్జనుల రహస్య గోపన యోగాన్ని ఇలా వర్ణించా డీ గాథలో. సజ్జనులు ఎవరైనా, ఏమైనా రహస్యం తమకు చెబితే, దానిని వారితో పోట్లాటలు వచ్చినప్పుడు కూడ బయటపెట్టరు. అది వారి హృదయంలోనే ముసలిదైపోయి, వారితోపాటే చితిలో కాలవలసిందే. అది వారు బ్రతికి ఉన్నప్పుడు ఎన్నటికీ, ఎప్పటికీ వెలువడదు.

అలాటివారు మానవల్లివారు. నేను ఎన్నిసార్లు ప్రయత్నించినా వారినుంచి వనపర్తి వివరాలు ఎప్పుడూ బయటపడలేదు. ఆయనతోనే మసి అయిపోయాయి. ఆయన సేకరించిన పుస్తకాలవార్త అబద్ధమని, పుస్తకాలు వుంటే ఎందుకు బయటపెట్టడని, అబద్ధాలు ఆయన అలవాటని పలువురు సమకాలికులు ఎంత పొడిచినా ఆయన పెదవి విప్పలేరు.

1940 ప్రాంతంలో కవిగారు తిరుపతిలో ఉన్నప్పుడు అప్పటి వనపర్తి రాజు ఆయనను వనపర్తికి రప్పించడానికి నా మిత్రుడు కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిని తిరుపతికి పంపారు. లక్ష్మణశాస్త్రి ఎంత ప్రాధేయపడినా కవిగారు అంగీకరించలేదు. "వనపర్తి సంగతి తరంకిందే మరచిపోయానయ్యా; ఇక ఆ ప్రసక్తి లేదు." అని ఆయన అన్నారు!

వనపర్తిలో ఉన్న ఎనిమిదేళ్ళలోనే ఆయన బ్రహ్మవిద్యా విలాస ముద్రాక్షరశాలలో విస్మృత కవులు గ్రంథమాల ప్రారంభించారు. ఈ ఎనిమి దేళ్ళలోను ఆయన వనపర్తిలో పలువురిని సంస్కృతాంధ్రాంగ్ల పండితులను చేశారు. వారిలో లక్ష్మణశాస్త్రి తండ్రి శ్రీనివాసశాస్త్రి, పినతండ్రి ఉమా మహేశ్వరశాస్త్రి, లక్ష్మణశాస్త్రితోపాటు విక్రమాంకదేవ చరితాన్ని ఆంధ్రీక రించిన మాదిరాజు విశ్వనాథరావుగార్లు మున్నగువారున్నారు.

కవిగారు వనపర్తిలో తాము సేకరించిన తాళపత్ర గ్రంథాలను వెంట తెచ్చి ఉంటే, తాము రచించిన వాటిని, నోట్సునన్నా వెంటతెచ్చివుంటే, ఎన్నో అపవాదులకు దూరమైవుండేవారు; నిందకులకు సమాధానం ఇచ్చివుండే వారు. కాని, దురదృష్టవశాత్తు అలాటిది జరగలేదు.

వనపర్తి జీవితం ఆయనను పరిశోధకునిగా తీర్చిదిద్దింది. తాళపత్ర గ్రంథాలకోసం, శాసనాలకోసం గవేషణ ప్రారంభించారు. తాళపత్రగ్రంథాల సేకరణ ఒకయజ్ఞం. వాటిని సంస్కరించి ముద్రించడం రాజసూయయాగం. అదొక కళ: మరొక విధంగా అదొక శాస్త్రం. ప్రాచీన శాసన లిపి, తాళ పత్రలిపి సులభంగా పోల్చుకోదగినవి కావు; తాళపత్ర గ్రంథాలను వ్రాయసం వారు తలకొక విధంగా వ్రాసేవారు. బండి ఱ, ట, లకు, వపలకు, నసలకు, గుడి ఎత్వాలకు భేదం ఉండదు. వీటికితోడు వ్యాకరణ కావ్యాలైన గసడదవా దేశాలు, పూర్ణార్ధబిందువులు పాఠాంతరాలు, లేఖన ప్రమాదాలు— ఇదంతా ఒక కాసట-బీసట. నన్నెచోడు దన్నట్టు "పా కదల్చి నీరు" గ్రహించాలి. ఇలాటి పనికి పూనుకున్న వారికి ప్రపంచం వషట్కారాలు తప్పవు.

కవిగారు "విస్మృతకవులు" అనే గ్రంథమాలక్రింద ప్రాచీనాపూర్వ గ్రంథ ముద్రణం ప్రారంభించారు. దీనిలో వెలువరచిన మొదటి గ్రంథం "వల్లభరాయని క్రీడాభిరామము." ఇది మొదట వనపర్తిలోని బ్రహ్మవిద్యా విలాసం ప్రెస్సులో ముద్రితమైంది. దీని పీఠిక చివరిమాటలలో "నేను ముద్రించుచున్న చెంకణాదిత్యుని కుమారసంభవము, అమరేశ్వరుని విక్రమ సేనము- వీనిని సవరించుటలో నా యజ్ఞానము చాల బ్రకటమైనను గాలహర ణమై ధనార్జన భంగము గలిగినను గేవలము భాషయందుగల ప్రీతిచే దీనిని ముద్రించితిని గావున నా దోషములను సరకుగొనక సహృదయులై సవరించు కొని యానందమును గ్రోలుదురుగాక యని విఙ్ఞాపించుచున్నాడను." అన్నారు. ఎంతటి ఆవేదన ఈ మాటలలో ఇమిడి ఉందో స్పష్టమౌతుంది.

ఈ పీఠికలో ఈయన కురుమంబెట్టిన, (కుసుమ రంగు అద్దిన), అప్పన మెవ్వాడు (పని నెవ్వాడు) మొదలైన విశిష్ట ప్రయోగాలను సోపపత్తికంగా చర్చించి నిర్ణయించారు.

ఈ గ్రంథమాలలో రెండవది నన్నెచోడుని కుమారసంభవం. ఇది రెండు సంపుటాలుగా వెలువడింది. ఇదే ఆంధ్ర సారస్వతలోకంలో భయంకరమైన ఝంఝూవాతం చెలరేగించిన కావ్యం. నన్నెచోడుని ఈ గ్రంథంలో తక్కిన ఏ కావ్యంలోనూ కనిపించని అపూర్వ ప్రయోగాలు, కన్నడ తమిళ పదాలు, వాటి సామ్యంపొందే హలంతపదాలు కనిపించడంతో ఇది నన్నయకు మునుపటి కృతి అని కవిగారు నిర్ణయించారు. నన్నయే ఆదికవి అనుకున్న ఆంధ్ర పండితలోకం దీనిని సహించలేదు. ఖండన మండనలు బయలుదేరాయి. దీనిని సమర్థించినవారు నడకుదుటి వీర్రాజుగారు మొదలైనవారు. ప్రతిపక్షులు కవిగారు పాఠాలు దిద్దివేశారని అపవాదులు ప్రారంభించారు.

"ఇంత గాలిదుమారం లేవగా మీరు జవాబు చెప్పరెందుకండీ?" అని కవిగారిని ప్రశ్నించాను. "నేను చెప్పేదేదో గ్రంథం పీఠికలోనే చెప్పాను. మళ్ళీ మళ్ళీ చెప్పడం దేనికి? పొగిడేవారు పొగడనీండి; తెగిడేవారు తెగడనీండి. నాపని తీరింది." అన్నారు, ఆ స్థితప్రజ్ఞులు. నిజమే, ఏదో సత్కార్యం చేస్తే, పదిమంది విరుచుకుపడితే, బదులు చెపుతూ కూర్చుంటే సత్కార్యం చెడిపోదూ? కవిగారి పద్ధతి చాల ప్రశంసనీయమైనదనే నాకు తోచింది. వాదిస్తూ కూర్చునేవాడు ఏమీ చేయలేడు. ఆయన ఈ వాదాన్ని ఎంత నేర్పుతో ఉపసంహరించారో కుమారసంభవం ద్వితీయభాగం పీఠిక చివర చదివితే స్పష్టమౌతుంది.

"ఒకవేళ మన కవి ప్రాచీనుడు కాడయ్యేనేని కొఱంత యేమి? నన్నయాదులకు బూర్వకావ్యములు రాజపోషితములే వెలువడనున్నవి. చవులు గలవేని రాజభోగ్యములగుఁగదా! సర్వవిధముల నిరుపమానమగు నీ కావ్యరత్నము కవి యెవ్వఁడైన నెప్పుడుండినను సర్వజనాదరణీయమే. 'వక్తుః ప్రామాణ్యా దేవ వచః ప్రామాణ్య మిష్యతే, నహ్యశుద్ధతరాద్వక్తుః ప్రభవంత్యుజ్జ్వలా గిరః' అని జినసేనుడు చెప్పినట్లు వజ్రముల చవులు బొగ్గులలోఁ బుట్టునా? అల్పజ్ఞుడగు నాయట్టివాఁ డజ్ఞానముచేత లేఖకదోషముల గుర్తించి ముద్రింపఁజాలకున్నను గేవలము తాళపత్రములలోని పఠన శ్రమములు బోఁగొట్టి దీని సర్వజన హస్తగతము చేసినందుననే యించుక సంతోషింతురుగాక. భాషలో గతిపయాక్షర జ్ఞానము సంపాదించిన ఋణము నిమ్మహాకవి కీర్తి పునఃప్రకటనముచే వాచికొన గలిగితిగదా యదియె చాలునని పరమానందమున బొంగుచున్నాఁడను."

చిత్తశుద్ధిగల సారస్వతోపాసకుని సంతృప్తి యిదే.

నన్నెచోడుని రచన ఆధారంగా భాషాశాస్త్రదృష్టితో వ్యాకరణ మొకటి రచించాలని కూడా బుద్ధిపొడమింది కవిగారికి. దానిలో "ప్రాచీన శబ్దానుశాసనము" వ్రాయసాగినారు.

"వ్యవహారాదారాదుల
నవనవతయ కోరు నవ్య నాగరకుల నీ
నవసూత్ర ప్రాచీనాం
ధ్రవచో వ్యాకరణ మెంత నవ్వించునొకో!"

సూత్రము :

"భాషలో శబ్దములు ప్రాయశః హలంతములు, ద్విత్వములు తక్క హల్సంయుక్తాక్షరములు లేవు. పరస్థ ఋకారసదృశరేఫము వ్యతిపాతవిధిచే (metathesis) ఋూర్వాక్షర సంయుక్తి చెందు. హలంతముల కభావము పరమైనచో నికారోకారములు నూతగా నగు. అనునాసికాంతముల కూఁతగా నుకారము వచ్చునపుడు తత్తద్వర్గ తృతీయాక్షర మూఁతగా నాగమ మగు."

అని ప్రారంభించి ఇరవై రెండు సూత్రాలు రచించారు. నేటి వ్యావహారిక వ్యాదికీర్షులందరికీ ఇవి ఉపాదేయాలు.

శబ్ద రత్నాకర నిఘంటు గ్రథనకాలానికి కుమారసంభవంవంటి కావ్యాలు లభించనందున పెక్కు పదాలు దానిలో చేరలేకపోయాయి. కనుక కవిగారు "ఇందు శబ్ద రత్నాకరాది నిఘంటుస్థములు కాని ప్రాచీన శబ్దములకు వర్గాంతరముగల శబ్దములకు భాషాంతర ప్రయోగముల ననుసరించియు సందర్భోచితముగను నర్థము" వ్రాశారు. ఈ అర్థవివరణ కవిగారి వివిధ భాషా పరిజ్ఞానానికీ, భాషా శాస్త్రదృష్టికి నికషం.

కవిగారు ఆంధ్రావళికి బహూకరించిన మరొక రచన "ప్రబంధమణిభూషణము." ఇదొక సంచిత కృతి. సంచిత కృతి అంటే పెక్కు కావ్యాల నుంచి వివిధ భాగాలు గ్రహించి ఒక కథగా కూర్చినది. "ఆంధ్రభాషలో నాకు లభించినంత వట్టు పరికింపనట్టి కృతికర్తల మడికి సింగనయే ప్రథముఁడు.

అతడు ప్రాచీన పంచతంత్రి. ప్రాచీన కామందకము, ముద్రామాత్యము, నీతిభూషణము, బద్దెననీతి. కుమారసంభవము, భారతము, మనుమంచి భట్టు నశ్వశాస్త్రము మొదలగు గ్రంథములలోని రాజనీతి పద్యముల నన్నియు నేరి "సకలనీతి సమ్మత" మను గ్రంథమును గూర్చెను. పిదప క్రీ. శ. 1920 లో జగన్నాథ కవి రత్నాకర మను గ్రంథమున బ్రాచీన పద్యముల నెత్తి యోజ పఱచి యైదాశ్వాసముల కృతి రచించెను. అయిన నీ రెండును గథా రూపముల గ్రథితములు కావయ్యె.

"ఉజ్జయినీ నాథుఁడగు రాజశేఖరుఁడు పాంఢ్యభూపతి పుత్రియగు రత్న సుందరిచే స్వయంవరమున వరింపబడెను. నూతన కథావస్తువు పరిణమించు నట్లు నానా ప్రబంధ పద్యములిందు బొసంగింప బడినవి."

ఈ సమయంలోనే కవిగారు ఆంధ్ర, సంస్కృత భాషలలో ఎం. ఎ. పట్టం పుచ్చుకున్నారు. కవిగారు నలభయ్యవపడిలో మద్రాసు న్యాయశాస్త్ర కళాశాలలో చేరి ఎఫ్. ఎల్. పూర్తిచేశారు, బి. ఎల్. చదివి పరీక్షకు కూర్చో లేదు. ఈ సంగతి ఆయన సహాధ్యాయులు మద్రాసులో ప్రముఖ న్యాయ వాది శ్రీ ఆరావముదు అయ్యంగారు నాతో అన్నారు.

"విస్మృత కవులు" గ్రంథమాల క్రింద కవిగారు ప్రచురించిన తక్కిన ప్రాచీన గ్రంథాలు త్రిపురాంతకోదాహరణము, నీతిశాస్త్ర ముక్తావళి (బద్దెననీతి), ఆంధ్ర తిరువాయి మొళి, శ్రీరంగ మహత్త్వము, సకలనీతి సమ్మతము- అనేవి. సలకనీతి సమ్మతమును ఆంధ్రపత్రికవారు ఆంధ్ర గ్రంథమాలలో ముద్రిం చారు.

వనపర్తిలో ఉన్నప్పుడే ఆయన తెలంగాణాలో పర్యటించి శాసన ప్రతి బింబాలు సేకరించి "లిథిక్ రికార్డ్స్ ఆఫ్ హైదరాబాద్ స్టేట్" అనేపేర ప్రక టించారు.

శ్రీరంగమహత్త్వము భైరవకవి రచించిన ఐదాశ్వాసాల ఉత్తమ ప్రబంధం. ఇది 1912 లో చెన్నపురిలో ముద్రింపబడింది. దీని ముద్రణ వేళకు విమర్శకుల ఏటుపోటు నూటలకు, అపవాదులకు కవిగారి మనస్సు

ఎంతో వ్యథపడి ఉంటుంది. కనుకనే దాని పీఠికలో "తాళీదళసంపుట ప్రకర కాంతారమున దిరిగి ప్రమాద కంటకముల తొలగించుకొనుచు నపూర్వ పదార్థ వివేచనంబు సేయుచుండువారి యవస్థ తత్తుల్యులకుఁ గాని యన్యుల కెఱుంగరాదు. వాగ్బ్రహ్మకోశము నిర్మర్యాదము: ప్రతిభ నవోన్మేషిణి, కాలము విస్మృతి నిదానము; సామాన్య లోకము జీవయాత్రికపరాయణము; అయ్యో! యిక మృతి చెందుచున్న పురాణకవి బ్రహ్మల గతియెట్లు అని యనుతాప మాత్రంబున సముద్ర జలమున సేతుము గట్టినట్లే కావ్యోద్ధరణ క్రియకుం బూనితి గాని వైదుష్య దర్పమునంగాదు. స్వీయ ప్రయాసముల మాట బోనిచ్చి శతచ్ఛిద్ర వ్యాకులంబగు తాళదళ పరిశోధనం బభ్యాస వశంబున జుగుప్సారహితంబుగ నలవరచుకొని కార్యము నెట్లో నిర్వహించుచుండుటయు గొంద ఱీర్ష్యాగ్రస్తులు చూచి యోర్వక పరిపరి విధముల నను బాటుపఱుచు చున్నారు." అని వ్యాకుల పడినారు.

ఈ ఈర్ష్యాద్వేష జుష్టమైన తెలుగు సారస్వత రంగంకంటే విస్తృతమైన సంస్కృతరంగమే మెరుగనుకున్నారు కాబోలు! వనపర్తి ఉద్యోగాన్ని వదలిన తర్వాత చెన్నపురిలో పచ్చయప్ప కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా రెండు మూడు సంవత్సరాలు పనిచేశారు. పరిశోధకునికి అధ్యాపక పదవి విజాతీయం కాకపోయినా, కొద్దిగా ప్రతిబంధకమనే అనాలి. తర్వాత కవిగారికి అదృష్టవశాత్తు తాము కోరిన కొలువే దొరికింది.

మద్రాసు ప్రభుత్వం విద్యాశాఖవారు రాష్ట్రమంతటా పర్యటించి తాళపత్ర గ్రంథాలు సేకరించడానికి కొందఱు పండితులను నియమించారు. తాళపత్ర కాంతారంలో తిరగడంలో అనుభవం. దానికి మించిన శ్రద్ధానుభూతులు గల కవిగారు ఆ పండితులలో ఒక్కరు కావడం సహజం. ఆయనకు తోడు మరొక మహోద్దండ పండితులు శ్రీ ఎస్. కె. రామనాథశాస్త్రిగారు; ఉభయ మీమాంసల లోను. అలంకారశాస్త్రంలోను పారం చూచినవారు, పాలక్కాడు వాస్తవ్యులు. బంగారానికి తావి అబ్బినట్టు, రామునికి లక్ష్మణుడు తోడయినట్టు అయింది. ఇద్దరూ ఆంధ్ర, కర్ణాటక, తమిళ, కేరళ ప్రాంతాలలో మారుమూలలన్నీ తిరిగారు, అపూర్వ గ్రంథాలు సేకరించారు. ఆ ఆరేడు సంవత్సరాలే కవిగారికి యావద్భారతకీర్తి, విశ్వవిఖ్యాతి కలిగించాయి.

ముఖ్యంగా కేరళలో వీరికి అపూర్వ గ్రంథాలు దొరికాయి; సంస్కృత నాటకాలు, భరతుని నాట్యశాస్త్రం ప్రతులు, భోజుని శృంగార ప్రకాశం అనే అలంకార శాస్త్రగ్రంథం. ఇంకా ఎన్నో. శ్రీ ఎస్. కె. రామనాథశాస్త్రి గారు తాళపత్రగ్రంథ సంపాదనలో తామిద్దరూ పడిన శ్రమలు కథలుగా చెప్పేవారు.

"నారేయి అనే నంబూద్రి యింట్లో ఏడువందల తాళపత్ర గ్రంథాలు కనిపించాయి. వాటిలో రెండు వందల యాభై మేము ఏరుకున్నాము. ఇవన్నీ మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తకాలయానికి పంపాలి. అప్పుడు ఆ పుస్తకాలయం క్యూరేటర్ శ్రీ వరదాచార్యులుగారు. షోరనూరుకు వెళ్ళాలి, నది పొంగి వచ్చింది. ఎంతో శ్రమపడి సేకరించిన పుస్తకాలు పోతే మా పంచప్రాణాలు ఎగిరిపోవా? కొత్తగా ఒక పెట్టె చేయించి, దానిలో వాటిని భద్రపరచి మద్రాసుకు పంపాము. పెట్టె చేయించడానికి యాభై రూపాయ లయింది."

"శృంగార ప్రకాశం మలబారులో 12 ప్రకాశాలు కలది మాత్రమే దొరికింది. ఎర్నాకుళంలో 36 ప్రకాశాలది దొరికింది. దీనికి ఎంత శ్రమ పడవలసి వచ్చిందనుకున్నారు? మొదట్లో నంబూద్రీలు తమవద్ద నున్న గ్రంథాలు చూపనైనా చూపేవారుకారు. ఎంత ప్రాధేయపడాలో! ఎంతబంగ పోవాలో!"

"ఒకసారి పై అధికారులతో రభసపడవలసి వచ్చింది. అప్పుడు మహామహోపాధ్యాయ కుప్పుస్వామి శాస్త్రిగారు ప్రాచ్యలిఖిత పుస్తకాలయం క్యూరేటరు. ఒకచోట బోధాయనుని భగవదజ్జుకం, రెండు వ్యాఖ్యానాలతో అర్థశాస్త్రం, ధ్వన్యాలోక వ్యాఖ్యానం, ఇంకా ఎన్నో దొరికాయి. మొత్తం 850 గ్రంథాలకు 300 రూపాయలిచ్చి కొన్నాము. ఈ సంగతిని కుప్పుస్వామి శాస్త్రిగారికి తెలిపాము. ఇంతధర పెట్టడం తనకు ఇష్టం లేదని ఆయన జవాబు వ్రాశారు. "మీ కిష్టం లేకపోతే మేము కొంటాము. వదులుకుంటే మరల దొరకవేమో!' అని మరల వ్రాశాము. ససేమిరా వద్దన్నారు కుప్పుస్వామి శాస్త్రిగారు. అప్పుడు విద్యాశాఖ డైరెక్టర్ స్టోన్. ఆయనకు వివరించాము. ఆఖరుకు మా మాట నెగ్గింది."

కుమారిలుని మీమాంసా వార్తికాలకు ఆయన శిష్యుడు ఉంబేకుడు—భవభూతి వ్రాసిన వ్యాఖ్య ఈ "నారేయి" నంబూద్రి ఇంటిలోదే.

"ఉంబేకః కారికాం వేత్తి
తంత్రం వేత్తి ప్రభాకరః,
మండన స్తూభయం వేత్తి
నోభయం వేత్తి రేవణః"

అనే నానుడి కలిగింది ఈ ఉంబేకుని వల్లనే.

"కేరళంలో ఒకచోట యోగభాష్య వివరణం దొరికింది. దాని సమాప్తిలో 'శంకరాచార్య విరచితం' అని ఉంది. ఇది శంకరాచార్య విరచితం కాదని మేమిద్దమూ అభిప్రాయ పడ్డాము. (దీనిని మద్రాసు విశ్వవిద్యాలయం ద్వారా నేను ప్రకటించిన 'స్ఫోటసిద్ధి' అనే గ్రంథం పీఠికలో వివరించాను.) వెదకగా, వెదకగా ఒక విడితాటాకుమీద "పయ్యూర్ భట్టేరి ప్రణీతం యోగభాష్య వివరణం" అని దొరికింది, మా గుండె కుదుటబడింది. ఈ భట్టేరి పేరు శంకరన్ అట పూర్వాశ్రమంలో. సన్యసించిన మీదట శంకరాచార్యు డయ్యాడు. ఇంతగా మేము పరిశ్రమించి సత్యం ప్రకటించినా, ఆ గ్రంథం శంకరాచార్య విరచితమనే ఇటీవల ముద్రించారు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంవారు"

శ్రీ రామనాథశాస్త్రిగారి వద్దకు వెళ్ళితే ఈలాటి ముచ్చట్లు ఎన్ని సంవత్సరాలపాటైనా చెప్పేవారు. వారూ పది సంవత్సరాల క్రితం పరమపదించారు.

ఆరేడు సంవత్సరాలు ఇలా సాగింది. ప్రభుత్వమువారు ప్రాచీన గ్రంథ సంపాదనను ఆపేశారు. కవిగారు "దక్షిణభారతి" అనే గ్రంథమాల స్థాపించి సంస్కృత గ్రంథాలు ప్రచురించడం ప్రారంభించారు. ఈ గ్రంథ మాలకు శ్రీ రామనాథశాస్త్రిగారు సంయుక్త సంపాదకులు.

ఈ గ్రంథమాలకింద వెలువడిన మొదటి గ్రంథం నాలుగు భాణాల సంపుటి. దీని పేరు 'చతుర్భాణీ.'

> "వరరుచి రీశ్వరదత్తః
> శ్యామిలక శ్శూద్రకశ్చ చత్వారః,
> ఏతే భాణాన్ బభణుః
> కా శక్తిః కాళిదాసస్య ?"

అని ఎవరో అజ్ఞాత విమర్శకుడు సవాలు చేసిన రూపక రాజాలివే. ఈ సంపుటిలో ఉన్నవి శూద్రకుని పద్మప్రాభృతకం, ఈశ్వరదత్తుని ధూర్తవిట సంవాదం, వరరుచి ఉభయాభిసారిక, శ్యామిలకుని పాదతాడితకం. ఇది ప్రకటిత మైంది 1922 లో.

రెండవ గ్రంథం కుందమాల నాటకం. దిఙ్నాగాచార్యునిది. మూడవది అవంతిసుందరీ కథా. ఇది దండి దశకుమార చరిత్రకు మూలమైన విస్తృత గద్యకావ్యం. నాల్గవది శూద్రకుని వత్సరాజ చరిత్రం. ఐదవది విజ్జికాదేవి రచించిన కౌముదీ మహోత్సవం. ఇలా పుంఖానుపుంఖంగా వచ్చాయి. అన్నీ అపూర్వాలే. అన్నీ రసగుళికలే

నన్నెచోడుని కుమారసంభవంపై వాదోపవాదాలు చెలరేగినట్లే కుందమా దిఙ్నాగ కర్తల కమా, కాదా అని అప్పుడు దేశమంతటా గాలిదుమారం రేగింది. "జర్నల్ ఆఫ్ ది బిహార్ అండ్ ఒరిస్సా రీసెర్చ్ సొసైటీ" పత్రికలో కవిగారి ప్రతిభను ముక్తకంఠంతో కీర్తించిన శ్రీ కె. పి. జయస్వాల్ ఇది దిఙ్నాగ కర్తృకి మనడం సందేహాస్పద మన్నారు.

కుందమాలవి తంజావూరు, మైసూరు ప్రాచ్య లిఖిత గ్రంథాలయాలలో చెరి రెండు అసమగ్ర ప్రతులు దొరికాయి. రెండిటిలో మొదలు లేదు. మరి రెండిటిలో చివరలేదు. మలబారులో మరిరెండు ముక్కలు దొరికాయి. అన్నిటినీ జోడించగా సమగ్ర నాటకమైంది.

"జయస్వాల్ అంతటివారు ఇది దిఙ్నాగ కర్తృకం కాదంటున్నారే మీరేమీ సంజాయిషీ ఇవ్వరేమండీ ?" అని కవిగారిని ప్రశ్నించా నొకసారి. "ఇదివరకే చెప్పాను గదయ్యా నా తత్త్వం, ఒకమాట ఒకబాణం. నా అభి ప్రాయం ఒక్కసారే చెబుతాను. నమ్మితే నమ్మండి, లేకపోతే లేదు. నాకెందుకు?

మొదలున్న కుందమాల లిఖిత ప్రతులలో "అరారావపుర వాస్తవ్య దిఙ్నాగస్య" అని ఉంది. అరారావపుర మేదో మొదట మాకు తెలీలేదు. కుమారదాసు రచించిన జానకీహరణ నాటకం దొరికింది ఇంతలో. దానితోని అరారావపుర వాస్తవ్యస్య అని ఉన్నది అనూరాధపుర అనడానికి. కుమారదాసుడు అనూరాధపుర వాస్తవ్యుడని లంక చరిత్రవల్ల తేలింది. మరి ఆ అరారావపుర వాస్తవ్యుడైన దిఙ్నాగుడు ఎక్కడివా డౌతాడు ?" అని ఆయన అన్నారు.

కుందమాల బొంబాయిలోని తత్త్వ వివేచనాఖ్య ముద్రణ యంత్రాలయంలో ముద్రించబడింది. దీని వ్యయభారం దేశోద్ధారక, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు భరించారు. సంపాదకులు తమ పీఠికలో వారికి కృతజ్ఞత తెలిపారు.

కాని ఈ గ్రంథమాల కొన్నేళ్ళ తర్వాత ఆగిపోయింది. కవిగారు మద్రాసు ప్రభుత్వం విద్యాశాఖలో చేరి రాజమండ్రి కళాశాలలో కొలువుకు కుదిరారు. రామనాథశాస్త్రిగారు మద్రాసు విశ్వవిద్యాలయం పరిశోధన శాఖలో చేరారు.

కవిగారు రాజమండ్రిలో ఉన్నప్పుడే భరతనాట్య శాస్త్రం అభినవగుప్తుని అభినవ భారతి అనే వ్యాఖ్యతోసహా సంస్కరించిపెట్టారు దీని మొదటి సంపుటి "గాయక్వాడ్ ఓరియంటల్ సిరీస్" కింద 1928 లో ప్రచురించబడింది. అప్పటికి కవిగారు వాతావరణం. శీతోష్ణస్థితి పడనందున రాజమండ్రి వదలి తిరుపతిలో విద్యాశాఖాధికారిగా చేరారు.

భరతనాట్యశాస్త్రం 37 అధ్యాయాల బృహద్గ్రంథం. దేశం నాలుగంచుల నుండి సంపాదించిన 40 ప్రతులను తైపారు చేసి ఆయన పరిష్కృత ప్రతి సిద్ధపరచారు. చిదంబర దేవాలయంలో నాట్యకరణములు (విన్యాసాలు) గండరించి, వాటికిందభరతనాట్య శాస్త్రంనుంచి వాటికి తగిన లక్షణశ్లోకాలు కూడా చెక్కి ఉన్నాయి. ఇవి దాదాపు 93 ఉన్నాయి. ఇవి 13 వ శతాబ్దిలో ఆ ప్రాంతాన్ని ఏలిన రాజసింహదేవుని కాలంలో చెక్కబడ్డాయి. కవిగారు పురాతత్త్వశాఖ అనుమతితో వాటి ప్రతిరూపాలను తమ నాట్యశాస్త్రంలో ముద్రించడంతో నాట్యవేద జిజ్ఞాసువులకు లక్ష్యలక్షణ సమన్వయజ్ఞానం సులభతమ మైంది.

భరతనాట్యశాస్త్రం నాలుగు సంపుటాల వరకే ముద్రించబడింది. "నా జీవితంలో పూర్తవుతుందో లేదో ఇది!" అని ఆయన తరుచు అనుకుంటూ ఉండేవారు. అదే నిజమైంది.

అప్పుడే ఆయన తిరుపతి దేవస్థానం ప్రకటించే 'వెంకటేశ్వరా జర్నల్' లోను, ఇతర పత్రికలలోను అపూర్వ పరిశోధన వ్యాసాలు వ్రాశారు. వేంకటేశోదాహరణం ప్రచురించారు. భారతిలో 'పుష్పాంజలి' అనే పేర పలువురు విస్మృత కవులను గూర్చి అచుంబిత విషయాలు వ్రాశారు, పూర్వం ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధంలోను, ఉగాది సంచికలలోను అపూర్వ వ్యాసాలు వ్రాశారు. చింతామణి వేశ్యకాదని, అదొక యోగిపేరని, కేరళ వాస్తవ్యుడని నిరూపించిన వ్యాసం గొప్పది.

ఈ సమయంలోనే గాంధర్వ వేదాధ్యాయులకు శాశ్వతమైన మహోపకారం చేశారు. అదే "భరతకోశ" గ్రంథం. ఇది భరతాది ప్రణీత నాట్య సంగీత శాస్త్రగ్రంథస్థ పారిభాషిక పదకోశం. భరతాచార్యుడు, కోహకుడు మొదలు అర్థవేది వరకుగల నాట్యశాస్త్రకారుల గ్రంథాలను ఆయన క్షుణ్ణంగా పరిశీలించి కూర్చిన మహానిఘంటు విది. కవిగారిని అమరులను చేసిన ఉద్గ్రంథ మిది. దీని పీఠికలో ఆయన ఇలా చెప్పుకున్నారు :

" ...ఖండాత్మకాన్ లబ్ధాన్
తేషాం గ్రంథా న్విలోక్య చ.
అజ్ఞాత కర్తృకా నన్యాన్
వాది మత్త గజాంకుశం.

వీణా రహస్య నామానం
కుండలీ మణి దర్పణమ్,
నృత్తారత్నాకరం నాట్య
దర్పణం నాట్యలోచనమ్.

ఆంధ్ర ద్రవిడ కర్నాట
కేరళానాం చ వాఙ్మయమ్,
దృష్ట్వా గాంధర్వ వేదార్థం
కావ్యాలంకార లక్షణీ.

అనుతంత్రేచ భోజాది
నిర్మితా నతివిస్మృతాన్,
అంతర్విగాహితుల సమ్యక్
దుస్సహా నేకజన్మని.

సంగృహ్య సమ్య గేతేభ్యః
సుశబ్దాన్ పారిభాషికాన్.
నిరుక్తాం స్తత్ర తత్రైవ
స్వాతంత్ర్య మపహాయ చ,

నామ్నా భరతకోశోఽయం
విద్యా వ్యసనినాం ముదే,
రామకృష్ణేన కవినా
సార్ధవర్ష ద్వయావధౌ.

ఏకోన సప్తతితమే
వయ స్యారచ్య లీలయా.
శ్రీ వేంకటేశ దివ్యశ్రీ
పాదయో రర్పితో ముదా.

అపభ్రంశాః ప్రమాదాశ్చ
సంభవేయుః క్వచిత్క్వచిత్,
అపాస్య దోషాన్ గృహ్ణంతు
సరసీ వాంతరం జలమ్.

యథాగుణ మముం ధీరాః
జ్ఞాతవిద్యా పరిశ్రమాః,
ప్రీణాతు భగవాం శ్చాస్మిన్
వాగ్రూప కుసుమార్చనే."

69 వ ఏట అయన రచన యిది. అంతవరకు ఆయన చేసిన నాట్యశాస్త్ర పరిశ్రమ కిది పూర్ణఫలం, అయన నాటక పరిశ్రమకు కారణం

భరతనాట్య శాస్త్రానికి అభినవ గుప్తాచార్యుని టీకను అర్థంచేసుకోడానికే; దానికే అయన భరతకోశం పీఠికలో ఇలా వివరించుకున్నారు :

"తత్పుత్రో రామకృష్ణాఖ్యః
పూర్వాచార్య వినిర్మితాన్
నష్టప్రాయా న్మహాగ్రంథాన్
సమన్వేష్టుం సముద్యతః.

భట్టాభినవగుప్తార్య
ప్రోక్తా౽భినవభారతీమ్,
వ్యాఖ్యాం భరత సూత్రాణాం
మహార్థ గుణగౌరవామ్.

సంవాద్య తాం పరిజ్ఞాతుం
నిశ్శేషం నాట్య వాఙ్మయమ్,
ద్రష్టవ్య మితి నిశ్చిత్య
సోద్యగీష్ట చిరాయ తత్."

దీనిని వేంకటేశ్వర ప్రాచ్యగ్రంథమాలలో ముప్ఫైయవ కుసుమంగా ప్రచురించారు.

భరతనాట్యశాస్త్రం ఎవరు పరిష్కరించి ప్రకటించాలి- అన్న విషయమై కూడ దేశంలో పెద్ద రభస జరిగింది. ఉత్తరదేశంవారు పలువురు శ్రీ ఎస్. కె. దేను సిఫార్సు చేశారు. కాని, శ్రీ జయస్వాల్ పట్టుపట్టి రామకృష్ణ కవిగారు వినా మరొకరు దానిని ముట్టడానికి కూడా వీలులేదన్నారు. విశాల దృష్టిగల పండితుల ఔదార్యం అలాటిది. కుందమాల కర్తృత్వంలో తనకు కవిగారితో అభిప్రాయభేదం ఉన్నా, కవిగారి ప్రతిభా వ్యుత్పత్తులను గుర్తించినవారు గనుక, జయస్వాల్ ముక్తకంఠంతో ఆయనను సమర్థించారు. ఆయన ఆశించినట్టే కవిగారు భరతనాట్య శాస్త్రాన్ని నిష్కృష్టంగా ప్రపంచానికి అందజేశారు. దాని మేలి మిగడగ పారిభాషిక పదకోశం కూడా సిద్ధపరచారు.

కవిగారి సంస్కృత కవిత కూడ అతి ప్రౌఢంగా ఏ మాఘ భారవులనో తలపించేది. భరతకోశ మంగళ శ్లోకమే చాలు దానికి నిదర్శనం :

"పరివేశాక్షేప నిష్కాయ ప్రసాదాంతరితం జగత్,
కృతం నాట్యా యితం యేన తం నమామి మహానటమ్."

ఇంతటి కవి, పండితులు పరిశోధకులు గనుకనే కవిగారిని ఎం. కృష్ణ మాచార్యులు (ఎం. ఎ., ఎల్. ఎల్., పి. హెచ్. డి.) తమ హిస్టరీ ఆఫ్ క్లాసికల్ శాన్‌స్క్రిట్ లిటరేచర్‌లోను, తదితర సాహిత్య చరిత్రకారులు తమ గ్రంథాల లోను ప్రమాణంగా పెక్కుచోట్ల పేర్కొన్నారు.

1935 కు తిరుపతి విద్యాశాఖాధికారి పదవి ముగిసింది. పిదప కవిగారు మద్రాసు విశ్వవిద్యాలయం చరిత్ర శాఖలో మెకంజీరికార్డుల పరిశీలకులుగా నియమించబడ్డారు. కర్నల్ మెకంజీ నూరేళ్ళక్రితం మద్రాసురాష్ట్రంలో సర్వేయర్ జనరల్‌గా ఉండేవారు. ఆయన నారాయణరావు, వేంకటరావు అనే ఇద్దరు బహుభాషావేత్తలను, బహ్వక్షరచణులను నియమించి రాష్ట్రంలోని వివిధ చారిత్రకాంశాలను సంగ్రహించి లిఖితం చేయించారు. అవే మెకంజీ రికార్డులు. వాటిని మద్రాసు విశ్వవిద్యాలయంవారు ఆంగ్లంలో అనువదించ డానికి కవిగారిని నియమించారు, ఈపని దాదాపు ఆరేళ్లు సాగింది.

ఇంతలో తిరుపతిలో దేవస్థానంవారు ప్రాచ్య పరిశోధనాలయం నెల కొల్పారు; కవిగారిని సంస్కృత శాఖకు రీడరుగా నియమించారు. మరల అక్కడ పది సంవత్సరాలు పనిచేశారు. కవిగారికి సహస్రమాసాలు ఎప్పుడో నిండాయి. కనుక ఆ ఉద్యోగంనుంచి విరమించవలసి వచ్చింది. ఇదే ఆయన కడపటి ఉద్యోగం.

చేతికి అందివచ్చిన పెద్దకుమారుడు. తన అభిప్రాయాలను, పథకాలను కొనసాగించగలడని నమ్మిన పెద్దకుమారుడు అంతకు ఇరవై సంవత్సరాల క్రితమే అకాలమరణం చెందడం తక్కిన ఇద్దరు కుమారులూ తమ సంసార యాత్ర జరుపుకొనడంతోనే సతమతమౌతూ తమకు ఏ విధంగానూ తోడ్పడక పోవడం, ఈ దురవస్థలో పెద్దకుమార్తె భర్త కాలధర్మం చెందడం మున్నగు కష్టాలవల్ల కవిగారు అంత్యకాలానికి ముందు ఐదారేళ్లగా చాలా వ్యాకుల పడుతూనే ఉన్నారు. వీటికితోడు తగినంత డబ్బు లేకపోవడం. ఈ దుస్థితిని నాట్యశాస్త్రాభిమానులైన ఆచార్య శ్రీ పి. శ్రీరామ అప్పారావుగారు (తెలుగు

అకాడమీ పూర్వాధ్యక్షులు, రాష్ట్రప్రభుత్వ సాంస్కృతికశాఖ పూర్వ ప కార్యదర్శి, ఆంధ్రభాషాధ్యాపకులు) పెద్దలందరి సంతకాలతో కవిగారికి గౌరవ భృతి ఇవ్వవలసిందిగా భారత ప్రభుత్వానికి మహజరు పెట్టించారు. ఎంతో ప్రయత్నంమీద భారత ప్రభుత్వం కొంత, ఆంధ్రప్రభుత్వం కొంత గౌరవ భృతి (దాదాపు 150 రూపాయలు) మంజూరు చేశాయి. ఆ ప్రయత్నంలోనే కవిగారు చెన్నపురికి వచ్చి కొంతకాలం పండితుల, మిత్రుల ఇంట గడిపారు. నెలరోజులపాటు నాకు, నా అర్ధాంగి అనంతలక్ష్మికి ఆయనకు సేవచేసే భాగ్యం లభించింది. అప్పటికే ఆయనకు ముసలి ముంచుకొనివచ్చింది. అంగాంగాలు స్వాధీనం తప్పాయి. గౌరవభృతిని కొన్ని నెలలపాటు అనుభవించారేమో; నాతో ఒకప్పుడు అన్నట్టు 'సెంచరీ' కొట్టలేకపోయారు; 91 వ ఏటనే (1957 సెప్టెంబరు 21 వ తేదీన) పరమపదం చెందారు.

ఆయన అకల్మష దృష్టులు. అమాయకమైన మాటలూ (సాహిత్య వాదోపవాదాలతో కొందరు వేసే అపవాదుల మూటతో నాకు సంబంధం లేదు) ఆయనతో పరిచయమున్న వారెవరూ మరువలేరు. యుక్తియుక్తంగా నచ్చచెబితే ఒప్పుకునే ఔదార్యం ఆయనది. ఈ సందర్భంలో శ్రీ ఎస్. కె. రామనాథ శాస్త్రిగారొక చక్కని ఉదాహరణ చెప్పారు

"తాళపత్ర గ్రంథాలు చూస్తున్నప్పుడు వెంటనే ఏమి తోస్తే అది గుర్తుపెట్టుకోడం ఆయన స్వభావం. ఒకమారు సిద్ధాంతసిద్ధాంజన మనే అద్వైత గ్రంథవ్యాఖ్యానం దొరికింది. దానిపేరు రత్న ... లికా అని ఉంది. రత్న తర్వాత ఒక అక్షరాన్ని పురుగు తినింది. కవిగారు దానిని రత్నబాలికా అని పూరించారు. 'బాలిక అని ఉండడం అసమంజసం. తూలిక అని ఉండాలి. అంజనాన్ని పూసుకునేది తూలికతో కదా. ఇంతచిన్న సంగతి తెలేలేదే' అని శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు ఆక్షేపించారు. 'నిజమే. ఆ తొందరలో తోచలేదు'. అని కవిగారు అంగీకరించారు."

"మరొకమారు ఒక ఉత్తమపాఠం స్ఫురణకు వచ్చిందనుకోండి. అప్పుడాయన ఉబ్బితబ్బిబ్బు కావడమనేది కూడా లేదు. ధ్వన్యాలోక లోచన వ్యాఖ్యలో ఒక ఘట్టంలో 'సన్నిహిత సహచరీ విరహకాతర క్రౌంచాక్రంద జనితః శోకః' అని ఉంది. దీనిని శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు చూచారు.

'మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్.

అనే శ్లోకార్థానికి విరుద్ధంగా కనిపించి సన్నిహిత అనే మాటను సన్నిహిత (చంపబడిన) అని దిద్దివేశారు. ఇప్పుడు అర్థం పూర్తిగా చెడింది. చంపబడింది సహచరి కాదు; సహచరుడే; మానిషాద శ్లోకం ప్రకారం. కనుక దిద్దడం పొసగదు. క్రౌంచాక్రంద అన్నప్పుడు క్ర అనే అక్షరం స్పష్టంగా లేదు. కనుక సన్నిహిత అనే పాఠమే అట్టేపెట్టి ఏకశేషంచేసి, క్రౌంచాస్యంద' అని దిద్దితే సరిపోవడమేకాక మరింత మధురమైన అర్థం వస్తుందని మేము సూచించాము. మొదట రెండు పక్షులూ సన్నిహితమైనవి. తరువాత సహచరీ విరహ కాతరమైనది మగపక్షి. వాటిని విడదీయడంవల్ల కలిగిన శోకం స్థాయిభావం అని వివరించాము. "సీతావిరహం, రామునిశోకం ధ్వనితమౌతాయి. స్యంది గతిశోషణయోః అన్నది ధాతువు. శోషణం వియోగః. దీన్ని కుప్పుస్వామి శాస్త్రిగారు అంగీకరించారు."

ఎన్నిరంగాలలో ఎంతకృషిచేసినా ఎంత విజ్ఞాన పాథోనిధులైనా మనను నిర్వైరపోజేయగలరేకాని వినయ వినమితోత్తమాంగులను చేయలేరు. మనసు నిర్మలమై మనిషిగా పెరిగినవారే మనను వినమ్రుల చేయగలరు. అట్టి మనస్వి కవిగారు.

తాళపత్రగ్రంథ సంపాదనపై ఆయనకున్న మోజు వర్ణనాతీతం, నిజమే. అలాటిది లేకపోతే చెన్నపురిలో నేటి ప్రాచ్యలిఖిత పుస్తక గ్రంథాలయమే ఉండదు, మనకు అపూర్వ గ్రంథాలే కంటబడేవి కావు. తనదగ్గరకి వచ్చిన ప్రతివారినీ వెర్రిగా ప్రశ్నించేవా రాయన. "ఏమైనా తాటాకు గ్రంథాలున్నాయా ? మీ తాడిమర్రి, చియ్యేడు. ముక్తాపురం చిగుళ్ళరేవు గ్రామాలలో పూర్వం మహాపండితు లుండేవారు. అక్కడ వెతికితే కొన్నైనా దొరక్కపోవు." అనేవారు నాతో. హనుమచ్ఛతకం గురించి తరచు అందరినీ అడిగేవారు. నేను లాహోరులో ఉన్నప్పుడు "అక్కడ నన్నెచోడుని కుమార సంభవం ఉందని విన్నాను. పాఠాంతరాలు వ్రాసి పంపవలసింది." అని జాబువ్రాశారు. శ్రీ విశ్వబంధుశాస్త్రిగారి వేదిక్ బిబ్లియాగ్రఫీ లైబ్రరీలోను, ఇతరత్రాను దానికోసం

గాలించాను. ఒక్కటి మార్గం నిజమైంది. ఒక తాటాకులకట్ట మొదటి ఆకు పైన "కుమారసంభవం" అని వ్రాసి ఉంది. దానినే ఎవరో భ్రమపడి కవిగారికి చేరవేసి ఉంటారు అది కొన్ని తెలుగు ప్రబంధ పద్యాల కట్ట. ఇలా కవిగారు తాటాకులకోసం ఎంతో వెచ్చించారు.

కవిగారి తీరని కోరిక ఒకటి తీరకనే మిగిలిపోయింది. అది ఆయన వ్రాసిన "వసంతవిలాస" మనే కావ్యప్రచురణ. కళాపూర్ణోదయానికి దీటు రాగల ప్రౌఢప్రబంధ మది. దాని ముద్రణకు కనీసం నేడు నాలుగువేల రూపాయలన్నా కావాలి. మరి కవిగారి కిది సాధ్య మెలా ? దాని ముద్రణ భారమే కాదు ! ఆయన వ్రాసిన వందలాది ఆంగ్ల విమర్శ వ్యాసాల ముద్రణ బాధ్యతకూడ ఆంధ్రావనిదే.

ఎంత చిన్న ఉపకారం చేసినా మహాకృతజ్ఞత తెలిపే అత్యుదార మనస్తత్వం ఆయనది. ఆయన నా ఇంట్లో ఉన్నప్పుడు నా ఇల్లాలు అనంత లక్ష్మి తోడుపెట్టిన పెరుగు వడ్డించేది ఆయన మురిసిపోయి "ఎంత శ్రమ తీసుకన్నావమ్మా." అని రోజూ అనేవారు. ఈ ప్రవృత్తి ఆయనకే కాదు, ఆ యుగపు పండితుల కందరికీ ఉందేమో అనిపిస్తుంది. నేడు రచయితలు ఎంత ఉపకారం పొందినా ఇతరులకు కృతజ్ఞతాలవమైనా తెలుపడానికి ఇష్టపడరు. కాని కవిగారు తమ భరతకోశం నకలుచేసిన పెద్దమనిషికి కూడ నోరార, మనసార కృతజ్ఞత తెలియజేశారు.

"నిష్కృష్య కవినా ప్రోక్తో
న్యాయవేదాంత వేదినా,
నృసింహ తాతాచార్యేణ
శ్రీమతా లేఖ సుష్ఠ్వయమ్."

ఏం ? లేఖకునికి కృతజ్ఞత తెలుపకపోతే ఏం ? అంటారుకదూ !

కవిగారు "దానం భోగో నాశః తిస్రో గతయో భవంతి విత్తస్య" అన్న భర్తృహరి సూక్తిని అక్షరాల నమ్మిన భోగి, త్యాగి డబ్బున్నప్పుడు తాను తిని ఒకరికి పెట్టేవారు. తాను మంచి భోక్త, ఇతరులూ అంతటివారు కావాలనే ఆశపడేవారు. నేను చెన్నపురిలో తాళపత్ర గ్రంథసూచీ నిర్మాణంలో ఆయనకు

సహాయకుడుగా ఉన్నప్పుడు మధ్యాహ్నం అల్పాహారానికి పక్కనే ఉన్న రెవెన్యూబోర్డు కాంటీనుకు వెళ్ళేవాళ్ళం. అప్పుడు నేయిదోసె రెండబాలు. ఒకటి తిందేనే భోజనం చేసినట్లయ్యేది. ఆయన నాలుగు ఒకేసారి తెమ్మనేవారు. "నాలు గెందుకు సార్?" అనేవాడిని మొదట్లో. "నీకు రెండు నాకు రెండు." అనేవారు. "ఒకటి చాలు సార్." అనేవాడిని. "అయితే మూడు నేనే తింటాను." అనేవారు. అంతగా తిండితినేవారు తెలివిగలవారు కాదంటారు సామాన్యంగా, మరి కవిగారు అంతటి ప్రతిభాశాలి ఎలా అయ్యారు ? ఆ సూత్రానికి ఆయన అపవాదమే !

ఎంతోకాలం కవిగారి సహచరులై సంస్కృత భారతికి సేవచేసిన శ్రీ ఎస్. కె. రామనాథ శాస్త్రిగారిని గురించికూడ తెలుసుకోక పోవడం సమంజసం కాదు. మద్రాసు విశ్వవిద్యాలయం పదవి నుంచి విరమించిన తర్వాత ఆయన కోవూరు సంస్కృత కలాశాలలో కొంతకాలం అధ్యాపకులుగా ఉన్నారు. నవ్య విమర్శాదర్శః, పాత్రవిమర్శాదర్శః, ఆనందహృదయం, మణిమంజూషా, రామాయణీయ సౌభ్రాత్రం అనే సంస్కృత గ్రంథాలు రచించారు. కవిగారితో కలిసి, తర్వాతను విశ్వవిద్యాలయంలోను స్ఫోటసిద్ధివంటి శాస్త్రగ్రంథాలు పరిష్కరించారు. చివరిదశలో మైలాపూర్‌లో కుమార్తెల ఇంట గడిపారు. వారి ఇద్దరు కుమారులలో ఒకరు రామకృష్ణ మఠంలో చేరి సింగపూర్‌లో ఏకాత్మానంద పేరుతో సన్యాసం స్వీకరించారు.

## కుమారసంభవం తంజావూరు ప్రతి :

బృహస్పతే రవిశ్వాసః— అనేది కౌటిల్యుడు ఉదాహరించిన బార్హస్పత్య నీతిసూత్రం. ఎవరినీ మంచివాడని విశ్వసించవద్దు. మంచితనమనేది చివరికిగాని నిరూపితం కాదు. అందువల్ల ఎదుటివానిని నిత్యమూ శంకిస్తూనే ఉండాలి. ఈ శంక తీరడానికి ఎదుటివాని మంచితనం అసందిగ్ధంగా మనకు రుజువుకావాలి- అంటాడు బృహస్పతి.

బృహస్పతి చెప్పిన తక్కిన విషయాల సంగతి ఎలావున్నా, ఈ అవిశ్వాస సూత్రం మాత్రం తెలుగు విద్వల్లోకానికి బాగా ఒంటబట్టినట్లుంది. ప్రతి కావ్య కర్తృత్వాన్నీ— దాదాపు- శంకించడం వారికి విద్యావినోదమయింది : ఈ అనుమానాలు, శంకలు నన్నయతోనే ప్రారంభించారు కొందరు. నన్నయ

భారతం వ్రాయలేదు: అతని మిత్రుడు నారాయణభట్టు వ్రాశాడు. రంగనాథ రామాయణకర్త ఎవరు ? మనుచరిత్రను రచించిన పెద్దనే మరొక పద్ధతిలో లంకానారికేళపాకంలో ఆముక్తమాల్యద వ్రాశాడు. బుద్ధి తెలిసినప్పటినుంచి కదనాలతో గడపిన కృష్ణరాయలకు అలాటి కావ్యం రచించగల తీరికేది ? పెద్దన కాకపోతే, తెలుగు కొత్తగా నేర్చుకొన్న తమిళదేశపు సంస్కృత పండితు డెవడో వ్రాసి ఉంటాడు. లేకపోతే దాని శైలి కంకరపై నడిచే బండిలాగ ఎందు కుంటుంది ? కన్యాశుల్కం గురజాడ అప్పారావు నాటకం కాదు; గోమఠం శ్రీనివాసాచార్యులది.... ....

ఇలాటిదే నన్నిచోడని కుమార సంభవ కర్తృత్వం గురించి ఇటీవల-ముఖ్యంగా- రామకృష్ణ కవిగారు, ప్రభాకర శాస్త్రిగారు, నేలటూరి వేంకట రమణయ్య గార్లవంటి పరిశోధక తల్లజులు కీర్తిశేషులైన పిదప చెలరేగిన సందేహం ! దీనిని సందేహం అనడంకన్నా- నిందారోపణం అందాము. పాత పండితులు తమకు అనుకూలంగా ప్రాత గ్రంథాలలోని పాఠాలు దిద్దేశారనో, తమ తిక్కలతో పద్యాలు చేర్చారనో, ఏకైక ప్రతులున్న కావ్యాలను దాచి పెట్టారనో అపవాదాలుండేవి పూర్వం. ఇప్పుడలాకాదు. గ్రంథాలు పాతవాళ్ళ పేరుతో వ్రాసి ఎవ్వరికీ తెలీకుండా తాళపత్ర గ్రంథాల కట్టలలో దూర్చారు. పాత తాటాకులు ఎక్కడివయ్యా ? ప్రతి తాళపత్ర గ్రంథంలోను వ్రాయనివి-అలేఖ్యాలు ఉంటాయి. వాటిని ఏరి గుదిగుచ్చి వానిలో వ్రాసి తాటాకులమధ్య పెట్టారు. ఇదీ అరోపణ పద్ధతి. కనుక ఎలా ఇలాటివారితో వాదం ? ప్రతి వాదానికీ అధిష్ఠానసామ్యం ఉండాలి; అది లేనప్పుడు వాదం కుదరదు.

అదేమి దైవ దుర్విలసనమో, మానవల్లివారు 1909 లో నన్నెచోడుని కుమార సంభవం ప్రచురించినప్పటినుంచీ వాదవివాదాలు చెలరేగుతూనే వున్నాయి. దానికి కారణం, ఆయన ఆ కావ్యంలోని వివిధ వైచిత్రీవిలసితాలను చూచి నన్నయకంటే ముందుదని భావించడం. దానితో తెలుగు దేశంలోని పండితోత్త ములు రెండు స్కంధావారాలుగా విడిపోయి ఒక తరంపాటు ముష్టాముష్టి, బాహాబాహి పోరాడారు.

కొందరు కావ్యమంతా కూటసృష్టి అన్నారు; ప్రాచీన సంకలన గ్రంథాలలో ఈ కావ్యంలోని పద్యాలు ఉదాహృతం కాలేదన్న కారణంతో. ఆ

సంశయులపోయి కొందరు ప్రాచీనులు ఉదాహరించిన ప్రమాణం దొరకగానే, అంతా అబద్ధం, కావ్యం మొత్తాన్నే కూటసృష్టి చేయగల మాయావులు లక్షణ గ్రంథాల్లో వాటిని దూర్చలేరా ? అంటూ కొత్తవాదం ప్రారంభించారు అందు వల్లనే వాదానికి అధిష్ఠాన సామ్యం ఉండాలన్నాను.

కుమారసంభవం కూటసృష్టి కాదని మిత్రులు తిగ్మం శ్రీధరమూర్తి మణిమంజరి 10వ సంచికలో సోపపత్తిగా వివరించాను. ఆయన మాటలను ఇక్కడ ఉదాహరించి నేను పడవలసి శ్రమను కొంత తగ్గించుకొంటాను.

"ప్రాచీన కవులు, లాక్షణికులు కొందరు నన్నెచోడుని కుమారసంభవ మును పేర్కొని, అందలి పద్యములను ఉట్టరించి ఉన్నారు. శహాజీరాజు కాలమునందే లేఖకులు కుమారసంభవముయొక్క తాళపత్రిగ్రంథమును వ్రాసి పెట్టిరి. ఆ తాళపత్రగ్రంథము పూర్వమే తాళపత్రగ్రంథ సూచికలో పద్దు కెక్కియున్నది. కుమారసంభవము యొక్క తాళపత్ర గ్రంథములోని లేఖన విధానము ప్రాచీన పద్ధతిని చాటుచున్నది. ఇన్ని కారణముల వలన నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీక కృతి-అనగా మానవల్లి రామకృష్ణ కవిగారి జీవిత కాలమునకు (1866-1957) పూర్వమునుండి నన్నెచోడుని కుమారసంభవ తాళపత్ర గ్రంథము సరస్వతీ మహలు గ్రంథాలయములో నుండునట్లు కరబవ రము."

నాకూ కుమారసంభవంతో నకలునవీసుగా కొంత సంబంధం వుంది కనుక ఆ సంబంధం వివరాలు తెలియజేస్తాను; సహృదయుల నిర్ణయంకోసం.

1919 నుంచి ప్రారంభమైన కుమారసంభవ కర్తృత్వకూటసర్జనవాదం 1935 కు కొంత శాంతించింది. గురువర్యులు ప్రభాకరులు తంజావూరిలో ఒక కుమారసంభవప్రతి ఉన్నదని 1918 లో కాబోలు వ్రాయడంతో జిజ్ఞాసువులు కొందరు తంజావూరు యాత్ర ప్రారంభించారు. కుమారసంభవాన్ని నిర్దుష్ట పాఠా లతో ప్రచురిద్దామని ప్రభాకరులకు సంకల్పం కలిగింది. కొన్ని పాఠాంతరాలు సేకరించుకొని రమ్మని నన్ను తంజావూరు పంపారు. నేను కుమారసంభవాది పాఠాలతోపాటు హరవిలాసం మున్నగు కావ్యాల పాఠాలుకూడా సేకరించుకొని

వచ్చాను. ఇది జరిగింది 1936 లో. దీనితో ప్రభాకరులకు సంతృప్తి కలుగ లేదు. యథామూలంగా— తప్పులతోసహా మక్కికి మక్కి— నకలు చేయించు కుంటే, ఆ వ్రాతనుబట్టి పరిశీలిస్తే చాల పద్యాలకు అర్థం కుదరదమేకాక, సరైన పాఠాలు స్ఫురించవచ్చునని అభిప్రాయపడ్డారు.

ఇలాటి అవకాశం 1938 లో కలిగింది. ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు ద్విపద భారతం ప్రచురించదలచి, తాళపత్ర గ్రంథాలయాల అనుభవం గల పండితులు కావాలని పత్రికలలో ప్రచురించారు. నేను అదివరకే మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో లేఖకుడుగా పనిచేస్తూ, అడపా దడపా పండితుడుగాను పనిచేసి వున్నందున దరఖాస్తు పెట్టుకున్నాను, ఎన్నికయ్యాను. 1938 మధ్యనుంచి 1939 చివరివరకు తంజావూరులో వున్నాను. నాతోపాటు మిత్రులు శ్రీ కొమ్మనమంచి జోగయ్య శర్మగారూ పనిచేశారు. తర్వాత ఆయన ఆంధ్రవిశ్వవిద్యాలయం సర్వీసులో కొనసాగారు. నేను దేశాలు తిరుగు దామనే ఉద్దేశం కలవాడిని కనుక లాహోరు విశ్వవిద్యాలయ పుస్తక భాండాగా రంలో తాళపత్ర విభాగంలో క్యాటలాగర్ పని లభించగా వెళ్ళిపోయాను.

నేను తంజావూరిలో ఉన్నప్పుడు ఉద్యోగరీత్యా నా కర్తవ్యం పూర్తయిన తర్వాత లభించిన తీరికలోను, అధికారికమైన సెలవు దినాలలోను కుమార సంభవాన్ని ఇతర గ్రంథాలను యథాతథంగా ప్రతి వ్రాసి ప్రభాకరులకు అందజేశారు.

అప్పటికే అది పాత తాటాకుల ప్రతి. నా అనుభవంలో అది మూడు వంద లేళ్ళది. ప్రతి తాటాకులోను అక్కడక్కడా క్రిమిదష్టాలు ఉండేవి. నేను దానిని నకలు చేయడం తపస్సులాగ చేశాను. తాళపత్ర గ్రంథాల వ్రాతలు చాల విచిత్రంగా వుంటాయి.

అచ్చుతో ప్రారంభమయ్యే పద్యాలు దాదాపు హల్లులతో ప్రారంభ మవుతాయి. అచ్చు వ్రాయడం కూడా ఉంటుంది. అరసున్న స్థానంలో నిండు సున్నను, నిండుసున్నను చూపడానికి సున్నపక్కన అక్షరానికి ద్విత్వమూ, ర్మ ర్భలు వ్రాయవలసి వచ్చినపుడు మభలకు వలపలగిలక; ఇఈ, ఎఏ, టఠ, గుణింతాలలో హ్రస్వ దీర్ఘభేదాలు పాటించకపోవడం; అఆ గుణింతాలను

స్పష్టంగా పాటించడం: ఐత్వౌత్వాలు అయి, అవులుగాను వ్రాయడం, వట్రి సుడికి క్రావడికి అభేదం; ఒకొక్కప్పుడు కవులను కౌలుగా వ్రాయడం; పద్యం చివరి పదాన్ని దీర్ఘంగా వ్రాయడం పరిపాటి. ఇలాటివి యథాతథంగా వ్రాసి, క్రిమి దష్టాక్షరాల స్థానంలో చుక్కలు పెట్టి, అక్షర భాగం ఏమాత్రం కనిపించినా, దానిని అయా ప్రాంతాలలో వ్రాసి, ఫలానా అక్షరం అయివుంటుందని సూచించడం— ఈ పద్ధతిలో నకలుచేశాను. మచ్చుకు ఒక పద్యాన్ని ఉదాహరిస్తాను :

క. వొఁక్క వలిని శఱస్వల (పొం?)
సొంక్కిన దొషంబ్బువాయ సూర్యెందు గళితా
శంక్క నపరాఁబ్బునిలొం
గ్ఖంక్కె వొకొ యనంగం బ్రొద్దు గ్రుంక్కుడునంత్తము. (2-78)

దీనికి సరైన సంస్కారణ ఇది :-

పొంక నలిలీ శఱస్వల
సోంకిన దోషంబు వాయ సూర్యుఁడు గలితా
శంక నపరాఁబునిధిలోఁ
గుర్రింకె నాకో యనఁగఁ బ్రొద్దు గ్రుంకుడు నంతన్.

నేడు దక్షిణాంధ్రులుధు అర్ధబిందు సహిత పదాలను పేండ, కూంతురు, వాండు అని పూర్ణబిందు సహితంగా వాడుతారు. పై పద్యంలో పొంక, సోంకు అనే పదాలలోని బిందువు పూర్ణమనే దృష్టితో బిందుపరమైన కలకు కు ఒత్తులు పెట్టాడు లేఖకుడు దోషంబు అన్నప్పుడు పూర్ణ బిందువు కనుక బకు బ ఒత్తు. మార్యుఁడు అన్నప్పుడు అరసున్న అవసరం కనుక డుకు ఒత్తులేదు. శంక, అంబుధి గ్రుంకె అంతన్ లలో పూర్ణబిందువు గనుక బిందుపరాక్షరాల ద్విత్వం; యనంగ అనేచోట అర్ధబిందువు గనుక బిందువు ప్రక్కని గకు ద్విత్వం రాలేదు.

ఈ విధంగా వ్రాసుకోవడంవల్ల పెక్కు పాఠాలకు సరైన రూపాలు స్ఫురించాయి.

తృతీయాశ్వాసంలో పార్వతీదేవిని కవి అపాదమస్తకం వర్ణించాడు. పిపుకు
స్మరకలహంబునఁ బతిదెస
గిరిసుత పిఱుఁదైన వక్షకేలి మహేశున్
మరుడు దగిలించి గెలువఁగ

గరమమరిన.... .... .... ....గతి నిం పొప్పున్. (78) అని పార్వతిదేవి వీపు జూడమాడే నెత్తపలకలాగ వుందని వర్ణించాడు. నెత్తపలక పైన వెడల్పుగాను, రామరామసన్నగాను వంపుగాను వుంటుంది. నాలుగవ పాదంలో- "గరమమరిన.... .... ..........క గతి నింప్పొప్పున్" అని వుంది. నేను చుక్కలు పెట్టిన భాగంలో అమరిన లోని చివరిన న గలమధ్య వుంది, నవత్వం కనిపిస్తూంది. తర్వాత ఒక అక్షరంలేదు. ప అక్షరం మొదటి సుడి, ప వంపు చివరికొన, తలకట్టు, ల ఊర్ధ్వకాయం కనిపిస్తున్నాయి. నింప్పొప్పున్ అనే పదాలలోని ని మొదట్లో పురుగు తినడంవల్ల ని గాను వి గాను చదవడానికి వీలుంది. కనుక ఆలోచించి వీపును నెత్తపలకగా వర్ణించడం సంస్కృత కావ్యాలలో వుంది గనుక ఏదో పలక అయివుంటుందని భావించి ప్రిభాకరులకు సూచించాను. ఆయన చాల సంతోషించి వెంటనే నెత్తపలకగా గుర్తించారు.

ఈ విధంగా అక్షరభాగాలుకూడ వదలకుండా నకలు చేయడంవల్ల ఎంతో ప్రియోజనం కలిగింది ప్రిభాకరులు చాల పాఠాలు నిర్ణయించగలిగారు.

ఇలాటిదే మరొక పాఠం పాకు. ఈ 'పాకు' కుమారసంభవంలో మూడు చోట్ల ఉంది. మొదటిది- దుఃఖవివశమైన దక్షుని ధర్మపత్ని వర్ణనలోనిది :

> "కడిసన్న తమ్మిఁ బాఁ కడరెనో యన దీన
> వదనంబుపై నెఱుల్ సెదరి తూల." 2-88

దక్షుని ధర్మపత్ని దుఃఖిస్తూంది, ఆమె ముఖంచుట్టూ విడివడిన కేశ పాశం అలముకొంది. అది కాంతివిహీనమైన పద్మాన్ని చుట్టుముట్టిన పాచిలాగ వుంది. తంజావూరు పాఠంలో:

> "గడి సన్నతంమ్మిం బాంకడరెనొయన దీన
> వదనంబుపై నెరులు సెదరితూల."

అని వుంది. రెండవ ప్రియోగం తపస్విని అయిన గిరిజా వర్ణనలోనిది:

> కురులతోఁ గూడ విలసిల్లు గిరిజ మొగము
> జడలుదాల్చిన గడు బెడం గదరి పొల్చె
> భృంగములు మూఁగి చెలువొందు బిసరుహంబు
> పాఁకు దాల్చియుఁ గరమొప్పు భంగివోలె." 6-85

దీని అర్థం స్పష్టం గనుక వివరణ అనవసరం. తంజావూరు ప్రతిలో-

"పొంకు దాల్చియుం గరమొప్పు భంగివోలె"

అని వుంది. ఈ రెండు వర్ణనలు కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలంలోని "సరసిజ మనువిద్ధం శైవలే నాపి రమ్యం" అనే భావంపై ఆధారపడినవని స్పష్టం.

మూడవది సైనికుల వీరాలాపాలలోనిది:

"పోరఁబాఁకదల్చి నీరుగొన్నటు ప్రతి
బలమునెల్లఁ బాయపడఁగఁ దోలి" 11-87

ఈ పాఠు గురించి వాదప్రతివాదాలు చెలరేగాయి. రామకృష్ణ కవిగారు "పోరఁ బాఁకు దాచ్చి" అని గ్రహించి పాఁకును బాకనుకొని అకసున్నను తొలగించి చేయూతె అనే అర్థమిచ్చారు. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణలోను ఈ పాఠమే ఉంది. తంజావూరు ప్రతిలో-

గీ. పౌరంబాంకుదల్చి నిరుగొన్నట్లు ప్రతి
బలమునెల్లం బాయవడంగం దొలి"

అని ఉంది. సరోవరంలో పాచి కమ్మిన నీటిని పాచితొలగించి తీసుకొన్నట్టు రాజును రక్షించే సైన్యాన్ని అటూ ఇటూ తొలగించి రాజును (గొడుగుక్రింది రూపును - ఛత్రం రాజు లక్షణం) చంపి జయం కలిగిస్తానని ఒక భటుని వీరాలాపమిది. భటుని వాక్యాలలో మధ్యన "పాఁకుదల్చి నీరుగొన్నటు ప్రతి" అనే ఉపమానం వచ్చిపడింది. వీరుని అలాపాలకు ఇది సహజం.

కాని, రామకృష్ణ కవిగారు దీనిని బాకని భ్రమపడ్డారు. మద్రాసు విశ్వవిద్యాలయంవారు తంజావూరు పాఠం చూచినట్లు లేదు. చూచివుంటే, దాల్చి అని ముద్రించి వుండరు. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు కూడ బాకుగా గ్రహించి మూడు పుటల సుదీర్ఘచర్చ కావించారు. (నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమా? పుటలు - 19. 20. 21.)

వీరుని మాటలమధ్య ఈ ఉపమానం రావడంవల్ల దూరాన్వయ దోషం కలుగడం నిజమేకాని, ఇది బాకు మాత్రం కాదు. వీరుడు చెప్పదలచింది "నేను

రాజును రక్షిస్తూ రాజు చుట్టూవున్న సైన్యాన్ని తొలగించుకుంటూపోయి– పాచిని తొలగించి నీటిని గ్రహించినట్టు రాజును పొడుస్తాను." అని. కనుక పాఠ ప్రసక్తే లేదు.

తంజావూరు ప్రతిలో స్పష్టంగా 'పౌరం పాంకుదల్చి' అని వుండగా 'దాల్చి' అని గ్రహించవలసిన అవసరం ఎందుకు కలిగిందో! పాఁకును ఉదల్చి, లేక అదల్చి – తొలగించి నీరు కొన్నట్టు అని అర్థం స్పష్టం.

ప్రకాశకులు మదాసు విశ్వవిద్యాలయం ప్రతి మార్జినులో "పౌరం పాకు దల్చి" పద్యం వద్ద "శైవలం కిల విహాయ నిర్మలం కేవలం కిల జలం హి పీయతే" అనే యోగవాశిష్ఠం ప్రయోగం గుర్తుగా వ్రాసుకొన్నారు. నన్నె చోడుడు ఈ ప్రయోగం గ్రహించి ఉంటాడు. అతడు యోగశాస్త్రజ్ఞుడు గదా! ఇలా చాలా పాఠాలు చెప్పవచ్చు.

పాఠ నిర్ణయం విషయంలో మాత్రం బృహస్పతి సూత్రం పాటించడం అవసరమనుకుంటాను - మానవ స్వభావ పరిజ్ఞానంలో ఎలా వున్నా. ఎవరో చెప్పారు అని కాకుండా, స్వయంగా మూలపాఠాలు చూచి సత్యనిర్ణయానికి ప్రయత్నించాలి. నన్నెచోడుని కుమారసంభవం ప్రతి ఉన్నది ఒక్కటే. అది తంజావూరులో వుంది. దానిని చూడడం అంత కష్టమేమీ కాదు. అందులోను పెద్దపదవులలో వున్నవారికి సుతరామూ కష్టం కాదు. కనులారాచూచి, మనసారా ఆలోచించుకొని సత్యాన్ని సమీపించడానికి ప్రయత్నించవచ్చు, ఇలాటి అవకాశాలు జారవిడుచుకొని పరప్రత్యయనేయబుద్ధులు కావడంవల్ల ప్రమాదం తప్పదు. అలా చూచి ఆలోచించినా తప్పులు జరిగితే. ప్రమాదో ధీమతా మపి.

రామకృష్ణ కవిగారు తాళపత్రపరిశీలన శ్రద్ధాతిశయాన్ని గురించిన లాహోర్ ముచ్చట వివరించి ఈ వ్యాసం ముగిస్తాను. నేను 1939 లో లాహోరు చేరి పెద్దలందరికీ ఉత్తరాలు వ్రాశాను. రామకృష్ణ కవిగారినుంచీ జవాబు వచ్చింది, అందరి జవాబులలాగే. కవిగారు తమ జాబులో "అక్కడ లాహోరు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునన్నో, విశ్వబంధుశాస్త్రిగారి పరిశోధన సంస్థలోనో నన్నెచోడుని కుమారసంభవము కలదని వింటిని. చూచి వ్రాయుడు." అని వుంది. నేను వెళ్ళి గాలించాను. కుమారసంభవము - అని కన్నాకుపై వ్రాసిన

ఒక తాటాకుల గ్రంథం కనిపించింది యథాలాపంగా తెరిచాను. లోపం తెలుగు పద్యాలు. సంతోషంతో - మండోదరిని చూచి సీత అని భ్రాంతిపడి కుప్పిగంతులు వేసిన హనుమంతునిలాగా కుప్పిగంతులు వేశాను. సంతోషపు పొంగు చల్లారిన తర్వాత పుస్తకం ప్రతి ఆకూ చూచాను. సంస్కృత కుమార సంభవంలోని కొన్నిసర్గలు, తెలుగు కావ్యాలలోని కొన్ని పద్యాలు ఉన్నాయి. మూర్ఛవచ్చినట్లయింది. కవిగారికి ఈ విషయం వ్రాశాను.

తెలుగువారు ఎక్కడ మెట్టినా తమజాతి గొప్పదనం గుట్టలుపోసి, తెలుగు తల్లి కీర్తికి పట్ట కట్టారు. అట్టిమహాశయులలో మానవల్లి రామకృష్ణ కవిగా రొకరు ఆయన ఆంధ్ర, సంస్కృత సరస్వతులకు చేసిన సేవతో తెలుగుజాతి తరతరాలవరకు తలెత్తుకొని తిరుగుతుంది. ఆ భవ్యమూర్తికి ఇవే నా నమో వాకాలు!

[ భారతి 1967 అక్టోబర్ సంచికనుండి ]

యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేన,
యోఽపాకరోత్ తం ప్రవరం మునీనామ్
పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి.

వ్యాకరణ మహాభాష్యం అధ్యయనం చేసేవారు ప్రారంభంలో పై ధ్యాన శ్లోకం పఠించడం పరిపాటి. పతంజలి మహర్షి మనోమాలిన్యం తొలగించడానికి యోగసూత్రాలు రచించారు; భాషాదోషాలు తొలగించడానికి పాణిని సూత్రాలకు మహాభాష్యం రచించారు; శరీర వ్యాధులు తొలగించడానికి వైద్య గ్రంథాలు రచించారు. ఆ విధంగా చిత్త వాక్ శరీర మలాలను పోగొట్టారు. ఆ విధంగానే ఈ ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో యోగ చికిత్సా వాఙ్మయ ప్రపంచంలో ప్రభాకరులుగా వెలుగొందినారు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.

జీవితంలో అనుపదం, అనుక్షణం సత్యగవేషణమే ఆయన సాగించిన యోగం; అదే ఆయనభోగం. నేటి ఎగుడు దిగుడు సమాజంలో కష్టజీవుల కరుణగాథలకు జలజల కన్నీరు కార్చడం, ఆ కన్నీటి వెలుగులలో సహానుభూతి సహకారాలు వెలార్చడం ఆయన హృదయం; అదే ఆయన సాధించిన అభ్యుదయం. సజాతీయ విజాతీయ భాషాసాహిత్యాల అంచులు చూచి లోతులు తీసి, సాదృశ్య వైదృశ్యాలను సమ్యగ్ దృష్టితో మథించి మీరు కట్టిన మేలి మీగడలతో తెలుగుతేటలను కూర్చి తేర్చి తెలుగుజాతికి అందివ్వడం ఆయన

ఉపజ్ఞ; అట్టి సమన్వయమే శస్త్రపలుబ్ధులకు, పరిశోధన పరాయణులకు రసాయణమని ఆయన అజ్ఞ.

తెలుగుభాషా పరిశోధనరంగంలో ప్రాగ్రేసరులై తొలిసారిగా శాస్త్రీయ పద్ధతితో స్వతంత్ర దృక్పథంతో ప్రవేశించడం, జానపద దేశి సాహిత్యాలను వెలుగుకు తేవడం, భాషాశాస్త్రాన్ని సమీక్షించడం, అపూర్వమైన సంకలనాలు ప్రచురించడం, ప్రాచీన గ్రంథ పరిష్కరణలో కొత్తబాటలు వేయడం చరిత్ర శాసన పరిశోధనకు స్వీయమార్గంలో పూనుకోడం. ఏ రంగంలో ప్రవేశించినా మౌలికంగా ముందుకు పోవడం తర్వాతి వారికి వెలుగుబాటలు తీర్చాయి.

నాకు బాగా జ్ఞాపకం: నా వయస్సు పదేళ్ల కావచ్చు. ఆ సంవత్సరమే 'భారతి' మాసపత్రిక వెలువడింది. ముచ్చటయిన రంగుబొమ్మలను చూచే మోజుకొద్దీ పత్రిక తిరగవేశాను. మొదటి వ్యాసం 'శివకవులు'. మాది శైవ మత ప్రాబల్యం కల ప్రాంతం. 'శివకవులు' వ్యాసం చదివాను. ఏమీ అర్థం కాలేదు. నా చదువూ బుద్ధీ చాల పరిమితమైనవి, ఎలా అర్థమవుతుంది ఆ వ్యాసం ? కాని ఎవరో గొప్ప పండితుడు, సర్వమత సమబుద్ధి కలవాడు వ్రాసింది సుమా ఈ వ్యాసం అనే భావం మాత్రం కలిగింది. దాని సారస్వత ప్రాధాన్యం కొంచమైనా తోచలేదు. తర్వాతకూడా ఆ పండితుని రచనలు చదువుతూవచ్చాను. నా మనసు మడిలో నారుగా నాటిన మొదటి భావం వేరు తన్నింది. అందరు పిల్లలలాగే నేను కూడా నా అభిమాన పండితుడు ఆజానుబాహువు, అర్ణవగంభీరుడు, మహా మేధావి– ఇంకా ఏదేదో అనుకున్నాను. కాని చాల మందికి తరచు ఆశాభంగం కలుగుతుంది. నా అదృష్టం మంచిది– నా కెప్పుడూ ఈ విషయంలో ఆశాభంగం కలుగలేదు.

* * *

తర్వాత కొన్ని సంవత్సరాలకు చెన్నపురి రావడం తటస్థించింది. ప్రాచ్య లిఖిత పుస్తకాలయానికి వెళ్ళాను, మ్యూజియం చూస్తూ. అక్కడ ఒక పెద్దమనిషిని చూశాను. ఆయన మొదటిచూపులోనే నాకు ఎక్కడలేని సంతోషం కలిగింది. చేయెత్తి సమస్కరించబుద్ధయింది; నమస్కరించాను. 'నాయనా ! ఎవరు ? ఎందుకు వచ్చావు ?'– అని ఆయన ప్రశ్నించినంతసేపు నన్ను సంభావించినట్టు భావించాను. "మీ రెవరండీ ?" అనబోయి అర్ధోక్తిలోనే ఆగిపోయాను;

పక్కనవున్న మరొక పండితుని ప్రశ్నార్థక దృష్టికి జడిసి. "పీ రెవరో తెలియదటయ్యా?" అని ఆయన చూపులు చురచురగా తాకినట్టయింది ఇద్దరు పండితులూ నా కపరిచితులే. కాని యింతలో నా మనస్సులో మెరపు మెరిసింది.— నా అభిమాన పండితుడు ఈయనే అయి వుంటాడా? సందేహం లేదు. అయనే. నేను తలపోసిన ఆకృతి వృథాపోతే నే నూరుకోను. ధైర్యంచేసి, వేటూరి ప్రభా.... అంటుండగానే పక్కనున్న పండితుని పెదవులపై మందహాసం చిందులాడింది.

o o o

క్రమంగా మరొక సత్యం కూడా బోధపడింది. 'దూరపు కొండలు నునుపు!' అన్నది సామెత. అది శాస్త్రిగారి విషయంలో నిరర్థకమైంది. ఈ కొండకు- జ్ఞానమేరువుకు— ఎంత చేరువకు చేరినా నునుపేకాని రాళ్ళూ రప్పా కనిపించలేదు; బంగారమే కాని కంగారు కానరాలేదు. శ్రీ శాస్త్రిగారిలోని మానవం గౌరీశంకర శిఖరంలా మహోన్నతం; నానాటికి పెరుగుటేకాని తరుగుట ఎరుగనిది. ఆయన ఆరడుగుల కాయంలో మానవం తీర్థంకరుల ప్రమాణాన, గోమతేశ్వరుని ఎత్తున— అరువది అడుగుల ఎత్తున కనిపించేది. హంపీ తేరు శిఖరం మన మెడలు వెనక్కు విరుచుకొని చూడవలసివస్తే ఈ మానవాన్ని చూడడానికి మెడలు విరచుకొని ప్రయోజనంలేక అంతర్ముఖుడు కావలసి వచ్చేది.

శాస్త్రిగారి పరిచయం నాయెడ వాత్సల్యంగా పరిణమించినకొద్దీ, నాలో అణగి మణగి వున్న చిన్నతనం చెలరేగి చిలిపితనంగా చిందులాడింది. ఈ చిలిపితనానికి ఆయన నవ్వుకొనేవారు. అజ్ఞానానికి ఆవేదనపడేవారేమో! ఆశలకు ఆశీస్సు లిచ్చేవారు.

o o o

ఒకరోజు ఆయన యింటికి వెళ్ళాను. ఏదో పుస్తకం కావలసి వచ్చింది. "అమ్మాయి సుజాతా! ఇలా అందీమ్మా, పుస్తకాన్ని!" అన్నారు. "సుజాతా అంటే ఏం పేరండీ?" అని అడిగాను. "నీవే చెప్పవోయ్." అన్నారు. "బాగా పుట్టింది అని కదండీ వ్యుత్పత్తి. తక్కినవారు ఎలా పుడతారు?" అన్నాను.

నా అసభ్య వర్తనకు ఆయన కొంచెం కష్టపడిన మాట నిజం. కాని "పాండిత్యం ముదిరిందే" అని అన్నాను. "నీలాటివాడే వెనకటికి చదువు రాకముందు పెసలు పెసలు అనేవాట్ట. చదువు ముదిరి పసులు పసులు అనడం మొదలుపెట్టాడట!" అన్నారు. "అంతకన్న మరేమిటండీ ?" అని దబాయింపజూశాను. "గౌతమునికి చల్లయిచ్చి సేదదేర్చిన సుజాతకథ తెలియదటయ్యా ?" అన్నారు. చాలా సిగ్గు పడ్డాను, శతశ్లోకేన పండితః అనే కథ గురుతుకువచ్చి.

o o o

ఒకసారి 1935 లో కాబోలు నాకు మలేరియా తగిలింది. చాలా బాధ పడుతున్నాను. ఏమీ తోచలేదు. తల దిమ్ముగావుంది. మనస్సు శూన్యంగా ఉంది. ఏవేవో భావాలతోపాటు లైబ్రరీ, శాస్త్రిగారూ జ్ఞాతం వచ్చారు. శాస్త్రి గారిమీద కోపం కూడా వచ్చింది. ఇన్ని రోజులుగా జ్వరంతో బాధపడు తున్నాను. ఎదుట మా తియ్యగా మాట్లాడుతారు. యోగక్షేమాలు కనుక్కోవద్దూ? ఇలా అనుకుంటుండగా కండ్లు మూతలు పడ్డాయి. మైకం ముంచుకు వచ్చిన ట్టయింది. ఆ మైకంలో ఒక పాతకాలపు యిల్లు, తెల్ల గోడ, గోడకు మూడు పటాలు వరుసగా తగిలించినట్టు కనిపించింది. మొదటిది బుద్ధుని పటం, రెండవది గాంధీజీది, మూడవది శాస్త్రిగారిది. శాస్త్రిగారి పటం ఆ వరుసలో కొంత కిందికి వుంది. ఉన్నట్టుండి ఆ పటంలోని శాస్త్రిగారి రూపం కదలడం, కన్నులెత్తి చల్లని చూపులతో చూడడం, పెదవులు విడివడి పలుకరించడం. ఇవన్నీ జరిగినట్టు తోచి గాభరాతో కండ్లు బలవంతంగా విచ్చాను, ఆలోచన పరిగెత్తింది. బుద్ధుడంటే నాకు మొదటినుంచీ మహాభక్తి, సత్యాగ్రహ సమరంలో లక్షోపలక్షలు కారాగానికి వెళ్ళినట్టే నేనూ వెళ్ళాను. వీరిద్దరి స్థానం నా హృద యంలో మహోన్నతం. శాస్త్రిగారిమీద అభిమానం విశేషంగా వున్నమాట వాస్తవమే. కాని, ఆయనకు వారిద్దరి స్థానం ఇవ్వగలనా ? ఇంతకూ ఆయన పటం ఆ వరుసలో కొంత కిందికే వుండినదిగా ? ఔౌను. అలా వుండవలసిందే. వారిద్దరి స్థానం ఈయనకు ఇవ్వను; ఇవ్వలేను. మానవజాతి సేవకోసం జీవితం అంకితం చేసినవారికి ఈయనకూ పోలికేమిటి ?

జ్వరం తగ్గిన తర్వాత లైబ్రరీకి వెళ్లాను. శాస్త్రిగారికి మూడు పటాల సంగతి చెప్పారు. ఆయన కొంచెం ఆశ్చర్యపట్టారు. "అయితే నేను థర్డ్‌క్లాస్

అన్నమాట!" అన్నారు. నేను జవాబు చెప్పలేను. "అయితే నేనే ఫస్ట్ అన్న సంగతి చూచావా?" అన్నారు. "ఎట్లాండి?" అని అడిగాను. "కిందినుంచి చూడవోయ్." అన్నారు. "ఇంతకూ నీ బుద్ధుడు చేసిందేమిటి? సుష్టుగా తిని అజీర్ణంతో బాధపడి చావడమే కదా!" అన్నారు. చావడం అనేమాట విని నాకు మనస్సు చివుక్కుమంది. ఏదో అనబోయాను. "సాయంత్రం ఇంటికి రా! వాదించుకుందాంగాని." అన్నారు.

సాయంకాలం యింటికి వెళ్ళాను, అదే మొదటిసారి వెళ్ళడం. చాలమంది ఆస్తవ్యస్తంగా కూర్చున్నారు. ఏదో ప్రార్థనచేసే ధోరణితో వున్నారు. అంత వరకూ శాస్త్రిగారు మనశ్శక్తితో జబ్బులు కుదురుస్తారని నాకు తెలీదు. "ఈయనకు బుద్ధుడంటే చాల గౌరవమటండీ!" అని అన్నారు అయన అక్కడివారందరికీ నన్ను చూపుతూ "కష్టమూసుకుని నమస్కారం చేసుకుని చూడవయ్యా, ఏమౌతుందో?" అన్నారు వావైపు తిరిగి. "నాకు ప్రార్థనపైన కొద్దిగా నమ్మకం వుంది గాని, భగవంతునిమీద అసలు లేదండీ!" అన్నాను. అక్కడ వున్నవారందరూ కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వారు. "పిచ్చి కుదిరింది అన్న సామెతలా వుంది నీ సంగతి. సరిగ్గా నీవు బుద్ధునికి శిష్యుడు కాదగినవాడివే. వాడేమో శూన్యంతో కొట్టుకున్నాడు. నీవు శూన్యంవైపు చేతులు చాపి ప్రార్థన చేస్తానంటావు. ప్రార్థనలో నమ్మకం వుందన్నావుగదా, ఎవరిని గురించి ప్రార్థన నీది?" అని ప్రశ్నించారు. "నాది ఆటో సజెషనండీ! బాగుండాలి! బాగుండాలి! అని మననంచేస్తూ మనస్సుకు నూరిపోసుకుంటాను ధైర్యాన్ని."అన్నాను. "అయితే మనస్సు అనేది ఒప్పుకుంటావన్నమాట." అన్నారు. "మనస్సు లేనిదే మనిషి ఎలాగండీ?" అన్నాను. "నీ బుద్ధుడు బుద్ధి 'ప్లేను' వరకే అందుకున్నాడోయ్. అంతకు మించిన దివ్యత్వం, అమరత్వం వున్నాయి. అవి నేటి పరిస్థితిలోనే నెలకొనాలి, అది గాంధీయుగంలోనే జరగాలి." అన్నారు.

ం ం ం

హోటలులో పని చేద్దామని ఉందండి!" అన్నాను ఒకరోజు శాస్త్రిగారితో.

"వేళాకోళమా?" అని ప్రశ్నించారు.

"అబ్బే! లేదండీ! నిజంగానే." అన్నాను.

"అది చాల నీచమైనవృత్తి అయినట్టు, నీబోటివారు చేయవగింది కానట్టూ అనుకుంటున్నావేమో!" అన్నారు శాస్త్రిగారు.

"అలాటి భావం ఏ కోశానా లేదండీ. అలాటివృత్తి అంతు చూద్దామని వుందండీ." అన్నాను.

"చూచి...." అని ప్రశ్నించారు శాస్త్రిగారు.

"చదువుకూ, వృత్తికీ సంబంధం అవసరం లేదనే భావం కలవాణ్ణి ఆ భావాన్ని ఆచరణలో పెట్టి సంతృప్తి పడదామని...." అన్నాను.

శాస్త్రిగారి కళ్లు సంతోషంతో కలకలలాడాయి. తిరువల్లిక్కేణిలో సింగరాచారి వీధిచివర "రామవిలాస్" అనే పెద్ద హోటలుండేది అప్పుడు. దాని యజమాని శాస్త్రిగారంటే గురుభావం కలవారు. శాస్త్రిగారు స్వయంగా యజమానికి నన్ను పరిచయం చేయించి అక్కడకుదిర్చారు అసిస్టెంటుగా. కొన్ని నెలలు అక్కడ వున్నాను, జీతం తీసుకోని కొలువులో.

• • •

ఒకరోజు నేనూ, అప్పటి గృహలక్ష్మి సంపాదకుడు చదువుల రామచంద్రయ్య శాస్త్రిగారింటికి వెళ్లాము. శాస్త్రిగారు కొళాయివద్ద జందేనికి సబ్బు వేసి ఉతుకుతున్నారు. రామచంద్రయ్య కంగారుగా "ఇదేమిటండీ?" అని ప్రశ్నించాడు. "ఏముందీ! మురికయితే, సబ్బు రాచి, బాదుతున్నాను." అన్నారు. "జందెం భుజంమీదినుంచి తీయడం తప్పంటారు కదండీ బ్రాహ్మలు?" అన్నాడు రామచంద్రయ్య. "ఓరి వెర్రినాయనా? నీ రెడ్డేరికం నావద్దనా! గురువుకే తిరుమంత్రం ఉపదేశింప ఎచ్చావూ! పూర్వకాలంలో యజ్ఞాది వైదిక కర్మలు చేసేటప్పుడే జందెం భుజంమీద వుండేది. తక్కిన సమయాల్లో చిలుక్కొయ్యకు తగిలించేవారు. రానురాను బ్రాహ్మణకులానికి జందెం ఒక్కటే గుర్తయింది; ఎప్పుడూ మెడకు తగిలించుకొ్కమనే ఆచారం ఏర్పడింది" అని అన్నారు, "సరేనయ్యా. ఇంతకూ ఈ వర్ణాలేమిటి? జందే లేమిటి? అంతా ఒకేవర్ణం కాబోయేకాలం ముందున్నది." అన్నారు. వర్ణాశ్రమధర్మ విచారం గంటసేపు సాగింది. కనుకనే, తర్వాత ఒకటిరెండు సంవత్సరాలకు శాస్త్రి

గారు తమ పెద్దకుమార్తె లలితమ్మ పెళ్ళిలో అష్టాదశవర్ణాలవారికి తమ సరసనే ఏక పంక్తిని విందు చేసినప్పుడు నాకు విడ్డూర మనిపించలేదు.

o o o

శాస్త్రిగారికి సిఫార్సు అంటే గిట్టేదికాదు. "వాడ్ని వీడ్ని పట్టుకుని ఎక్కడికో పాకిపోదామంటా వేమిటి? ఎక్కడికో వెళ్ళి చేసేదేమీలేదు. ఇక్కడి నుంచే పేరూ, ప్రతిష్ఠా వ్యాపించాలి. నీ లక్ష్యం ఏమిటో నిర్ణయించుకో. దాని కోసం ఇక్కడినుంచే ప్రయత్నించు స్వయంగా." అనేవారు. ఇది తెలిసే ఒకమారు నేను బరోడా యూనివర్సిటీ లైబ్రరీనౌకరికి దరఖాస్తు పెట్టుకుని శాస్త్రిగారి సిఫార్సు కోరాను. ఆయన చేయనంటే చేయనన్నారు. నేను దానికి కొంత కష్టపడ్డమాట నిజం, ఆ నౌకరీ మరొకరికి దక్కింది. "మీరు సిఫార్సు చేయనందునే నాకు రాలేదండీ ఉద్యోగం" అన్నాను, శాస్త్రిగారితో ఎత్తిపొడుపుగా. శాస్త్రిగారు చాల కష్టపడ్డారు, "నీవు ఇప్పుడు కొంచెం ఉద్రిక్తావస్థతో వున్నావు. తమాయించు." అన్నారు. ఏమో జవాబు చెప్పబోయాను. "నీ విప్పుడు ఆలోచించే స్థితిలో లేవు. నా నియమాన్ని, ఆంతర్యాన్ని గ్రహించలేవు. నా సిఫార్సులు సాగి, నా మాట చెల్లితే నే నిలా ఎందుకుంటాను? ఒక్క భగవంతుని సిఫార్సే మనకు కావలసింది." అన్నారు, అప్పటి కా మాటలు నాకు నచ్చకపోయినా, తర్వాత వాటి మర్మం తెలుసుకొనడానికి ప్రయత్నించాను.

• o o

ఆ రోజుల్లో సుప్రసిద్ధ దంతవైద్యుడు శ్రీ ఉడిపి వెంకటరావుగారు ఏదో చర్మరోగంతో బాధపడుతూ శాస్త్రిగారివద్దకు చికిత్సకు వచ్చేవారు. ఆయనకు 'ప్లాన్‌చెట్' అంటే నమ్మకం. ప్లాన్ చెట్ అంటే పరలోకంలోని వారితో సంభాషించడం. ఒక చిన్నముక్కాలిపీటవంటి బల్ల వుంటుంది. దాని చుట్టూ జనం కూచుంటారు. పరలోకవాసులను ఆహ్వానించే అసాధారణశక్తులు గల వ్యక్తి చేత్తో కలమో, పెన్సిలో పట్టుకుని కాగితంమీద వ్రాస్తాడు. పరలోకవాసులు ఆయన ద్వారా తమ సందేశాలను తమవారికి తెలుపుతారట. ప్లాన్‌చెట్ సంప్రదాయంలో అప్పట్లో మన దేశంలో ప్రసిద్ధుడు శ్రీ ఋషి బొంబాయినుంచి ఒకసారి మద్రాసు వచ్చారు. వెంకటరావుగారు ప్లాన్‌చెట్ మాహాత్మ్యం శాస్త్రిగారికి

తెలుపుదామని శాబోలు, ఒకనాటి సాయంకాలం శాస్త్రిగారి బసలో దానిని ఏర్పాటు చేశారు. దాన్ని చూడడానికి, తమ తాత ముత్తాతల సందేశాలు వినడానికి పెక్కుమంది వచ్చారు. ఋషి ఒక కాయితం కలం తీసుకొని వ్రాయడానికి పూనుకున్నారు. ఆయనకు తరచు వచ్చే ఆవేశం, అనుభూతి ఆనాడు కనిపించలేదని ఆయన వెంటనంటి వచ్చిన అనుచర బృందమే అన్నది. ఒక్క అక్షరం కూడ వ్రాయలేక పోయారు. కుతూహలాటతో చూస్తున్న నాబోటి వారికి ఎంతో నిరుత్సాహం కలిగింది. ఆయన శాస్త్రిగారిని చూచి, "మీ సముఖంలో ఏమీ వ్రాయలేక పోతున్నాను." అన్నారు. "నేను ఏదైనా మాయ చేస్తున్నట్టు అపోహ పడుతున్నారేమో ? నాకూర్కగా ఈ విషయంలో జిజ్ఞాసే, జిహాసేమీ లేదు. నా తండ్రి తాతలు వచ్చి సందేశాలివ్వగా వినడం నాకు మాత్రం ఇష్టంలేదా ?" అన్నారు శాస్త్రిగారు. ఋషి మరొకమారు ప్రయత్నించారు. కుదరలేదు. "మా యింట్లో వీలయితే రేపు చూద్దాంలెండి !" అని సర్దారు శ్రీ వెంకటరావుగారు.

మర్నాడు వెంకటరావుగారింటికి వెళ్ళాము. శాస్త్రిగారు, గన్నవరపు సుబ్బరామయ్యగారు (అప్పటి భారతి సంపాదకులు), కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారు, నేను, మరికొందరము. అక్కడ ప్లాన్‌చెట్ సంగతి అసలే లేదు. నాకు మరింత ఆశాభంగం కలిగింది. శాస్త్రిగారిని మాట్లాడవలసిందని ఋషి కోరారు. "నేను ఇంగ్లీషులో ప్రసంగించలేనండీ." అన్నారు శాస్త్రిగారు. ఋషి ఉత్తరాదివారు; దక్షిణభాషలేవీ తెలీవు శాస్త్రిగారు తమిళంలోనూ చక్కగా ప్రసంగించగలరు. కాని ఋషికి తమిళం వాసనన్నాలేదు. సరే ! శాస్త్రిగారు తెలుగులోనే ప్రసంగించడానికి, వెంకటరావుగారు ఇంగ్లీషులో తర్జుమా చేయడానికి నిర్ణయమైంది. శాస్త్రిగారి ఆనాటి మహోపన్యాసం ఎన్నటికీ మరపురాదు. గంటసేపు అనర్గళంగా ప్రసంగించారు. శ్రోతలకు అమృతపు "షవర్ బాత్" అనిపించింది. ఋషి ప్రసంగం సారాంశం గ్రహించారు. దిగ్భ్రాంతి చెందారు. విషయం భగవత్ప్రేమ. ఆ ప్రేమలో మానవుడు కరగిపోవాలన్నారు. ఆ ప్రేమామృతాన్ని, ఆనందాన్ని చవిగొన్నవారు కబీర్‌దాస్ అన్నట్టు దాని రుచిని ఇదమిత్థమని చెప్పలేరని, మూగవాడు బెల్లం తిన్నట్లు ఆ ఆనందాన్ని వ్యక్తం చేసేస్థితిలో వుండరని అన్నారు. ఆ ప్రసంగమొక కావ్యం. దాన్ని వ్రాసుకోవాలవన్నా తోచలేదు మాకు ఆ మైమరపులో.

○ ● ○

"ఏమోయి! పెళ్ళి బాగా జరిగిందా?" అని ప్రశ్నించారు, పెళ్ళి చేసుకువచ్చి నమస్కరిస్తున్న నన్ను చూచి శాస్త్రిగారు. "ఆ!" అన్నాను. "శీఘ్రమేవ సుపుత్రాప్తిరస్తు।" అని ఆశీర్వదించి, అర్ధోక్తిలోనే "ఇప్పట్లోనే వద్దులే!" అని సర్దారు. "ఏమిటండీ! అలా అంటున్నారు? ప్రజయా హి మనుష్యః పూర్ణః- అన్నారుగదా పూర్వులు." అన్నాను. "అది కాదనను. అయితే నీవు పంట పండించుకుంటావనుకో, దానినంతా విత్తనం కోసమే దాచుకుంటావా? కొంత దాచుకుని, తక్కినది అనుభవిస్తావు. మొదట తృతీయ పురుషార్థం కానీ, ప్రజ అనుషంగికఫలం." అన్నారు.

○ ○ ●

గాంధీజీకి ఎదురు తిరిగిన సుభాష్‌చంద్రుడంటే శాస్త్రిగారికి గిట్టేదికాదు. "సుభాష్ హింసావాది. మన దేశానికి ఆయన విధానం గిట్టదు." అనేవారు. సుభాష్ అప్పుడు (1939) చెన్నపురికి వచ్చారు. జనం తండోపతండాలుగా ఆయన ప్రసంగం వినడానికి బీచికి వెళ్లుతున్నది. చాపల్యంకొద్దీ నేను శాస్త్రిగారి పిల్లలు ఆనందు, సుజాత, వినతలను వెంటబెట్టుకొని బీచికి వెళ్ళాను. శాస్త్రిగారు ఆనాడు వాల్తేరుకు ఆంధ్రవిశ్వవిద్యాలయం పరీక్షకుల సమావేశంకోసం వెళ్ళవలసి వుంది. రాత్రి ఎనిమిదయింది. పిల్లలను వెంటబెట్టుకొని సుభాష్ చంద్రుని సభకు వెళ్లానని తెలిసి ఆగ్గయిపోయారు. ప్రయాణం మానుకున్నారు, నాకోసం ఎదురుచూస్తున్నారు. లక్షలజనంనుంచి రావడానికి చాలా ఆలస్యమైంది ఇంట్లో అడుగు పెడుతున్నాను, "ఏమిటయ్యా, నేను వాణ్ణి చూడవద్దన్లా? గాంధీజీని ధిక్కరించిన మనిషి ముఖం ఏ మొగం పెట్టుకొని చూచావు? నీ యిష్టం, ఏమైనా అఘోరించు. నన్ను అడగకుండా నా పిల్లలను ఏమని పిలుచుకు వెళ్లావు? తా చెడ్డకోతి వనమెల్ల చెరిచిందట!"

ఈ ధోరణిలో అరగంటసేపు సాగాయి వషట్కారాలు. నేను గేటువద్ద తల వంచుకొని నిలబడి వున్నాను. నోరు మెదపబోయాను. కాని అక్కడ వున్నవాళ్లు ఇప్పుడేమీ మాట్లాడకు వెళ్ళిపో- అని చేత్తో సైగచేశారు. వెళ్ళిపోయాను రాత్రంతా కునుకైనా లేదు. 'నిజమే. అయనను అడగకుండా పిల్లలను పిలుచుకొని వెళ్ళడం తప్పే!' అని చెవుల్లో గుండె గింగురుమన్నది.

మర్నాడు ఉదయం గన్నవరపు సుబ్బరామయ్యగారింట్లో కబుర్లు చెబుతున్నాను. దాదాపు పదకొండు గంటలు వాకిలికి వీపుచేసి మాట్లాడుతున్నాను. నా ఎదుట కూర్చున్న సుబ్బరామయ్యగారు ఆకస్మాత్తుగా లేచి వాకిలివైపు పరుగెత్తారు. తిరిగి చూతునుగదా, శాస్త్రిగారు! నేను విస్తుపోయాను. శాస్త్రిగారు పరుగెత్తుకుంటూ వచ్చి నన్ను కౌగిలించుకుని గద్గద కంఠంతో ఏదో అనబోయి, మాట పెగలక కన్నీళ్లు కురిపిస్తూ నిలబడే వుండిపోయారు. పది నిమిషాలు గడిచాయి. సుబ్బరామయ్య గారి కుటుంబమంతా ఏమీ తోచక మా ఇద్దరిచుట్టూ మూగింది. శాస్త్రిగారు తెప్పరిల్లుకొని "నాయనా, ఎంతో నొప్పించాను." అన్నారు. నాకు తల కొట్టినంత పనయింది. "నాది తప్పు...." అన్నాను: "అబ్బే ! నీదేమీ తప్పులేదు. మద్రాసుకు మద్రాసే బీచిలో విరగబడగా లేనిది, నీవు వెళ్ళితే తప్పా ? నేను అక్కడ వచ్చినవారందరినీ శాసించ గలిగానా ?" అన్నారు. అలాంటిది వారి ఔదార్యం.

తర్వాత తెలిసింది, వారు నా గదికి వెళ్ళి, నన్ను అక్కడ కానక, సుబ్బరామయ్యగారింటికి వెదుక్కుంటూ వచ్చారని.

o o o

ఒకనాడు వారు ఆళవందార్ స్తోత్రం చదువుతున్నారు:

అవివేకఘనాంధదిఙ్ముఖే
బహుధా సంతతదుఃఖవర్షిణి,
భగవన్భవదుర్దినే పథ
స్ఖలితం మా మవలోకయాచ్యుత.

అమర్యాదః క్షుద్రశ్చలమతి రసూయా ప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ వినయరహితో వంచనపరః,
నృశంసః పాపిష్ఠః కథ మహ మితో దుఃఖజలధేః
అపారా దుత్తీర్ణ స్తవ పరిచరేయం చరణయోః.

"ఇదేమిటండీ శ్రీవైష్ణవుల భక్తి మీ కెందుకు ? మీ నిత్యత్వసిద్ధాంతాని కిది భంగకరం కాదూ ?" అని ప్రశ్నించాను. "ఒకప్పుడు ఆ సిద్ధాంతం దేశాన్ని ముందుకు తీసుకొనే పోయిందోయ్ హృదయాన్ని విప్పిచూపే ఈ స్తోత్రమంటే

నాకు చాల ఇష్టం." అన్నారు శాస్త్రిగారు. "ఇంతకూ వారు కూడా నిత్యత్వాన్ని గురించి ఆలోచించక పోలేదు. ఇతర వేదాంతులవలె కాక, దేహం భగవత్కైంకర్యం కోసమని, దాని అవసరం బాగా గుర్తించినవారు వైష్ణవులు దేహం అపదార్థమంటూ ఎక్కడనో, ఏదో వుందని పాకులాడడం దేవతావస్త్రాలను మూరవేసిన మోసగాళ్ళ చర్యవంటిది. నేహ నానాస్తి కించన, ఇహైవామృత మశ్నుతే, అస్మిన్ లోకే ప్రతితిష్ఠానీతి, అస్మిన్నేవలోకే ప్రతితిష్ఠతి- అనే వేదవాక్యాలు అమృతత్వమనేది ఈ లోకంలోనే పొందాలి గాని, ఎక్కడో తెచ్చుకొనిపోతే లేదని నిరూపిస్తున్నాయి. ఈ దేహంలో ఇక్కడే నిత్యత్వం మా లక్ష్యం." అన్నారు. "ఇంతవరకూ మరణం నిత్యంగా కనిపిస్తున్నదండీ! మరి మీరు ...." "ఔనయ్యా, మాది వింత సంగతే, అదే జరగాలి. అప్పుడే కొత్త వ్యవస్థ ఏర్పడుతుంది." అన్నారు.

o o o

"పది రోజులుగా ఎక్కడి కెళ్లావు ?" అని అడిగారు కొన్నాళ్ళ తర్వాత వచ్చిన నన్ను చూచి ఆయన. "పరీక్షలండీ !" అన్నాను. మరేమేమో అడిగారు; ఏవో సమాధానాలు చెప్పాను. తల దిమ్మగావుంది. కాళ్లు తేలిపోతున్నాయి నాకు. "ఇలాగే అవాకులూ చెవాకులూ వ్రాశావా పరీక్షలో ?" అని అడిగారు "లేదండీ! బాగా వ్రాశాను." అన్నాను. "మరి, ఎందుకు మాటలు తడబడుతున్నాయి ? తూలిపోతున్నావే ?" అన్నారు. "పదిరోజులుగా భోజనం లేదండీ !" అన్నాను. "మీ అమ్మ కడుపు చల్లగా! ఎంత పనిచేశావయ్యా !" అని వెంటనే లేచి భోజనం పెట్టించి నిద్ర పొమ్మన్నారు. మర్నాడు ఉదయం 9-00 గంటలకు లేచాను. దాదాపు పదహైదు గంటలు నిద్రపోయానన్నమాట. సంగతంతా వారికి చెప్పాను మర్నాడు: "సరిగ్గా పరీక్ష వేళకు చేతిలో కాసీ లేదు. పరీక్ష ఎనిమిది రోజులూ నా మిత్రుడు ఉడిపి రామచంద్రరావుగారి హోటలులో ఉదయం రెండు ఇడ్డెనలు తిని నడిచి లయోలా కాలేజీకి వెళ్ళేవాణ్ణి. రాత్రిళ్లా చదవడం, పరీక్ష నిన్న ముగిసింది, వచ్చాను." "ఎందు కింత మొండితనం ? నన్నడిగితే డబ్బు సర్దలేకపోయానా ?" అని అడిగారు. నేను ఏమీ జవాబు చెప్పలేకపోయాను. "మరొక రహస్యం చెప్పనా ?" అన్నారు.

"సరే." అన్నాను. "నీవు నాస్తికుడివి. సరే. నా మాటల్లో, నా చిత్తశుద్ధిలో నమ్మక ముంది కదా ?" అని అడిగారు "ఇదేమిటండీ! నాకు భగవంతుని పై నమ్మకం లేకపోయినా. మీపైన, బుద్ధభగవానుని పైన సమానంగా భక్తి వుందండీ!" అన్నాను. "అయితే విను. ఈ వారం పదిరోజులూ నీకోసం ఎంత ఆందోళన పడ్డానని ? ఎంత తిన్నా హరించుకుపోయేది. ఆకలి ! ఆకలి ! దయ్యపు తిండి. అంతా ఏమైపోతోందా అని ఆశ్చర్యపడ్డాను నీ సంగతి చూచింతర్వాత అర్థ మైంది. ఆ అన్నరసమంతా నీకు 'సప్లై' అయి నీకు వారంపాటు ధారక మైంది." అని అన్నారు. వారు చెప్పినదాన్ని శాస్త్రీయంగా నిరూపించలేనుగాని; ఆపన్నులపాలిటి అమృతభాండమైన వారి హృదయాన్ని తెలిసిన నేను వారి మాటలు అనాడూ నమ్మాను, నేడూ నమ్ముతున్నాను.

o o o

తమకు సన్నిహితు లందరూ నిప్పువలె వుండాలని శాస్త్రిగారి కోరిక. అలాగే జాగ్రత పడేవారు కూడా. కొన్ని సంవత్సరాల తర్వాత కనిపించాను. గుమ్మంలో అడుగుపెట్టడంతోటే "పునరాయా స్మహాకపిః" అంటూ దూరం నుంచే "ఆగు !" అన్నారు. ఆగి అక్కడినుంచే చేతులు జోడించా. దగ్గిరికి వచ్చి కిందినుంచి పైవరకూ తేరిపార జూచి "ఒళ్లు పాడుచేసుకున్నావా ?" అని గద్దించారు. "ఏ ఉద్దేశంతో అడుగుతున్నారు ?" అన్నాను. "దినైక గ్రామంగా తెగ తిరికావుగదా, ఏమేమి తలపులు తెచ్చిపెట్టుకున్నావో ? తాగుడు, మరొకటి...." "తాగుడుమాత్రం- పరీక్షకోసం- రుచిచూడా." అన్నాను. "అయితే మద్యం బాపి తవ ప్రియం ?" అన్నారు భలోక్తిగా. "అందరూ వేలంవెర్రిగా ఎగబడుతుంటే, ఎలా వుంటుందో చూద్దామని ఒక్కసారి...." అన్నాను: "ఒహో ! వెనకటికి నీలాటి జిజ్ఞాసువే, 'ఇచ్ఛా నాస్తి పరీక్షార్థం' అని ఏమో చేయబోయి...." అన్నారు. నేను పలకలేదు. "అయితే నీమాట నమ్మ మంటావా ? రెండోదాని జోలికి పోలేదుగదా ?" అన్నారు. "నిజంగా లేదు." అన్నాను.

అంతటిది వారి శ్రద్ధ తనవారి శీలం విషయంలో.

o o o

"ఇలా రావమ్మా చూద్దాం గాని పెద్ద కోడలిని ఎలా వున్నావో !" అని పిలిచారు శాస్త్రిగారు నా భార్యను మొదట చూడగానే. తల్లిదండ్రులు కోల్పోయిన ఆమెకు మరల వారిని చూచినట్టయింది. "సిగ్గుపడకు తల్లీ, మీ ఆయన నాకు పెద్దకొడుకువంటివాడు సుమా !" అన్నారు. ఆమె దగ్గరికి వెళ్ళి నమస్కరించింది.

"ఏమోయ్ ! కోడలిని బాగా చూసుకో ! నీ మొండితనం, మొరటుతనం చూపక !" అన్నారు నన్ను చూచి. మా ఆవిడ మరింత సిగ్గుపడి వెళ్ళిపోబో యింది. "ఉండవమ్మా ! ఉండు ! ఒక్క సంగతి అడుగుదామని వుంది. మీ ఆయన దూర్తుడు, ఎప్పుడైనా కొట్టాడా ? నన్నూ అప్పుడప్పుడు కొట్టవస్తాడులే." అన్నారు. "లేదండీ ! కొట్టరండీ." అన్నది ఆవిడ. "కొట్టాడంటే కార్డుముక్క వ్రాసి పడేయి. నాట్ పెయిడ్ అయినా సరే, నేను వెంటనే బండెక్కివస్తా. గూబలు పిండుతా. నా కెందు కాశ్రమం ? నా ఎదుట నీవే ఆపని చేద్దువుగాని." అన్నారు.

ం ం ం ం

ఒక రోజు ఏదో గోష్ఠి సాగుతున్నది. వేములవాడ భీమకవి ప్రస్తావన వచ్చింది. "కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేదు." అన్న పద్యం చదివారు మాలో ఒకరు. "కోమటి కొక్క టీక పది గొన్నను దోసము లేదు. అని దీనికి అపవాదశాస్త్రం మరొక టుందండీ!" అని మరొక మిత్రుడన్నాడు. "అయితే మన సెట్టిగారి సంగ తేమిటండీ !" అన్నాడు. ఒక కొంటె కోణంగి. సెట్టిగారంటే శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగా రన్నమాట. "మన సెట్టి గారిది వెన్నపూస వ్యాపారం కదూ ? ఆయన మనసుకూడ వెన్నవంటిదే. మరి ఆయన విషయంలో వేములవాడ భీమకవి పద్యం ఉల్టాగా చదవవలసి వుంటుంది. అంటే శెట్టిగారికే పదిచ్చి ఒక్కటి కొనవలసి వుంటుంది." అన్నారు శాస్త్రిగారు, "అయితే—" అని మరొక మిత్రుడు ఏదో అనబోయాడు శాస్త్రి గారు అడ్డువచ్చి "ఇంతకూ కుల మేమిటోయ్ ! బూజు పట్టిన వారని కొందరు ఈసడించే ఆ వ్యాపారస్థుల కులంలోనేగా గాంధీజీవంటి మహాపురుషుడు అవత రించాడు ! అలాటివారు వేయేళ్ళ కొకసారి ఏకులాన్లో అవతరించినా, అటు వేయి

తరాలూ, ఇటు వేయి తరాలూ తరించా యన్నమాటే ..." అంటుండగా ఆయన కళ్లు చెమ్మగిల్లాయి.

○ ○ ○ ○

"ఈ పూట ఇక్కడే భోజనం చేయవోయ్!" అన్నారు శాస్త్రిగారు ఒక రోజు. వడ్డన జరిగింది. "రావోయ్, మస్తాన్. కూర్చో భోజనానికి!" అని ఒక వ్యక్తిని పిలిచారు ఆయన కసరత్‌చేసి కండలుతీరిన మేనితీరుగల విద్వాన్ షేక్ మస్తాన్‌గారు నా పక్కనే తిష్ఠ వేశారు. "ఏమిటి? నీ వైష్ణవానికి భంగం కలిగిందా?" అని ప్రశ్నించారు. "లేదండీ మాకు బీబీ నాంచారు వుండనే వుందిగా!" అన్నాను. సపంక్తివారందరూ గొల్లుమని నవ్వారు. "అయితే నాకన్నా రెండాకులు ఎక్కువే చదివావన్నమాట!" అన్నారు. అందరి భోజనం సాగుతున్నది. "మస్తానుగారి సంగతి సరే, ఇక్కడ ప్రైవేటుగా విద్వాన్ పరీక్షకు చదువుతున్నారు. తక్కిన ముస్లిం విద్యార్థులకు తిరుపతి ఓరియంటల్ కాలేజీలో ప్రవేశం దొరికితే బాగుండును." అన్నారు మాలో ఒకరు. శాస్త్రిగారు వెంటనే "ఔనౌను. నేడు పర్షియావారు, అఫ్ఘన్ పఠానులు సంస్కృతం చదవగా లేనిది, మనదేశపు ముస్లిములకా వచ్చింది ఈ నిర్బంధం? ఇంతకూ ఢాకా విశ్వ విద్యాలయం సంస్కృతశాఖాధ్యక్షుడు ముస్లిం. తప్పకుండా ముస్లిములకు ఈ కాలేజీలో ప్రవేశం దొరకవలసిందే." అన్నారు. వారికి ఈ సంకల్పం ఏ సుముహూర్తంలో పుట్టిందో! ప్రయత్నాలు జరిగాయి. సంకల్పసిద్ధి మాత్రం ఆయన నిర్యాణం తర్వాత కలిగింది. ఆయన పేరు సంస్మరిస్తూ నేడు పలువురు ముస్లిం సోదరులు తిరుపతి ఓరియంటల్ కాలేజిలో విద్వాన్ తరగతి చదువుతున్నారు. ఈ సంప్రదాయం అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది.

○ ○ ○ ○

ప్రభాకరుల యోగ చికిత్సను గురించి ఒకటి రెండు సంఘటనలు చెబుతాను. వారి యోగచికిత్స అంటే, ఆసనాలు వేయడమో, మందులు వాడడమో కాదు. కొన్ని వేళలలో వారు ప్రార్థనలు జరుపుతారు. ఆ ప్రార్థనాసమయంలో వ్యాధిగ్రస్తులు తమ ఇష్టదైవాన్ని గురించి ప్రార్థన చేయవచ్చు, లేదా ఊరికే కళ్లు మూసుకొని కూర్చోవచ్చు; వెల్లికిలా- శవాసనంలాగ పడుకోవచ్చు. ప్రభాకరులు ఏమిచేస్తారో మనకు తెలీదు; "కళ్లు మూసుకొని ఏమి జరుగు

తుందో గమనించండి." అనేవారు. ఆ సమయంలో వ్యాధితులకు వివిధ భావాలు కలిగేవి. కొందరు స్పృహతప్పి పోయేవారు, కొందరు నిద్రపోయే వారు. వ్యాధిగ్రస్తుల భావాలనుబట్టి, చర్యలనుబట్టి ప్రభాకరులు సూచన లిచ్చేవారు. ఈ యోగంలో పతంజలి చెప్పిన చిత్తవృత్తి నిరోధంలేదు; చిత్తవృత్తి ప్రవృత్తే గాని.

నా మిత్రుడు గృహలక్ష్మి సంపాదకుడు చదువుల రామచంద్రయ్యకు ప్లూరసీ వచ్చింది. ప్లూరసీ అంటే గుండెచుట్టూ నీరు చేరడం. నా మిత్రునికి ప్రార్థన సమయంలో రకరకాల భావాలు, దృశ్యాలు తోచేవి. ఒకమారు అతనికి ఎవరో తన గుండెచుట్టూ బంగారు పూత పూసినట్లు, నీటిని తోడివేస్తున్నట్టు ఇంకా ఏవేవో దృశ్యాలు కనిపించాయి. ప్లూరసీకి బంగారు ఇంజక్షన్‌లు ఇస్తారు అల్లోపతీలో. ఆయుర్వేదంలో స్వర్ణ భస్మం వాడుతారు. "వైద్యులు వెలుపలచేసే పనులు నీలో భగవంతుడు జరిపిస్తున్నాడు." అనేవారు ప్రభాకరులు.

o o o o

ఒకమారు ప్రభాకరులు ఆంధ్రపత్రిక సంపాదకులు నార్ల వెంకటేశ్వర రావు గారింటికి వెళ్ళవలసి వచ్చింది పనిమీద. నేనూ వెంట వున్నాను. ఉభయ కుశలోపరి నార్లగారు "తల నొప్పితో బాధపడుతున్నానండీ నాలుగైదు నెలలుగా. రకరకాల మందులు రకరకాల వైద్యులవద్ద వాడాను. తగ్గడంలేదు. అక్షరం ముక్క వ్రాయలేకపోతున్నాను. కాని వ్రాయక తప్పడంలేదు." అన్నారు. "నాపైన మీకు విశ్వాసం ఉందా ? నా పద్ధతి కొంచెం చూస్తారా ?" అనడిగారు ప్రభాకరులు. "మీరు పెద్దలు. మీపైన విశ్వాసం లేకపోవడం ఏమిటి ? ఏమి చేయమన్నారో చెప్పండి." అన్నారు నార్లగారు. "ఏమీ చేయనక్కరలేదు. కుర్చీలో హాయిగా కూర్చుని కళ్లు మూసుకొని ఏమి జరుగుతుందో చూడండి." అన్నారు ప్రభాకరులు. "కళ్లు మూసుకొని చూడడమెలాగ ?" అని మంద హాసం చేశారు నార్లగారు. అయినా కళ్లమూసుకొన్నారు. కొన్ని నిమిషాలకు నార్లగారికి బాగా నిద్రపట్టింది. కుర్చీమీదినుంచి కిందికి తూలిపడ్డారు; ఇలాటిది జరిగినందుకు కొంచెం సిగ్గుపడ్డారుగాబోలు అటు ఇటు అందరినీ చూదారు. ప్రభాకరులు అప్పుడు "సిగరెట్లు ఎక్కువగా కాల్చడంవల్ల మీ కీ తలనొప్పి; దానిని తగ్గించండి." అంటూ "ఏమి జరిగింది ?" అని ప్రశ్నించారు. "ఎక్కడికో పైకి ఎక్కిపోతున్నట్టుగా వుంది. ఎవరో కణతలను అదిమిపట్టి మంచు

గుడ్డంపట్టీ తలకు చుట్టినట్టుంది. ఇంకా పైకి వెళ్ళాను. ఒకమారు కిందికి చూడాను. అమ్మో ! ఇంత ఎత్తుకు ఏచ్చానూ అనుకున్నాను, తల తిరిగి కిందికి తూలి పడ్డాను. మెలకువ వచ్చింది." అన్నారు నార్లగారు. పత్రికాకరు లప్పుడు వెంటనే తలనొప్పి సంగతి అడగకుండా, మనస్సు, దాని క్రియలు, శరీరంపై దాని ప్రభావం మున్నగువాటిపై పది పదిహేను నిమిషాలపాటు ఉపన్యసించి, "తలనొప్పి ఎలా ఉంది ?" అని ప్రశ్నించారు "బరువు దిగిపోయినట్టుగా వుండండీ. ఇప్పుడేమీ లేదు, హాయిగా వుంది." అన్నారు నార్లగారు. "సిగరెట్లు మానండి సాధ్యమైతే, కాకపోతే తగ్గించండి." అంటూ లేచారు పత్రికాకరులు.

• • • •

మావంటివాళ్ళపై ఆయన ఎంత శ్రద్ధ తీసుకొనేవారో ఒక ఉదాహరణ చెబుతాను. నేను ఏదో కోపంతో ఆంధ్రపత్రికలో నౌకరీ మాని నెలరోజులపాటు ఇంట్లో కూచున్నాను. ఈ సంగతి పత్రికాకరులకు తెలిసింది. నాకు ఉత్తరం వ్రాశారు. నేను జవాబు వ్రాయలేదు అప్పుడొక పెద్దమనిషిని నా వద్దకు పంపారు. ఆయన ఎవరో సామాన్యమైన వ్యక్తి కాదు. తిరుపతిలో పెద్ద కవి, సుప్రసిద్ధ న్యాయవాది, శ్రీమాన్ మతం మాడభూషి వేంకటాచార్యులు. ఆరడుగుల నిలువుతో రామానుజాచార్యులవలె ఉండేవారు. ఆయన తిరుపతినుండి పనిగట్టుకుని వచ్చి "అయ్యా, మీరు గురువుగారి ఉత్తరానికి ప్రత్యుత్తరం వ్రాయలేదట. మిమ్మల్ని వెంటనే ఉద్యోగంలో చేరమన్నారు. మీరు మళ్ళీ దరఖాస్తు పెట్టుకోనక్కరలేదు; లాంఛనాలు ఏవీ లేవు. మీరు వెళ్ళడం పూర్వంలాగే పనిచేసుకోడం. అంతే" అని పత్రికాకరుల సందేశాన్ని వార్తాహరునిలాగ వినిపించి వెళ్ళిపోయారు.

• • • •

పత్రికాకరులు కృష్ణాజిల్లా దివిసీమలోని పెద్దకళ్ళేపల్లిలో సర్వజిన్నామ సంవత్సరం మాఘ బహుళైకాదశి మంగళవారం 1888 ఫిబ్రవరి 7వ తేదీన జన్మించారు. తండ్రిగారిపేరు సుందరశాస్త్రిగారు; తల్లిగారు శేషమ్మగారు. శ్రీవత్స గోత్రం. తమ ఊరిని గురించి వారు చిన్ననాటి చేష్టలనే ఖండకావ్యంలో-

పూర్వకాలమునను పేర్వెలసినది మా
పీడు వేదశాస్త్ర విద్యలకును
దాని మారుపేరు దక్షిణ కాశిక
కృష్ణ యచట యుత్తరించి సాగె

అని చెప్పుకొన్నారు. తండ్రిగారు స్మార్త వైదిక జ్యోతిష శిల్ప సంస్కృత సాహిత్యాలలో తగినంత పరిచయమున్నా, వైద్యవిద్యను చేపట్టారు. ప్రభాకరులకు చిన్ననాటినుంచి తెలుగంటే వెర్రితీపి; కనుక ఇంగ్లీషు మాని తెలుగు సంస్కృతాలే చదివారు. ఆయన పీధిబడి చదువు పూర్తయిన పిదప పెదకళ్లేపల్లిలోనే శ్రీ మద్దూరి రామావధానులవద్ద సంస్కృతం, ఇంట్లో తెలుగు చదువ సాగారు శ్రీ రామావధానుల వద్ద పద్యపరిచయం, కాళిదాసత్రయం పూర్తికావించారు. పిదప పెద్దకళ్లేపల్లెలో అద్దేపల్లి సోమనాథశాస్త్రి గారివద్ద శాస్త్రాభ్యాసానికి బయలుదేరారు. సోమనాథశాస్త్రిగారు విజయనగరంలో సూరి భీమాచార్యులనే విఖ్యాత తార్కికులవద్ద సంగమేశ్వరశాస్త్రి గారితో పాటు పెక్కేండ్లు తర్కశాస్త్రం అభ్యసించినవారు. తిరువాన్కూరు మహారాజు ఆయనను సువర్ణ కంకణంతో సన్మానించారు. ప్రభాకరులు సోమనాథశాస్త్రి గారివద్ద కౌముది, తర్కశాస్త్రంలో రెండు ప్రకరణ గ్రంథాలు, పతంజలి యోగ సూత్రాలు భాష్య సహితంగాను, కావ్య నాటకాలంకారాది సాహిత్య గ్రంథాలు అధ్యయనంచేశారు.

అప్పుడు- 1904 ప్రాంతంలో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి పేరు బందరు పరిసరాలలో మోగిపోయేది. ఆయన కవితా జీవితం గురించి జనం కథలుగా చెప్పుకొనేది. ప్రభాకరులు ఆయనవద్ద రెండేళ్లు- 1904-1906 వరకు విద్యాభ్యాసం చేశారు; ఆయనవద్ద అష్టావధాన శతావధాన ప్రక్రియను నేర్చారు. "తెలుగున నాకేమేని యెరుక ఏర్పడె నన్నచో అది శ్రీ వేంకటశాస్త్రిగారి గురు తానుగ్రహప్రాప్తమే." అని వారు ప్రజ్ఞాప్రభాకరంలో వ్రాసుకొన్నారు. ప్రభాకరులు వేటూరి శివరామశాస్త్రిగారితో కలిసి అష్టావధాన శతావధానాలూ చేశారు. కాకినాడ నుంచి వెలువడుతున్న 'సరస్వతి' పత్రికలో 1911 లో ఎడ్వర్డ్ పట్టాభిషేకోత్సవ సందర్భంలో వారు ప్రచురించిన పద్యాలకింద "శతావధాని వేటూరి ప్రభాకరశాస్త్రి" అని ఉంది. "అవధాన ప్రక్రియను ఎందుకు వదిలారు సార్ ?" అని ఒకసారి ప్రశ్నించాను. "దాని అవసరం కొంతవరకే.

వివిధ రంగాల్లో పరిశోధన జరగాలి. కనుక పరిశోధనాసక్తితో నా పద్ధతి మారింది." అన్నారు వారు. ఆ అవధానంతోనే ప్రభాకరులు వుండిపుంటే వెంకటశాస్త్రిగారంతటి వారయ్యేవారేమోగాని వాఙ్మయ చరిత్ర పురాతత్త్వ శాసనాది పరిశోధనరంగం గొడ్డుపోయేది.

ప్రభాకరులు 1906లో బందరు వదలి మద్రాసు చేరారు. మద్రాసు తర్వాత వివిధ భాషారాష్ట్రాలయిన ప్రాంతాల ఉమ్మడి రాజధానేకాక గొప్ప సాహిత్య కేంద్రం. వారు మద్రాసు రావడానికి ప్రధాన కారకులు సుప్రసిద్ధ న్యాయవాది, ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ స్థాపకుడు, మహాదాత అయిన వల్లూరి సూర్యనారాయణరావుగారు. "సూర్యనారాయణరావుగారి ప్రేరణచే నేను మద్రాసు చేరితిని" అని వారు ప్రజ్ఞాప్రభాకరంలో చెప్పుకొన్నారు. మద్రాసులో వారు వెస్లీమిషన్ హైస్కూలులో తెలుగు పండితులుగా కుదురుకొన్నారు. దాని నిప్పుడు కెల్లెట్ హైస్కూలు అంటున్నారు. ఈ ఉద్యోగం 1910 వరకు సాగింది. ఆ సంవత్సరమే వారికి పిసిపాటి జగన్నాథముగారి కుమార్తె మాతృశ్రీ మహాలక్ష్మమ్మగారితో వివాహం జరిగింది. పిదప వారు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో (గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో) మొదట కాపీయిస్టుగా చేరి, పిదప క్యాటలాగరై అనంతరం పండితులుగా నియమితులయారు.

మద్రాసులో వారికి వివిధ రంగాల ప్రముఖులతో కలిగిన పరిచయం వారి ప్రజ్ఞను సర్వతోముఖం చేసింది. కందుకూరి వీరేశలింగం పంతులు, సుప్రసిద్ధ న్యాయవాది, తర్వాత హైకోర్టు న్యాయమూర్తి వేపా రామేశం, అపర ధన్వంతరి పండిత డి. గోపాలాచార్యులు, ప్రముఖ పత్రికానాయకులు, వైజయంతీ పత్రిక సంపాదకులు పనప్పాకం అనంతాచార్యులు, ప్రముఖ వ్యాపారి రెంటాల వెంకటసుబ్బారావు విఖ్యాత విద్వాంసులు వేదం వేంకటరాయశాస్త్రి ప్రముఖ వైద్యులు ఆచంట లక్ష్మీపతి ఆంధ్రపత్రికాధిపతి కాశీనాథుని నాగేశ్వరరావు, విఖ్యాత న్యాయవాది, కాంగ్రెస్‌వాది టంగుటూరి ప్రకాశంపంతులుగారు మున్నగు వారు వారి పరిచితులు వారితో తరచు చర్చలు, గోష్ఠులు జరిగేవి. పనప్పాకం అనంతాచార్యుల భవనం భువనవిజయసభామండపంవలె వుండేది. వీరేకాక ఆంధ్రదేశంనుంచి వచ్చే మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రి మొద

లయినవారు చెన్నపురిలో వీరింట దిగేవారు. గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు, గురజాడ అప్పారావుగారు వీరికి పరమాప్తులు.

ప్రభాకరులు మానవల్లివారితో కలిసి వివిధ ప్రాంతాలలో ప్రాచీన గ్రంథ సేకరణ చేశారు. లిఖిత పుస్తకాలకు డిస్క్రిప్టివ్ క్యాటలాగు వ్రాశారు. 1939 వరకు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పనిచేశారు. నడుమ నడుమ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు సెలవు పెడుతున్నందున ప్రెసిడెన్సీ కళాశాలలో పండితులుగాను పనిచేశారు. భాండాగార పండిత పదవినుంచి రవిమించిన పిదప వారు 1939 చివర తిరుపతికి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో ఆంధ్ర శాఖను స్థాపించడానికి వెళ్ళారు. 1940 లో అక్కడ విద్వాన్ తరగతులు ఆరంభంకాగా, అప్పటినుంచి తెలుగుశాఖకు ప్రధానాచార్యులయ్యారు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో పరిశోధకులుగాను, 1945 నుండి రీడరుగా పనిచేశారు.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు 1950 ఆగస్టు నెలలో ఒక మ్యూజియం స్థాపించాలని సంకల్పించి వస్తువులను సేకరించే బాధ్యతను ప్రభాకరులకు అప్పగించారు. వారు గుంటూరులో ఆ వర్షాకాలంలో పర్యటించారు. యద్దనపూడిలోని ఒక బావిలో గొప్పశిల్పాలు గుప్తపరుపబడ్డాయని విని వెళ్లారు. జడివానలో మోకాలిబంటి నల్లరేగడిబాడిలో నడక. అక్కడ వారి ఆరోగ్యం చెడింది. అక్కడ పని ముగించుకొని తీవ్ర జ్వరంతో తిరుపతికి తిరిగివెళ్లారు. ఆ స్థితిలోను రోగులకు యోగ చికిత్స చేశారు. 1950 ఆగస్టు 29వ తేది శుక్రవారం నాడు రోగులకు చికిత్సచేస్తూ, "ఆ దివ్య యోగశక్తి ఎట్లా పనిచేస్తున్నదో చూడండి. మీరు మాత్రం మాస్టనును మరచిపోకండి." అంటూ తుదిశ్వాస వదలారు.

ప్రభాకరులు ఆచార్యులుగను ఉత్తములు. విద్యార్థుల మనో మందిర కవాటాలను తెరచే నిజమైన గురువులు. ప్రాచీన కవితా నిర్మాణ మర్మాలను వెలువరిస్తూ శిష్యులను సాహిత్య పటువులనుగా తీర్చిదిద్దడమేకాక నిర్మలశీలురుగాను మలచడం వారి ప్రత్యేకత. వారి పాఠప్రవచనాలు రసవ్యాఖ్యానాలు, వారి భాషా పరిశీలన పద్ధతి అనన్యం. దాక్షిణాత్య భాషలన్నీ వారికి కరతలామలకాలు గనుక తెలుగు నుడికారాల, పలుకుబడుల సామెతల, తీయందనాలతోపాటు

దక్షిణ భాషలన్నింటి ఇంపుసొంపులూ తెలిపేవారు. దేశి సాహిత్య మధురిమలు గురించి చెప్పనక్కరలేదు. వారు శిష్యుల దస్తూరీ అందంగా వుండాలని చూచే వారు; దస్తూరీ బాగులేనివారిని మందలించేవారు.

"లాచి పరాంగనల్ వర వి
లాస మనోహర రూపసంపదన్
జూచిన జూడ రుత్తముడు
జూచిన జూచును మధ్యముండు దా
జూచిన జూడకుండినను
జూచును నీచుడు వారిలోన నన్
జూచిన జూడకుండు ఘను
జూచిన జూపుల జూడు మంబికా"

అనే పద్యం తరచు వారు చెప్పేవారు శీల వ్యాఖ్యాన సందర్భాలలో.

ప్రభాకరులకు ఒక అన్నగారు ఉండేవారు. వారు పోస్టుమాస్టరుగా ఉండి పదవీ విరమణ చేశారు. ఇద్దరు తమ్ములు. మొదటి తమ్ములు డాక్టర్ చంద్రశేఖరశాస్త్రిగారు ఎల్.ఎం. పి డాక్టరు రెండవ తమ్ముడు శంకరశాస్త్రిగారు, వైద్య రత్న పండిత డి గోపాలాచార్యుల వారి మద్రాసు ఆయుర్వేదకళాశాల పట్టభద్రులు, విఖ్యాత వైద్యులు. సోదరీమణులుకూడ ముగ్గురు నలుగురున్నారు. ప్రభాకరులకు కుమారులు ముగ్గురు. డాక్టర్ సుందరమూర్తిగారు, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో కెమిస్ట్రీ రీడరుగా ఉండి పదవి విరమించారు; గురుప్రసాద్‌గారు సెంట్రల్ ఎక్సైజ్ శాఖలో అధికారిగా వుండినవారు; మూడవవారు డాక్టర్ ఆనందమూర్తి గారు, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో ప్రొఫెసర్. కుమార్తెలు సౌభాగ్యవతులు లలిత, సుజాత, వినత గారలు.

ప్రభాకరులు తమ 45 సంవత్సరాల వాఙ్మయ జీవితంలో భారతి, శారద, కళ, చంద్రిక, రెడ్డిరాణి, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, ఆంధ్రపత్రిక ఆదివారం సారస్వతానుబంధం, ఆంధ్రి, దేశమాత, అభినవ సరస్వతి, గృహ లక్ష్మి, త్రిలింగ, సమదర్శిని, వైజయంతి, శశిరేఖ, ముక్త్యాల సరస్వతి, ప్రజా మత, ఆనందవాహిని, ఆంధ్రభారతి (బందరు), కృష్ణాపత్రిక, సుభాషి, బ్రాహ్మణోదయ పత్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక మున్నగు పత్రికలకు,

తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ జర్నల్ లోను తమ రచనలు ప్రచురించారు; సమకాలిక పత్రికలన్నింటినీ వారి రచనలు అలంక రించాయంటే సరిపోతుంది.

**కవితలు :**

ప్రభాకరులలో కవితాంకురాలు చిన్ననాటే పొటమరించాయి. అద్దేపల్లి సోమనాథశాస్త్రి గారివద్ద ఉన్నప్పుడే వారు సంస్కృత శ్లోకాలు రచించారు. ఇవి ఎడ్వర్డ్ పట్టాభిషేక సందర్భంలో 1902లో రచించినట్టివి. మద్రాసు చేరిన పిదప పనప్పాకం అనంతాచార్యులుగారి గోష్ఠిలో రచనలు చాలా చేశారు. ఆయన తెలిగించిన ఒథెల్లో నాటకానికి పద్యాలు వ్రాశారు. "కవితా శిల్పము సల్పగా తొలుత వేడ్క న్రేగె నాకున్" అని చెప్పుకున్నారు. వారి కవితలను ఖండ కావ్యాలు, అనిబద్ధాలు, అనువాదాలు అని మూడు పాయలుగా వింగడించవచ్చు. వారి తొలిఖండకృతి మూన్నాళ్ళ ముచ్చట. దీని ఇతివృత్తం ఒక గృహస్థు పనికత్తెను కామించడం, అది బైటపడి ఇల్లాలు చీవాట్లుపెట్టడమూను. కావ్యా రంభమే ఎంతో నవీనంగా ఉంటుంది :

> క్రొవ్వం జవ్వన మబ్బు గుబ్బెతల ట
> క్కుం డెక్కులం జిక్కకే
> జవ్వన్ జట్టును లేక పైకొనిన దే
> బ్రాయంపు పెంజీకటిన్
> బువ్విల్కానికి గీ క్రివి త్తమును గో
> ల్పో కార్యమర్యాదతున్
> దవ్వుల్ గాక చరించు నంచితుల వృ
> త్తం బెంతు చిత్తంబునన్.

ప్రభాకరుల కవితలో కావ్యప్రయోజనాలైన ఆనందోపదేశాలలో ఉపదేశంవైపే మొగ్గు. కవితాశిల్పం సంగతి చెప్పనక్కరలేదు. కవిత శిల్ప సుందరి. ప్రభాకరులు అవధానులూను గనుక ఆశుకవితలోను దిట్టలు. రెంటాల వెంకట సుబ్బారావుగారు ఒక కొలనిలో శుద్ధి స్నానం చేస్తున్న చెరగుమాసిన చేడియను చూపి కవిత చెప్పమన్నారట. ప్రభాకరులు ఆశువుగా—

కొనగోట గురుల జిక్కులు దీర్చి ముడిసుట్టి
నలుగెలంకుల జూపు లొలయజేసి
ఉడుటు గుబ్బల జైక వదలించి దుసికిల్లి
వెలయ బయ్యెంట చేగలయబోదివి
గుమురెత్తు పులకల నిమిరి పొక్కిలిబంటి
నీట లేయెండ మైనాట దిగ్గి
గుమ్మడి మూటగా గూర్చుండి చిగురాకు
దొప్పదోయిపల నీరప్పళించి

కరగిపోసిన కొంగుబంగారనంగ
యొరపు మైకాంతి తరగల బొరలియాడ
గొలన గనుగొమ్మ చెలికాడ జలకమాడు
చెలగు మాసిన చిన్నారి చిగురుబోడి.

అని పద్యం చెప్పారట.

ప్రభాకరులు కూడ మానవల్లి వారిలాగే భోజన ప్రియులు. ముద్దపప్పు, రెండు కూరలు, పచ్చడి, పులుసు, పెరుగు, చేయి చురుక్కునే నేయి వుండాల్సిందే. భోజన సమయంలో వస్తువులను వర్ణిస్తూ, అన్యప్రాంతాలవారు పంక్తిలో వుంటే వారి ప్రాంతాలలో ఆ కూరలు ఎలా చేసారో తెలుసుకొంటూ ఆరగించేవారు. గోంగూర పచ్చడి అంటే మరింత ప్రీతి. కడుపుతీపు ఖండకావ్యంలో వారు సన్నివేశం కల్పించుకొని గోంగూర పచ్చడిని ఇలా వర్ణించారు:

పయర కూర వేచి పచ్చిమిరెపపండ్ల
నుక్కళించి పోసి యూరనిచ్చి
కొంత కొంత పొసగికొను గోగుపచ్చడి
చవికి నింత నోరు చివికితీరు.

ప్రభాకరుల కవితా దృక్పథం 1946 జనవరి నవ్య సాహిత్య పరిషత్తు ఉపక్రమోపన్యాసంలో స్పష్టమయింది. "సత్యోద్బోధముకాని, జ్ఞానోద్బోధము కాని, ఆనందోద్బోధముకాని రచనలు కాలప్రవాహములో రాలిపోతవిగాని నిలువ జాలవు.... మహాకవులందరూ పూర్వమెప్పుడో గడచిపోయినారని, ఇదేదో పిదప

కాలము వచ్చిందని, పంకరమూర్తి పిందె కవిత్వాలు వచ్చినవని అఘోరించే వాళ్ళలో వాణ్ణి కాను నేను.... మన పరిపూర్ణత రేపటి రోజులలో ఉన్నది కాని నిన్నటి రోజులలో లేదు ... సత్యద్రష్ట కల్పన జోలికిపోడు. వానికి కల్పన నిస్సారంగా తోస్తుంది. వాని యెరిగిన సత్యమును నిరూపించుటకే భాషకు బలము చాలదేమో అనదగినట్లుండగా, వానికి కల్పనలూ, ఛందోలంకార పరికరమూ ఎందుకు?" అని వారు ఎలుగెత్తి చాటారు. కవితలోను వారిది సత్యసౌందర్య దృష్టే. ఇలాటి పరిణత దృక్పథం కలవారు కనుకనే వాస్తవార్థాలనే తమ లఘు కావ్యాలలో వెలయించారు; కల్పనలకు పోలేదు.

ప్రభాకరులు మాస్టర్ సి.వి.వి. యోగశిష్యులయిన తర్వాత ఆధ్యాత్మిక రచనలెన్నో చేశారు. వాటిలో వారి భావపరిణతి స్పష్టమౌతుంది :

"పంచదార నేను పాల్ నీవు నీలోన
గరగినాడ కరడుగట్టి తీవు
అధికరుచుల నేకమయితిమి యీ 'కోవ'
భూమికింక నమృతమేమి స్వామి!

దీనిలో కోవ భాషాంతరశ్లేష. ఈ కోవ- ఈ విధంగా అని, కోవాబిళ్ళ (హిందీ వికృతి) అని.

వారు సంస్కృత రూపకాలు పెక్కింటికి అనువాదాలు చేశారు. అంతకు పూర్వము కొందరు అనువాదకులు ప్రాకృతానికి వ్యవహారభాష వాడారు. కాని ప్రభాకరులు ప్రతిమానాటకానువాదంలో పూర్తిగా వ్యవహారభాషే వాడారు.

వారు గొప్ప విమర్శకులు; విమర్శకు ఆధునికతను సంతరించినవారిలో ఒకరు. వారి విమర్శలకు పీఠికలు ఆలవాలమయ్యాయి. వారి విమర్శ కావ్య శైలి, ఔచితీ నిర్వాహం, కల్పనా చాతుర్యం, భావప్రకాశనం, స్వభావ పరిజ్ఞానం, అన్యకవుల అనుకరణం, లోకోక్తులు, ఇతరుల ప్రభావం, విశిష్ట పదప్రయోగాలు, ఛందోరీతులు- ఇలా సాగుతుంది. వారి పీఠికలలో కొన్నిటి సారాంశాన్ని ఇక్కడ పేర్కొంటాను, అవి విశిష్టమైనవి గనుక.

**పీఠికలు :**

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమే వైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.

భగవంతుని పొందడం పాండిత్య ప్రవచనాలతోను, మేధతోను, సాధ్యంకాదు. భగవంతుడు ఎవరిని వరిస్తాడో, వారికే లభిస్తాడు; తన స్వరూపాన్ని వివరిస్తాడు— అని ఉపనిషదుక్తి. ఇట్టి భగవదనుగ్రహీతునికి తక్కిన సామాన్య విషయాలు హస్తిపదన్యాయంగా కరతలామలక మౌతాయను దానికి నేను దర్శించిన పలువురు మహనీయుల జీవితాలే తార్కాణం. భగవదనుగ్రహమనే ఆ దివ్యశక్తి ఎక్స్‌రే కిరణాలకన్నా మర్మభేదిని. అది వారికి చర్మ చక్షురగ్రాహ్యమైనదానిని, మేధాతీతమైన దానిని తృటిలో భాసింపజేస్తుంది; ఇతరులతో వారికి యోజనాల అంతరం కలిగిస్తుంది. అలాటి శక్తి నిండారిన మహనీయులు గురువర్యులు ప్రభాకరులు.

యోగంలో గాని, యోగేతరవిషయాలలో గాని ప్రభాకరులు సమస్యలను పరిష్కరించడం అపూర్వంగా ఉండేది. ఏదైనా సమస్య వచ్చినపుడు, ఎవరైనా ప్రశ్నించినప్పుడు ఒక్కక్షణం కన్ను మూసుకొనేవారు. మరుక్షణం వారి ముఖం వేయి బల్బుల కాంతితో వెలిగేది. వెంటనే కన్ను విప్పేవారు. శాంతి వాత్సల్యాలు కుమ్మరించే ఆ కళ్ళనుంచి పృచ్ఛకుడు సమాధానం పొందినట్లే అనుభూతిపొందేవాడు; పరిష్కార మార్గం తనలోనే తోచినట్లు భావించేవాడు. పృచ్ఛకుని ఈ అభిముఖ్యం విచిత్రంగా తోచేది. వారి మనన నిదిధ్యాసనలూ కొనసాగేవి. ఇలాటి సన్నివేశాలలో వెలువడినట్టివే ప్రభాకరుల వివిధ సారస్వత రత్నసముచ్ఛయాలు అని నా నమ్మకం. ఆ సముచ్ఛయాలలో ఒక భాగమే పీఠికలు.

ఈ పీఠికలను విశ్వనాథ సత్యనారాయణగారు

"వేటురివారి వాక్యములను పీఠికలున్ తెలుగుంబొలంతికిన్
పేటులు రేగు గంధవొడివెట్టిన పూతలు...."

అన్నారు. విషయబాహుళ్యానికి, విస్తృతికేకాక ప్రామాణికతకూ ఈ పీఠికలు పెట్టింది పేరు. ఈ యుగంలో విస్తృత పీఠికలకు పేరు పొందినవాడు సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత బార్డ్ బెర్నార్డ్ షా. ఆయన పీఠికలు మూలరచనకు ఇబ్బడిగా ఉంటాయి. దక్షిణ భాషలలో విస్తృత, ప్రామాణిక, విషయ సంభృత పీఠికలకు ప్రభాకరులదే ఒజ్జబంతి అని నా నమ్మకం.

ప్రభాకరులు ఇంతటి విపుల పీఠికలు వెలయించడానికి కారణమూ ఉంది. కలం పట్టినప్పుడెల్లా కలకాలం నిలిచే సత్యాన్ని చెప్పడం వారి ఆశయం. అంతవరకు కాసటబీసటగా వున్న విషయాలను, గాథలను వింగడించి, విమర్శించి చెప్పడానికి హేతువులు చెప్పాలి, ప్రమాణాలు చూపాలి, తాము సత్యమని నమ్మిన దానిని ఎవరికీ బాధాకరం కాని రీతిగా– సత్యంబ్రూయాత్ ప్రియం బ్రూయాత్–గా చెప్పాలి అయినప్పుడు విస్తృతి తప్పదు. ఇంత విస్తారంగా ఉన్నా అవి విసుగు కలిగించవు. దానికి కారణం, రచనా రామణీయకమేకాక, విషయవైదగ్ధ్యం కూడ. జిజ్ఞాసువు రచనతోను, విషయ భారంతోను సంతృప్తి చెంది, తన్మయతతో తనిసిపోతాడు– అందువలన వాటిని ప్రత్యేకంగా ప్రచురించడం జిజ్ఞాసువులకు ప్రయోజనకరమనే దృష్టితో మణిమంజరి ప్రచురణ సంస్థవారు ఆ ప్రయత్నానికి పూనుకుని ఒక పీఠికాసంపుటాన్ని ప్రచురించారు. దీనిలో తంజావూరి చరిత్ర, ప్రబంధరత్నావళి, చారుచర్య, శ్రీకాకుళ శ్రీహరి శతకము, భగవదజ్జుకము, ఉద్భటారాధ్య చరిత్రము, మనుచరిత్రము, ప్రతిమా నాటకము, బసవపురాణము, బసవోదాహరణము, నీతిద్విషష్టిక, కర్ణభారము, మధ్యమవ్యాయోగము చాటుపద్య మణిమంజరి భగవదజ్జుకము (సంస్కృతం); నీతిద్విషష్టిక (సం.) పీఠికలు ఉన్నాయి. ఇవి రచనా కాలానుగుణంగా ప్రచురితాలు. ఇలా చేయడంవల్ల పాఠకులకు ప్రభాకరుల పీఠికా రచనా క్రమపరిణామ వికాసాలు తెలుస్తాయి.

తంజావూరి చరిత్ర పీఠిక :– కృష్ణరాయల రాయబారులైన నాయకులు తంజావూరు, మధుర రాజ్యాలను ఏలారు. అప్పుడు తెలుగు సరస్వతి దక్షిణాన ముత్యాల పల్లకి ఎక్కి మురిసి పోయింది. దక్షిణ దేశంలో పుట్టిన తెలుగు ప్రబంధాలు వందలు వందలు. వాటి ముక్కు మొగం చూడక కొందరు వెక్కిరించారు అవి మంచి ప్రబంధాలు కావని. దానికి కారణం పెక్కు దక్షిణాది

కావ్యాలు ప్రచారంలో లేకపోవడమే. అలాటి విమర్శకుల "మాటలు మనం పాటించరాదు. మంచి కాలం వస్తుంది. అందరూ వాటివల్ల ఆనందిస్తారు." అన్నారు ప్రభాకరులు. కనుకనే ఈ పీఠికలో ప్రభాకరులు తంజావూరు నాయకరాజ్యస్థాపన చరిత్ర మొదలయిన వివరాలతో పాటు సాహిత్య చరిత్ర కూడ తెలుపవలసివచ్చింది.

ప్రమాణంలేందే పలుకైనా కాయితంమీద పెట్టని నియమం ప్రభాకరులది. కనుక, తాము చెప్పిన ప్రతి చారిత్రికాంశానికీ, సమకాలిక సాహిత్యం నుంచి, శాసనాల నుంచి ప్రమాణాలు చూపారు. అచ్యుతప్పనాయకునిమంత్రి గోవింద దీక్షితులు. ఇతడు మహామంత్రజ్ఞుడు, మహాకవి, మహాగాయకుడు, మహాయజ్వ. అచ్యుతప్ప నాయకుడు సాక్షాత్తు శ్రీరంగేశుడనే వర్ణించాడు చేమకూర వెంకటకవి. వారిద్దరిని గురించి ప్రభాకరులిచ్చిన ఒక అనుష్టుప్పును మాత్రం పేర్కొనక తప్పదు.

> "త్రినామాద్యంతనామానౌ మహీక్షిద్దీక్షితా వుభౌ,
> శస్త్రే శాస్త్రేచ నిపుణౌ అహవేషు హవేషు చ.

అచ్యుత, అనంత, గోవింద అనే నామములకు త్రినామ, నామత్రయ సంజ్ఞలు గలవు (ఆ నామములలో మొదటిది అచ్యుతనామం. అచ్యుతప్ప నాయకుడు. చివరిది గోవిందనామం. గోవింద దీక్షితులు). రాజుకు దగిన మంత్రి. మంత్రికి తగిన రాజు.... ఈయన సాగ్నిచిత్యాప్తవాజపేయాది యజ్ఞములు చేసినాడు.... సంగీతసుధ ఈ మహాత్ముని ఆజ్ఞమీదనే రఘునాథ రాయలు రచించెను. దాని పీఠిక ఈయన రచించినదే. వేద శాస్త్రాలు చదువు కొని యజ్ఞాలు చేసిన శ్రోత్రియ పండితునికి సరస కవిత్వము. సంగీత విద్య యెట్లా అబ్బినవో! మంత్రిత్వం ఎట్లా నిర్వహించినాడో! ఆహా!"

అచ్యుతప్పనాయకుని కుమారుడు రఘునాథనాయకుడు. ఇతడు మహా వీరుడేకాక, నాట్య సంగీతాది సకలశాస్త్రజ్ఞుడు. గోవింద దీక్షితుల జ్యేష్ఠ పుత్రుడు, మహావిద్వత్కవి, సాగ్నిచిత్సర్వక్రతు యాజి యజ్ఞనారాయణ దీక్షితులు తాను రఘునాథరాయల శిష్యుణ్ణని చెప్పుకొన్నాడు. రఘునాథరాయలు మదురనాయకు లను జయించాడు; నేపాళ భూపాలస్థాపనాచార్య అనే బిరుదుకూడ ఇతనికుంది. "మరిన్ని ఇంతకు ముందే ఈ రఘునాథనాయడు పారశీకరాజుకు, నేపాలరాజు

ఓడిపోయి తన్ను శరణువేడగా అభయమిచ్చి యుద్ధంలో ఆ పారశీకుణ్ణి ఓడించి నేపాలరాజును తిరిగి రాజ్యమున నిలిపినట్టు బహుగ్రంథాలలో కలదు. ఆ సందర్భంలోనే రఘునాథరాయలు సముద్రంలోని పట్నం ఒకటి సంపాదించినాడట. పారశీకరాజు, నేపాళరాజు అంటే ఎవరో! తురకరాజులయి యుందురేమో!" అని ప్రభాకరులు ఆలోచనలో పడ్డారు. అప్పటికి తగినన్ని చారిత్రకాధారాలు లేనందున వారు అలా భావించారు. ఈ నేపాళం ఉత్తరాన హిమాలయోపత్యకాలలో వున్న నేపాళం కాదు; సింహళ ద్వీపంలో వున్న యాళ్పాణం దీనికి జాప్నా అని వ్యవహారం. యాల్పాణరాజు కథ నిజమైనది. తమిళ భాషలోని యాళ్పాణం తెలుగులో నేపాళమయింది.

ప్రభాకరులు రఘునాథనాయకుని వైభవాన్ని, ఆతనికాలంలో తెలుగు సరస్వతి సంతరించుకొన్న క్రొత్త అందచందాలను తెలిపే సమకాలిక రచయిత్రులు రంగాజమ్మ మొదలయిన వారిని గురించి పెక్కు అపూర్వ విషయాలు తెలిపారు.

నాయకరాజులు తమ దైనందిన చర్యలోను, రాజ్యపరిపాలన చర్యలోను పూర్తిగా విజయనగరసార్వభౌముల సంప్రదాయాన్ని అనుసరించారు. తిరుమల కొండమీద అనివర్ అస్థానం అనే ఉత్సవం ఏటా జరుగుతుంది. దానిని విజయనగర సార్వభౌములు ప్రవేశపెట్టారు. ఆ ఉత్సవంలో దేవస్థానం ప్రధానాధికారి శ్రీ వేంకటేశ్వరునికి సంవత్సరం ఆదాయ వ్యయం లెక్కలు వినిపిస్తాడు. విజయనగర సార్వభౌములు తమను వేంకటేశ్వర సేవకులుగా భావించడం వల్ల, తమ ఏడాది లెక్కలను పెరుమాళ్లకు వినిపించేవారు. అది కాలక్రమాన దేవాలయోత్సవంలో ఒకటయింది. నాయకరాజులు విజయనగర సార్వభౌమ సామంతులు గనుక ప్రతిదినమూ ఆదాయ వ్యయాలు ఆస్థానంలో వినే పద్ధతిని అనుసరించారు. రఘునాథనాయకుని కుమారుడు విజయరాఘవనాయకుడు రచించిన రఘునాథాభ్యుదయ నాటకంలోని జమాఖర్చు లెక్కలను ప్రభాకరులు ఈ పీఠికలో ఉదాహరించి చరిత్రకారులకు కనువిప్పు కలిగించారు.

అట్టవణ రంగయ లెక్క వినిపించుట :— చిదంబరనాథ మొదలారి మీద మూడు లక్షల మాళ్ళకు చెల్లు రెండు లక్షలున్నూ, ముప్పై అయిదువేలుగాక

పార్శ్వ నిల్వ పదిహేనువేలున్ను, శుద్ధనిల్వ యాభై వేలున్ను, అంతు నిల్వ అర వై వేలున్నూ, కుటుసం లక్ష్మయ్య మీద మణియం మనోవర్తి రెండులక్షలున్నూ, యాభై వేలకు రొఖ్ఖం బెల్లు లక్షయాభై వేలు, ధాన్యాలబెల్లు యాభై వేలు అంతు రెండు లక్షలుగాక నిల్వ యాభై వేలు. నాచమాశిమీద కనతొరలు లక్షవరహాలకు రొఖ్ఖ బెల్లు యెనభై వేలు కాక నిల్వ యిరవై వేలు కోనేటిపిళ్లమీద సుంకం పద్దెని మిది వేలకు బెల్లు పన్నెండు వేలుకాక నిల్వ ఆరువేల మాష్ల. అంతు నిల్వ లక్షా యెనభై యొక్కవేల మాష్ల."

తెలుగును అధికార భాషగా తీర్చిదిద్దదలచుకొన్న పెద్దలు విజయనగర, తంజాపుర, మధుర తెలుగు పాలకుల పరిపాలన వాణిజ్యాది పారిభాషిక పదాలను గ్రహించడం అవసరం. ఈ తొమ్మిది పంక్తుల లెక్కల వక్కాణంలోని పదాలు శుద్ధనిల్వ, రొఖ్ఖబెల్లు, కరతొరలు, అంతునిల్వ ఎంత సహజంగా జనంలో ప్రాకాయో ప్రభాకరులు చెప్పకనే చెప్పారు.

ప్రభాకరులు ఈ పీఠికలో తెలిపిన "ప్రధానులు దిన చర్యలు చదివిన" కమ్మ వక్కాణం ద్విపదలో వున్నా, నిత్యవ్యవహారానికి ఎంత సన్నిహితమో తరచిచూస్తే ఆశ్చర్యమవుతుంది. "ఇటువలె గడచిన దక్కడి కార్య, మటుగాన నెఱగుండ నవధరించేది" అని ఈ కమ్మ సమాప్తమౌతుంది. ఎంత సరళ సుందరం!

గ్రంథ పరిష్కరణ అసిధారావ్రతం, వేయి కళ్ళతో చూచి చేసినా, 'తన మతానికి అనుగుణంగా దిద్దేసినాడు పాఠాలను; ఎషయా' అని విసుర్లు విసరే వారు ఉండనే వుంటారు. కనుక ప్రభాకరులు "ఈ ప్రచురించిన అసలు కథా వృత్తాంతం చెన్నపురి లైబ్రరీలో వున్నది. హెచ్చులు తగ్గులు చేయలేదు. కాని, కొత్తచేసినాను. భాషా స్వరూపం పాడు చెయ్యలేదు. ఇందులో కథలవంటి సంద ర్భములు కొన్ని ఉన్నవి ముక్కరవృత్తాంతం మొదలయినవి. నేను తీసివేయ లేదు ...." అని తమకృషిని నిష్కపటంగా చెప్పుకొన్నారు.

తెలుగువారు ఎక్కడమెట్టినా తమజాతి కీర్తిని గుట్టలుగా పేర్చారు. దక్షి ణాంధ్రుల భాషాసాహిత్యసేవ గొప్పది; అరాజుల హృదయం బహుదొడ్డది. ప్రభా కరులు వారి చరిత్రను యథాతథంగా విషయతుందిలమూ మౌలికమూ అయిన

విపుల పీఠికతో ప్రచురించి తెలుగు జాతికి ఆనాడు చేసిన మహోపకారం దక్షిణాంధ్రులపై అనంతర కాలంలో పెక్కు పరిశోధనలకు నాందిగా విరాజిల్లింది.

ప్రబంధరత్నావళి పీఠిక :- ప్రాచీన కవుల కావ్యాలు చదువుతున్నప్పుడు, రసవంతమయిన పద్యాలను గుర్తుపెట్టుకోడం, అవి విస్మృతంకాకుండ వ్రాసుకోడం సహృదయుల అలవాటు. ఈ అలవాటు సంధాన గ్రంథాలకు మూలమయింది. సంస్కృత వాఙ్మయంలో శార్ఙ్గధరపద్ధతి, జల్హణుని సూక్తిముక్తావళి, వల్లభదేవుని సుభాషితావళి, సుభాషిత రత్నభాండాగారం మున్నగు సంధానగ్రంథాలున్నాయి. వాటివల్ల పలువురు అపూర్వకవుల రచనలు తెలియవస్తాయి. ఆ కావ్యాలు పూర్తిగా లభింపక పోయినా, ఈ సంధానగ్రంథాలలోని భాగాలవల్లనయినా, ఆ కవులు, కావ్యాలు జనం నాలుకలపై నాట్యమాడే అవకాశముంటుంది.

తెలుగులో ఈలాంటి సంధానగ్రంథాలను తొలిసారిగా ప్రచురించినవారు సుగృహీతనామధేయులు మానవల్లిరామకృష్ణకవిగారు. అవి ప్రయోగరత్నాకరము, సకలనీతి సమ్మతము, ప్రబంధమణిభూషణము అనేవి. ప్రభాకరులకు తంజావూరు సరస్వతీమహలు పుస్తకభాండాగారంలో ప్రబంధరత్నాకరము అనే సంధాన గ్రంథం-సంకలనగ్రంథం లభించింది. దీని సంధాత పెదపాటి జగన్నాథకవి 1620 నాటివాడు. కృష్ణాజిల్లాలోని పెదపాడు వాస్తవ్యుడు. సంధాత దీనిని ఐదాశ్వాసాలదిగా సంధానించాడు. కాని లభించింది మూడాశ్వాసాలవరకే. కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్తులో మరొక సంకలన గ్రంథం లభించింది. దానికి మొదలు తుది లేవు. పేరు "ఉదాహరణ పద్యములు" అని వుంది. ప్రభాకరులు ఈ రెండింటినీ కలిపి ప్రబంధరత్నావళి అనే పేర ప్రచురించి తెలుగు సాహిత్యానికి అపూర్వసేవ చేశారు. ఈ రెండింటిని గుదిగుచ్చడంలో వారు అనుసరించిన పద్ధతిని ఇలా చెప్పుకొన్నారు. "ఈ యిర్వుర కూర్పులందలి పద్యములను గ్రుచ్చి యెత్తి నే నీ ప్రబంధరత్నావళిని గ్రొత్త వెలయించితిని. పై యిరువుర సంధానములందుండినను నిప్పటికి ముద్రితములై సుప్రసిద్ధులై దొరకుచున్న నన్నయాదుల భారతాదులలోని పద్యముల నిందు జేకొనలేదు. కవులను, గావ్యములందలి పద్యములను గూడ నకారాద్యక్షర క్రమమునకు దార్చితిని. భాషాచరిత్రాద్యపేక్షుల కీ చేత మిక్కిలి సాహాయ్యక మగునని చక్కజేర్పించియే సర్చితిని."

ఈ సంకలన గ్రంథంవల్ల అప్పటికి కవి చరిత్రలో చేరని అన్నమాచార్యులు మున్నగు పలువురు ప్రాచీన కవులు వెలుగులోకి వచ్చారు. ఈ కవుల కాలాదులు నిర్ణయించడంలో ప్రభాకరుల నిర్భీక న్యాయప్రవృత్తి స్పష్టమవుతున్నది. "వికృతి వివేకమనియు, త్రిలింగ శబ్దానుశాసనమనియు సంస్కృతమున రెండాంధ్ర వ్యాకరణ గ్రంథము లితని (ఆధర్వణుని) పేర గానవచ్చుచున్నవి. ఈ రెండును నధర్వణుని పేర నిటీవల గల్పింపబడినవే యని యూహ. శ్లేషే సఖండ నిర్బింద్వో రిత్యాది లక్షణము లుండుటను బట్టి యాయూహ యుక్తమకా దోచుచున్నది. అ... యగా సంస్కృ...మునచున్న యాంధ్ర వ్యాకరణములన్నియు గొంత యసత్యకల్పనముతో గూడినవిగనే కన్పట్టును." అని వారు చెప్పినది అక్షరాల సత్యం. లిపి పరిణామ దృష్టితో ఖండబిందువు చిహ్నం చాల ఇటీవలిది; శాసనాలలో కనిపించదు.

"రా. బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారు ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణం" అని వికృతి వివేకమున బేర్కొనబడిన యకలంకుడు కర్ణాటక వ్యాకరణము రచించిన యకలంకుడనియు, నాతడు క్రీ. శ. 1604 లో నుండెను గావున నది యహోబల పండితుని కాలముననే సృష్టింపబడెననియు గ్రొత్త వెల్వరించిన కవుల చరిత్రమున విశేష విషయము చేర్చినారు. ఇది సిద్ధాంతము కానేరదు." అని ప్రభాకరులు వీరేశలింగంగారి వాదాన్ని నిర్ద్వంద్వంగా ఖండిస్తూ ప్రాకృత వ్యాకరణకర్తలలో పూజ్యపాదుడు ప్రాచీనతముడున్నాడని, అతడే అహోబలునిచే పేర్కొనబడినవాడని నిరూపించారు.

నన్నెచోడడు సోమనకు సమకాలికుడై వుంటాడు. దానికి పండితారాధ్య చరిత్రలోని, నన్నెచోడుని కుమారసంభవంలోని పెక్కు ఘట్టాలు సంవదిస్తుండడం ప్రభాకరులు తొలిసారిగా చూపారు. "'చన సత్యాశ్రయుని దొట్టి చాపకన్య నృపుల్' అన్న పాఠాన్ని రామకృష్ణకవిగారు ఎక్కడి ప్రతి నుండి సంపాదించినారో ?" అని ప్రభాకరులు వేసిన ప్రశ్న నేటికీ ప్రశ్నగానే మిగిలింది. నిజానికి నన్నెచోడుని కుమార సంభవం ఏకైక ప్రతే లభించింది; నాటికీ నేటికీ మరొక ప్రతే లభించలేదు.

కవిజనాశ్రియం వేములవాడ భీమకవి కృతం కాదన్న భావాన్ని ప్రభాకరులు ఈ పీఠికలో సుదీర్ఘచర్చలో స్పష్టపరిచారు. జయంతి రామయ్య పంతులుగారు ముప్పై నలభై కవిజనాశ్రియం వ్రాతప్రతులలో కానరాని, ఒక ప్రతిలో మాత్రమే ఉన్న అవతారికా పద్యాలతో పుస్తకాన్ని ప్రచురించి "ఈ యవతారిక యొక ప్రతిలో మాత్రముండుటచే బ్రక్షిప్తమని తోపవచ్చునుగాని, కవితా వైఖరినిబట్టి చూడ నది ప్రక్షిప్తము కాదనియే నా నమ్మకము." అని అన్న మాటలను ప్రభాకరులు "పంతులుగారి యీ నమ్మక మసమర్థమని నా నమ్మకము. అనంతుని ఛందమందలి మొదటి పద్యమే యీషద్భేదముతో నీ యవతారికకు మొదటి పద్యముగా నున్నది." అని మృదువుగా గట్టిగా ఖండించడం చాల సమంజసంగా ఉంది. భీమన కవిజనాశ్రియకర్త కానేరదని వారు కంఠోక్తిగా చెప్పారు.

కవిజనాశ్రియం రేచనకృత మనడంలో సందేహంలేదు. రేచన నన్నయకు దాదాపు వంద సంవత్సరాలకు పూర్వుడు. ఇటీవల డాక్టర్ వేటూరి వెంకటరమణయ్యగారు కనుగొన్న గంగాధర కన్నడ శాసనంలో తొలి కన్నడ కవి పంపని తమ్ముడు జినవల్లభుడు చెప్పిన విషయాలు తెలుగు కన్నడ భాషా సాహిత్య చరిత్రలపై గొప్ప వెలుగును ప్రసరించాయి. పంపసోదరుల తండ్రి భీముడు. జినవల్లభునికి వాచకాభరణుడు మున్నగు బిరుదులున్నాయి ఇవి కేవలం జైనులవే. ఇవి కవిజనాశ్రియంలోను ఉన్నాయి భీమ సుతుని సహాయంతో అతని ప్రీతికి నేనీ ఛందస్సు చెబుతున్నానని రేచన చెప్పాడు. అంత్యప్రాసలో భీమసుతుణ్ణి బిగించాడు. కనుక రేచన పంపని సాహయ్యంతోనో, జినవల్లభుని సాహాయ్యంతోనో ఈ ఛందస్సు రచించాడనడం స్పష్టం. జినవల్లభుడు ఆ కన్నడ శాసనంలో తెలుగు యతినియమంలేని నాల్గైదు తెలుగు కందాలు కూడ రచించాడు. కనుక నన్నయకు వందేళ్ళముందే తెలుగునాట తెలుగు కవిత వెలసిందనడం స్పష్టం. ప్రభాకరులు అరు దశాబ్దాలకు పూర్వమే కవిజనాశ్రియం భీమన రచన కాదనడం వారి నిశిత పరిశీలనకు తార్కాణం. కవిజనాశ్రియ కర్తృత్వం గురించి సుప్రసిద్ధ ఐతిహాసకులు డాక్టర్ పుల్లా పరబ్రహ్మశాస్త్రి గారు శాసనాద్యాధారాలు సేకరిస్తున్నారు. దానితో నన్నయకు పూర్వం తెలుగు కవులు ఎవరూ లేరన్న సిద్ధాంతం పరాస్తమవుతుంది. కొందరికిది కష్టమైనా, సత్య జిజ్ఞాసువులకు సంతోషకర మవుతుంది.

"శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వల్లభరాయుడు రచించినట్టున్న క్రీడాభిరామమను వీథినాటకమే శ్రీనాథుని వీథినాటకము కావచ్చుననిరి. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారది యతిసాహసమనిరి. నా నిశ్చయము తప్పక యది శ్రీనాథకృతి యగునని; కారణసామగ్రి పుష్కలముగా నున్నది." అని ప్రకాశకులు అన్నారు. శ్రీనాథుడు దానిని సంస్కరించి వుండవచ్చు; లేక వల్లభరాయడే శ్రీనాథునిఅనుకరించి వ్రాశాడేమో!

సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (ఎం. ఏ.) గారు క్రీడాభిరామం వ్యంగ్యకావ్యమన్నారు. వల్లభరాయడు విజయనగర రాజుల మిత్రుడు. రెడ్డిరాజులకు అతనికి పడదు. ప్రతి ఆస్థానానికి తిరుగుతూ, అందరినీ పొగడుతూ, రెడ్డిరాజులకు అవచి తిప్పయ్యసెట్టిద్వారా ధనసహాయం చేయిస్తూన్న శ్రీనాథుని, అవచి తిప్పయ్యసెట్టిని పాత్రలుగాచేసి వారిని వట్టి కాముకులు అని ఈసడించడానికి క్రీడాభిరామాన్ని శ్రీనాథుని శైలిలోనే వల్లభరాయుడు రచించి వుంటాడని శ్రీ వేదం వారి వాదం. ఇది కొత్తగా వున్నా పరిశీలించవలసిందే. ఇదే నిజమైతే క్రీడాభిరామం తొలి వీథి కావడంతోపాటు తొలి ఉత్ప్రాసకావ్యమూ అవుతుంది.

చారుచర్యపీఠిక :- అప్పనమంత్రి చారుచర్యను ప్రకాశకులు ప్రచురించినతీరు చాలా కుతూహలకరం. తంజావూరు, ముక్త్యాల, ఆంధ్రసాహిత్య పరిషత్తులలో లభించిన వ్రాతప్రతులను పరిశీలించి ఎంతో శ్రమపడ్డారు. అప్పన మంత్రి నన్నయకు అనంతరం పావులూరి మల్లన కాలంవాడు కావచ్చునని సాహిత్య చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. నన్నయ తర్వాత శాస్త్ర గ్రంథానువాదం కొంతకాలం కొనసాగింది. వైద్య నీతి ధర్మశాస్త్రాలకు అవరోధంగా మానవుడు జీవించే విధానాన్ని తెలిపే ఈ చారుచర్యను ప్రచురించి ప్రకాశకులు ఆంధ్రావళికి మహోపకారం చేశారు. దీనిమూలం భోజమహారాజు సంస్కృత చారుచర్య.

శ్రీకాకుళ శ్రీహరి శతకపీఠిక :- కృష్ణరాయలను ఆముక్తమాల్యదా రచనకు ప్రబోధించినవాడు శ్రీకాకుళవిభుడు. అతనికి ఆంధ్రవల్లభుడని, తెలుగురాయడని పేర్లున్నాయి. కృష్ణరాయలు కళింగ విజయానికి దండెత్తిపోయినప్పుడు విజయవాడలో కొంతకాలం విడిసి శ్రీకాకుళ క్షేత్రానికి వెళ్ళి, ఏకాదశి

నాకు అంధ్రనాయక స్వామిని సేవించుకొని, కైంకర్యం జరిపి శాసనం వేయించారు. విశిష్టాద్వైతులలో వడగల సంప్రదాయానికి ప్రవర్తకులైన వేదాంత దేశికుల కుమారులు వరదాచార్యులవారు సర్వజ్ఞ సింగభూపతి ఆస్థానంలో సన్మానితులైనప్పుడు శ్రీకాకుళం దర్శించి ఆంధ్రనాయకుని స్తోత్రించేశారు. రాయల కాలంవరకు ఈ క్షేత్రం మహావైభవంతో విరాజిల్లింది. ఆళ్వారాచార్యులు పాడిన, స్తోత్రం చేసిన క్షేత్రాలు శ్రీవైష్ణవులకు పరమ పవిత్రాలు.

ప్రభాకరులు ఈ పీఠికలో అధర్వణాచార్య కృతంగా త్రిలింగ శబ్దాను శాసనమనే పేరుతో ఉపలబ్ధమవుతున్న వ్యాకరణ గ్రంథంలో ఈ క్షేత్రం గురించి వున్న శ్లోకాల సాధుత్వాసాధుత్వాలను, సంస్కృతంలో వున్న శ్రీకాకుళ క్షేత్రమాహాత్మ్యాలను, పద్యకావ్యాలను చర్చించారు. ఇదెప్పుడూ ఆంధ్రరాజుల రాజధానిగా లేదని నిర్ధారణగా చెప్పారు. ఆంధ్ర నాయక పదానికి సంస్కృత క్షేత్రమాహాత్మ్యంలో ఇచ్చిన పెక్కు నిర్వచనాలను చర్చించి ప్రాచీన కాలంలో అంధ్రపదమే కాని, ఆంధ్ర పదంలేదని, కనుక ఈ వ్యుత్పత్తులు "నవీనములని" వారు అన్నారు.

ఈ ఆంధ్ర నాయకుడు స్థానిక దేవత అయి వుంటాడని నా అభిప్రాయం. పెక్కు స్థానికదైవాలు మత సామరస్యోద్యమంలో, వివిధ సంస్కృతి సమ్మేళనోద్యమంలో శివ కేశవరూపాలు దాల్చినట్టే ఈ తెలగన్న - తెలగయ్య - తెలుగు రాయడు విష్ణువయ్యాడేమో! పెక్కు జైన దైవాలు విష్ణువుగాను, బౌద్ధ దైవాలు శైవ మూర్తులుగాను మారాయి. ఉదాహరణకు : బెజవాడ కనకదుర్గను చెప్పవచ్చు. ఈమె బౌద్ధుల తార. కృష్ణాతీరంలోని పోతలకలో (పోతర్లంకేమో ?) అవలోకితేశ్వర తారల పూజ జరుగుతున్నదని చైనా గ్రంథాలలో వుందట. అవలోకితేశ్వరపూజ తొలిసారిగా ఆంధ్రదేశంలో ఆరంభమై ఇతరత్ర వ్యాపించింది. ఈ తార బౌద్ధమతం క్షీణించిన తర్వాత శాక్తుల దేవత అయి స్థానికుల దేవతగా మారి వుంటుంది. తారాదేవికి అవలోకితేశ్వరునికి బంగారుపూత పూయడం ఆచారంగా వుండేది. దానినిబట్టి బంగారమ్మ అనో, పైడమ్మ అనో, స్థానిక సామాన్యులు వ్యవహరించి వుంటారు. వామాచార పూజలందుకుంటున్న ఈ దేవతను శంకరాచార్యులో తదనుయాయులో వామాచారపూజ నుంచి తప్పించినట్లు చెబుతారు. అప్పటికి ఆమె దుర్గ అయింది. బంగారమ్మకు సంస్కృతీకరణం

కనకదుర్గ. ఇలా స్థానిక దేవతలు మారుతున్నందున తెలుగన్న సంస్కృత వేషంలో అంధ్రనాయకుడయి వుంటాడు.

భగవదజ్జుక పీఠిక :- భగవదజ్జుక మనేది సంస్కృత ప్రహసనం. ఇది క్రీస్తుశకం ఆరవ శతాబ్దినాటిది. దీని కర్త బోధాయనుడు. అప్పటికి ప్రబలంగా వున్న బౌద్ధ మతాన్ని వెక్కిరించి వేద మతాన్ని ప్రచారం చేయగం ఈ ప్రహసనోద్దేశం. ప్రసక్తానుప్రసక్తంగా సాంఖ్యయోగ వైద్యశాస్త్రాదులు ప్రస్తావించబడినవి.

బోధాయనులు ముగ్గురున్నారు- కల్పసూత్రకారుడు, రామానుజులు తమ బ్రహ్మసూత్రభాష్యానికి- శ్రీభాష్యానికి- మూలకల్పమని పేర్కొన్న బ్రహ్మ సూత్రవృత్తిని రచించిన వాడు, భగవదజ్జుకకారుడు. ప్రభాకరులు ఈ విషయం సుదీర్ఘంగా చర్చించి భగవదజ్జుకకర్త ఈ ప్రహసనంలో రుద్రుని పేర నాంది వుండడం, యోగ దర్శనానికి ప్రాముఖ్యముండడం, విశిష్టాద్వైత సిద్ధాంత వాసన లేకపోవడం మున్నగు కారణాలవల్ల రామానుజులు ఆదరించిన బోధాయనుడు కాకపోవచ్చునని, ప్రహసనంలో శాంతికపౌష్టిక శ్రౌతకర్మల ప్రాధాన్యం లేనందున కల్పసూత్రకారుడు కాకపోవచ్చునని, బోధాయనుని పలువురు కవిగా పేర్కొనడంవల్ల ఇతడు మరొకడయి వుంటాడని అన్నారు.

కాని, రామానుజులు గురువుగారితో అభిప్రాయభేదం ఏర్పడి, విష్ణు సర్వోత్తమత్వ ప్రత్యయంతో విశిష్టాద్వైత ప్రవర్తకులయ్యారు. బోధాయనుడు ప్రహసనం రచించిన కాలానికున్న భావాలను, మతాన్ని తర్వాత ఎందుకు మార్చుకొని వుండరాదు ?

ప్రభాకరులు దీనిని చక్కని తెలుగులో అనువదించారు. వారే అన్నట్లు మూల గ్రంథం మిక్కిలి హృద్యం. అనువాదం మహోదాత్తంగా వుందని చదివినవాడిని గనుక చెప్పగలను.

ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక :- ఉద్భటారాధ్య చరిత్రను తెనాలి రామలింగకవి రచించాడు. రామలింగడు వైష్ణవమతం స్వీకరించిన పిదప రామకృష్ణుడయ్యాడు. ఈ విషయాన్ని ప్రారంభంలో కొందరు నమ్మలేదు. ప్రభాకరులు కూడ ప్రబంధ రత్నావళి పీఠికలో "రామకృష్ణుడు వేఱు, రామలింగడు వేఱుగా

మా. రా. కవి.గారు వ్రాసినారు. సత్యము కావచ్చును," అని సందేహించారు. ఇది 1918 జనవరి 9వ తేదీ నాటి అభిప్రాయం. ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక రచనాకాలం 1925. అప్పటికి వారికి ఇద్దరూ ఒకరేననే ఉపపత్తులు చాల దొరి కాయి కనుక ఒకరేనని సిద్ధాంతీకరించారు.

రామకృష్ణుడు రామలింగడుగా ఉన్నప్పుడు ఉద్భటారాధ్య చరిత్ర రచించాడు. వైష్ణవమతం స్వీకరించిన పిదప పాండురంగ మాహాత్మ్యం, ఘటికా చల మాహాత్మ్యం రచించాడు. ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగమాహాత్మ్యం అవతారికలను ప్రభాకరులు త్రైపాదుచేసి, ఇరువురు కౌండిన్య గోత్రులు, శుక్ల యజుర్వేదులు, ఇరువురి తండ్రిపేరు రామయ్యే. తల్లిపేరు లక్ష్మమ్మ. రామ లింగడు కుమారభారతీ బిరుదాభిరాముడు. రామకృష్ణుడు శారదా స్వరూపుడన్న కీర్తితుడు. కాని, రామలింగని గురువు పాలగుమ్మియేలేశ్వరుడు; రామకృష్ణుని గురువు భట్టరు చిక్కాచార్యులు. అశ్వాసాంత గద్యాల తీరు భిన్నం. ఇవి రెండూ మతం మార్పువల్ల కలిగినవేనని, ఇద్దరు వ్యక్తులూ ఒక్కరేనని ప్రభాకరులు ఉపపత్తి చెబుతూ, ఇందుమతీ పరిణయ కర్తయగు తెనాలి రామభద్రకవి గ్రంథావతారికలో చెప్పినదాన్ని ప్రమాణాంతరంగా పేర్కొన్నారు. తన తాతలు ముగ్గురని, పెద్ద తాత రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యాదులు రచించాడని, తన తాత శ్రీగిరి శ్రీశైల మాహాత్మ్యకృతి రచించాడని, తన పిన తాత అన్నప్ప సుదక్షిణా పరిణయం రచించాడని చెప్పుకొన్నాడు. ఈ హేతు బలంతో ప్రభాకరులు ఇద్దరూ ఒక్కరేనని అత్యద్భుతంగా నిరూపించారు.

ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలం 1526 కావచ్చును గనుక "తెనాలి రామలింగకవి కృష్ణదేవరాయల సభలో నున్నాడని లోకప్రతీతి సదాధారమయి సంరక్షిత మగుచున్నది." అని అన్నారు ప్రభాకరులు. రామలింగకవి రాయల ఆస్థానంలో ఉన్నట్టు స్పష్టమైన ఆధారాలు ఇకముందు దొరకవచ్చును.

మనుచరిత్ర పీఠిక :— ఈ పీఠిక ఆరు దశాబ్దాల క్రిందట రచించినది. అప్పటి సాధన సామగ్రితో, ఆధునిక పద్ధతిలో జరిగిన కావ్యసమీక్ష; మనకు ఎంతో ఆశ్చర్యానందాలు కలిగిస్తుంది. రచనాచాతుర్యము, శైలి, ఔచితీ నిర్వా హము; కల్పనాచాతుర్యము, భావ్యపరిశీలనము, స్వభావపరిజ్ఞానము, పూర్వ

కవుల అనుసరణలో మెలకువలు, కథా సంవిధానము మున్నగు వింగడింపులతో ప్రభాకరుల విమర్శ సాగినది. పెద్దన చేసిన కొన్ని సంస్కృత వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలను చెబుతూ ప్రభాకరులు పాణిని పదచర్చను మహోదాత్తంగా నిర్వహించారు. "పణినసూను తపాంధబాదరాయణ సూత్ర ఫక్కి విద్వాంసు లుపన్యసింప" అని పెద్దన "పణినాపత్యోక్త శాస్త్రంబులోన్" అనే శ్రీనాథుని ప్రయోగాన్ని అనుసరించాడు. పాణిని పాణిన ముని కుమారుడు కాని పణిన ముని కుమారుడు కాడు. "పణనం పణిః-పణోస్యాస్తీతి పణీ. నకారాంతమగు నీ పణిన్ శబ్దముపై గోత్రాపత్యార్థమున అణ్ ప్రత్యయము రాగా, పాణిన అను రూపమేర్పడినది. పదపడి యువాపత్యార్థమున ఇఞ్ ప్రత్యయము రాగా పాణిని యను రూప మేర్పడినది. ఎట్లయినను బాణిని పాణినసూను డగునుగాని, పణిన సూనుడు గాడు. ఇది సమర్థింపవెరవు గానరాదు." అని తెగవేసి చెప్పారు. ఈ పీఠిక ఆధునిక పద్ధతి విమర్శకొక మచ్చుగా నేను సంభావిస్తాను.

ప్రతిమా నాటకపీఠిక :- తిరువాన్కూరులో భాస నాటక చక్రం లభించింది ఈ శతాబ్దం ఆరంభదశకంలో. లభించడమే తడవుగా శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వాటిని నకలు చేసుకొని వచ్చారు. కొన్నిటిని అనువదించారు. ప్రభాకరులు ప్రతిమా నాటకం మున్నగువాటిని అనువదించారు. తర్వాత మహా మహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు తిరువనంతపురం సంస్కృత గ్రంథమాలలో ముద్రించారు. ప్రతిమా నాటకం 1910 లోనే ప్రభాకరులు అనువదించారు. 1913 లో కర్ణభారం, మధ్యమవ్యాయోగం అనువదించారు. వాటికి ప్రభాకరులు వ్రాసిన తొలిపలుకులను పరిశిష్టంలో చూడవచ్చును. భాసనాటకానువాదాల శ్రేయస్సు తొలిసారిగా మానవల్లి వారికీ, ప్రభాకరులకూ చెందుతుంది.

బసవపురాణ పీఠిక :- ప్రభాకరుల పీఠికలలో బృహత్తరమయినదీ. ఆంధ్ర సాహిత్య లోకంలో బృహత్కల్లోలం కలిగించినదీ బసవపురాణ పీఠిక, దీనిని గురించి వ్రాయవలసివస్తే పీఠికంత గ్రంథమవుతుంది. ప్రభాకరులు సోమనకాలదేశవర్తమానాలను గురించి, భాషాచ్ఛందోవ్యాకరణాలను గురించి చెప్పిన సిద్ధాంతాలేవీ మార్చవలసినంత కారణకలాపం ఇంతవరకు లభించలేదనే నా విశ్వాసం. సోమనాథుడు నన్నయ తిక్కనల మధ్యకాలం 1182-1199 వాడనే నిర్ణయం మార్చవలసిన అవసరం కానరాదు. ఈ పీఠిక ప్రభాకరుల

చరిత్రజ్ఞానానికి, న్యాయస్పష్టికి, విమర్శపాటవానికి, వైదుష్య వైదగ్ధ్యానికి పెద్ద అద్దం.

ఈ గ్రంథ పరిశిష్టంలో ప్రభాకరులు తెలుగులో వ్రాసిన మరి మూడు గ్రంథాల తొలిపలుకులూ, రెండు గ్రంథాలకు సంస్కృతంలో వ్రాసిన ఉపోద్ఘాతాలూ చేరినవి. చిన్నవనీ నాగరాక్షరాలలో వున్నవనీ ఉజ్జగించక వాటినీ కాలక్రమాన పరిశిష్టంలో చేర్చడం సముచితమే.

చాటుపద్య మణిమంజరి :— దీని తొలిసంపుటానికి ప్రభాకరులు వ్రాసిన తొలిపలుకు చిన్నదైనా చాటు పద్యాల సేకరణలోనూ, కూర్పులోనూ వారి ఆసక్తిని పరిశ్రమను వివరించేదిగా వున్నది. ఏడు దశాబ్దాల క్రిందట తెలుగు పాఠకలోకాన్ని ఉత్తేజపరచి తెలుగుతీపిని చవిచూపిన గ్రంథాలలో ప్రభాకరులు సందానించిన చాటుపద్యమంజరి ప్రముఖమైనది. దీని ప్రచురణ 1918 లో, ఇదే వీరి తొలి ప్రచురణ.

ప్రభాకరుల సంస్కృత రచనలు విరళాలైనా, ప్రభాభాసితాలు. సుందరపాండ్యుని నీతిద్విషష్టికకు వారు వెలయించిన పీఠిక వారి సంస్కృత శైలికి మచ్చు. సుందరపాండ్యుడు ఆరవ శతాబ్దానికి ముందున్నవాడని శ్రీ ప్రభాకరులు ఈ కావ్యానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో నిర్ణయించారు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కూడా ఈ గ్రంథానికి వ్రాసిన ఆంగ్ల పీఠికలో ఆ వాదాన్నే సమర్థించారు.

సుందరపాండ్యుని ఆర్యలను పంచతంత్రకారాదులే కాక పలువురు తెలుగు కవులూ గ్రహించారు. సుమతిశతకకారుడు, మంచన, శ్రీనాథుడు మొదలయినవారూ ఈ ఆర్యలను ఉపయోగించుకొన్నవిధం ప్రభాకరులు పీఠికలో తెలిపారు. శ్రీనాథుడు భీమఖండంలో

> వికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ
> నదరి కాకులు బిట్టు పెద్దరచునపుడు
> ఉడిగి రాయంచ యూరకయుంట లెస్స
> సైపరాకున్న నెండేని జనుట లెస్స.

అనే పద్యానికి మూలం నీతిద్విషష్టికలోని

> కటు రటతి వికటవ క్రీ
> వాచాటష్టిట్టిభో యత స్తస్మాత్,
> అవసరణమేవ యుక్తం
> మౌనం వా రాజహంసస్య.

అనే ఆర్య. సుమతి శతకకారుడు

> మిత్రమపి యాతి రిపుతాం
> స్వస్థానాత్ప్రచ్యుతస్య పురుషస్య,
> కమలం జలాదపేతం
> శోషయతి రవి ర్న తోషయతి.

అనే ఆర్యను పూర్తిగా అనువదించుకొన్నాడు ఇలా :

> కమలములు నీట బాసిన
> కమలాప్తుని రశ్మిసోకి కమలినభంగిన్
> తమ తమ నెలవులు దప్పిన
> తమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ.

ప్రభాకరుల సంస్కృత శైలికి ఈ పీఠికలోని కొన్ని పంక్తులు ఉదాహరిస్తాను :

"అపిచాయం నీతిద్విషష్టికాకారః సుందరపాండ్యోఽన్యతమః. సుభాషిత గ్రంథసంధాతృభి ర్బహుభి రముష్యగ్రంథః పరామృష్టః, సుభాషితావల్యాం వల్లభదేవోఽస్యాః కృతే ర్బహ్వీరార్యాః పరిజగ్రాహ. శ్రుతానుశ్రవికయైవ స తాన్సమాకలయత్; పరమిమాం కృతి మానుపూర్వ్యా స నైవాపశ్యత్ ...."

ప్రభాకరులు దీనిని సంస్కృత లోకానికి అందించి మహోపకారంచేశారు. దీనికి సుగృహీతనామధేయులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఆర్య అనే పేర అతిమనోహరంగా పద్యానువాదం చేశారు. డాక్టర్ పుల్లెల శ్రీ రామచంద్రుడు గారు దీనికి తెలుగులో అర్థతాత్పర్యాలు రచించారు.

మానవల్లివారు 1909 లో ప్రచురించిన క్రీడాభిరామాన్ని ప్రభాకరులు విపుల పీఠికతో 1928 లో ప్రచురించారు. అప్పటికి ఓరుగల్లు వివరాలు తెలియవు. ప్రభాకరులు క్రీడాభిరామం ఆధారంగా ఓరుగల్లు నగరాన్ని గొప్పగా నిర్మించారు. "మీ గురువుగారి క్రీడాభిరామం పీఠికలోని ఇమాజినేషన్‌తో ప్రోత్సాహం కలిగి "సిటీ అఫ్ విజయనగర' వ్రాశాను నేను." అన్నారు నాతో సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారు. దీని కర్తృత్వ విషయంలో నాకు ఇది ఉత్ప్రాసకావ్యమనే నమ్మకం వుంది గనుక శ్రీనాథుని అనుకరిస్తూ వల్లభరాయడే రచించాడని నమ్ముతున్నాను.

సుగ్రీవ విజయం యక్షగానం పీఠికలో కురవంజి యక్షగానాలను వివరించారు. యక్షగానాలు సోమనాథునికి ఇన్నూరేండ్ల ముందువని నిరూపిం నారు.

హరవిలాస పీఠికలో కృత్యాదిలోని తరుణాసిరి, తవాయి మున్నగు పదాల అర్థాలు తెలిపి చరిత్రకాములకు కనువిప్పు కలిగించారు. రమణ—బర్మా దేశ భాగం, యాంప శ్రీలంకలోని జాఫ్నా. తరుణాశిరి- మలేషియాలోని తన్నాసిరం. మల్లంపల్లి సోమశేఖరశర్మగారూ ఇదే అభిప్రాయ పడ్డారు. జోణంగి, మలబార్ తీరద్వీపం. హురుముంజి— పారశీక సముద్రతీరంలోని హుర్మజ్, పంజార- సుమాత్రాద్వీపంలోని పజ్జార్, తవాయి- మలేషియాలోని రేవు.

హరవిలాస పాఠాలను నేను తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయం నుంచి తెచ్చాను. దాని సంస్కరణలోను సహకరించాను. ఒకచోట 'అవంచియే కంచి నీకు అడుగామడయే' అని వుంది. ఇది కపట జంగముడు చెప్పినమాట. అవంచి అనేది ఏమిటో చాలసేపు తోచలేదు. కాంచికి కాంచి అనే రూపాలున్నట్లు అవంతికి అవంచి అనే రూపమూ వుందని స్ఫురించి, "సప్తనగరాల పేర్లు చెప్పవోయ్!" అన్నారు. "అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీహ్యవంతికా, పురీద్వారవతీ చైవ" అని చెప్పాను. "అవంచి అంటే అవంతి. ఏమిటి కంచి పక్కలోనే వుందికదా! దూరంగా వున్న అవంతా ఏమన్నానా? అని మాయా జంగముని భావం." అని అర్థం చెప్పారు. పాఠం కుదిరింది.

పావులూరి మల్లన సారసంగ్రహ గణితం ప్రకటన గొప్ప కృషి. దీనిలోని ప్రతి లెక్కను మిత్రుడు తిమ్మావజ్ఝల కోదండరామయ్య వేసిచూసి సరిచేసి సహకరించాడు. దీని కర్తృత్వ విషయంలో వాదోపవాదాలు జరిగాయి. నన్నయ సమకాలికుడైన మల్లన దీని కర్త అని వీరేశలింగంగారు వాదించి ప్రకాశకులు పాఠాలు తారుమారుచేశారని అపవాదు లేవదీశారు. ఆ మల్లన మనమడైన మల్లన ఈ గ్రంథకర్త అని ప్రకాశకులు వాదించి పెక్కు తాళపత్ర ప్రతుల పాఠాలు చూపారు. చివరకు పండితులు ఒప్పుకొన్నారు.

తిరుపతి చేరిన పిదప వారు తాళ్ళపాకవారి వాఙ్మయం పరిశోధించి సంకీర్తన భాండాగారంనుంచి అన్నమాచార్యులు కీర్తనలు చెక్కించిన రాగి రేకులు తీయించి, అన్నమాచార్యుల సతీమణి తాళ్ళపాక తిమ్మక్క రచించిన మంజరీ ద్విపద సుభద్రా కల్యాణం ప్రచురించి గొప్పసేవ చేశారు. తిరువేంగళ నాథుని అన్నమాచార్య చరిత్రకు విపుల పీఠిక వ్రాశారు. అది అచ్చు కాకముందు నాకు చూపి "ఎలావుంది?" అనడిగారు. "క్రీడాభిరామ, బసవ పురాణాది పీఠికలలాగా లేదు సార్." అన్నాను. "విషయ వైవిధ్యంబట్టి పీఠికలు కదా;" అన్నారు.

## శాసన పరిశోధన :

కలం పట్టినప్పుడెల్లా కలకాలం నిలిచే కొత్త విషయం చెప్పడమనే ప్రకాశకుల ప్రజ్ఞ, ప్రతిజ్ఞ భాషా సాహిత్యరంగాలలోనే కాదు, చరిత్ర పురాలిపి, పురాతత్వ రంగాలలోను నెరవేరి సత్యదృష్టిగల తర్వాతి పరిశోధ కులకు వెలుగుబాటలు తీర్చాయి; చీకటిబాటువారికి కన్నులు జిగేలు మనిపిం చాయి.

నూనూగు మీసాల నూత్నయౌవనంనుంచే వారికి పరిశోధన దృష్టి, చరిత్ర సృష్టి అలవడినవి; వాటికి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయం ఉద్యోగమూ దాని పరిసరాలలోని మ్యూజియమూ పుష్టిని కలిగించాయి. అందు వల్లనే ఆరు దశాబ్దాలనాటినుంచే వెలుగులు ప్రసరింపజేసి, లిపి చరిత్రాది రంగాలలో కొత్తమలుపులు తిప్పారు. వాటిలో కొన్నిటిని మాత్రం స్థాలీపులా కన్యాయంగా పేర్కొంటాను.

వారు 1928 లో భారతి పత్రికలో ప్రచురించిన 'ప్రాచీనాంధ్ర శాసనములు' అనే వ్యాసం అనేకాపూర్వ విషయాలు తెలిపింది. 1920 లో పురాతత్త్వజ్ఞులు శ్రీ రమాప్రసాద్‌చందా ప్రచురించిన శాసనాలలో 'నాగబు' అనే మూడక్షరాల శాసనం వారికి ముచ్చటగొల్పింది. శ్రీ చందా ఇది పాలీభాషా పదమయివుంటుందని భావించి నాగ-బు అని విడదీసి శిల్పి పేరు కావచ్చునని భావించారు. కాని ప్రభాకరులు ఇది క్రీస్తుశకం రెండవ శతాబ్దానికి ఈవలిది కాదని, బ్రాహ్మీలిపినిదట్టి నిర్ణయించి, ఒకేపదమని క్రీస్తుశకం ప్రారంభకాలానికే సంస్కృతపదాలు తెలుగు విభక్తి ప్రత్యయాలతో వ్యవహృతమయ్యే దశ వచ్చి, తద్భవాలు ఏర్పడ్డాయని అన్నారు. బు ప్రథమా విభక్తి ప్రత్యయం, నాగంబు అనేది ప్రాచీనరూపం. ఎద్ద అనేది పూర్వపరహల్లోపాలతో ఎద, ఎద అయినట్లు నాగంబు నాగము, నాగబు అయింది, నాగమ్ము అనేది తర్వాతి పరిణామం. ఈ ప్రక్రియను వారు ద్విత్వశైథిల్యమని అన్నారు.

వారు ప్రచురించిన రెండవశాసనం క్రీస్తుశకం 675 నాటి లక్ష్మీపుర శాసనం. ఇది కృష్ణాజిల్లాలో దొరికిన తొలి తెలుగు శాసనం. చాళుక్య యువరాజు మంగిరాజు దానశాసనం. దీనివల్ల పెక్కు భాషా విశేషాలు తెలిశాయి.

అహదనకర తామ్రశాసనాన్ని ఫ్లీట్ ఇండియన్ యాంటిక్వెరీలో ప్రచురించారు. దానిని లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చదివారు. ఇది 847 నాటిది. కరిగల్ల ఒడయరు- దేవరకు ఆ గ్రామాధికారులు ఇచ్చిన దానశాసనం. దీనిని ప్రభాకరులు 1928 జూలైలో భారతిలో ప్రచురించి కొన్ని విచిత్రమైన పదాలకు అర్థ నిర్ణయం చేశారు. ఇది పండితలోకంలో పెద్ద దుమారం లేపింది. తమిళలో నేడూ వున్న [ఴ] అనే వర్ణం ఒకప్పుడు తెలుగులోను వుండేదని ఇది ర,డ ద,ల లుగా తర్వాత మారిందని ప్రభాకరులన్నారు. ఈ విచిత్రాక్షరానికి బండి రకు వ్యత్యాసం తెలియక కొందరు పొరపాట్లు చేశారని అన్నారు. అరి, తగ్గు, తెజె, సిద్ధాయము, వండు, దశాపరాధము- అనే పన్నులను గుర్తించారు. దాయ-దానం- పెద్దు-రాజోద్యోగులు, పనికొప- పనివారు మున్నగు పెక్కు పదాల అర్థాలు నిరూపించారు.

వారు ప్రకటించిన కపిలేశ్వరపురశాసనం 740 నాటిది. ఇది కృష్ణాజిల్లాలో దొరికిన రెండవ తెలుగు శాసనం. ఇది భాషా పరిశోధనకు చాల

తోద్భవించింది. ఇది తొమ్మిది పంక్తులది. ప్రాచీన భాష ఎలా వుంటుందో చూప డానికి ఉదాహరిస్తున్నాను.

స్వస్తి శ్రీ బెజెఇత్త
భటరళ నిల్పిన దత్తి
కడందల ఇశరయ నిల్పిన
గుడియు వరికొడుకు బాదయ
కొడు మత్తెశకు తబుండు శక
వైపస్రవను కొడుకు బో్పలయ
భటరళ పన్నెసళకు
వ[గము వచ్చువరు బ[రవాసి]
వేవురు ప[అ]

విజయాదిత్య భట్టారకులు నిలిపిన దానం. కడంవల ఇశరయ అనేవాడు గుడి కట్టించాడు. ఆ గుడికి అతని వంశంవారయిన బావయ, మత్తిశ, అతని తమ్ముడు శకవై[సవను, అతని కొడుకు పోల్రియ భట్టారకుడు ఇచ్చిన పన్నస భూమికి చెరుపుచేసేవారు వారణాసిలో వేయిమంది బ్రాహ్మణులను చంపిన పాపాన పోతారు. దీనిలో విజయిత్త–విజయాదిత్యుడు [ప్రాకృతరూపం. ఇది నన్నయకాలానికి బెజయితగా మారింది, భటరళ–భట్టారుల. దత్తి–దానం. కడందల ఇశరయ–కడందల ఇంటిపేరుగల ఈశ్వరయ్య. బాదయ వాతాపినుంచి వచ్చిన తద్భవం. బో్పలయ–[పోలయ పన్నెస–పన్నస. పన్నసం సర్వమాన్య భూమి. వ[గంబు వచ్చువారు–చెరిపేవారు.

శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామిగారు చితాభస్మమున్న ఒక పిడతను పరిశోధకులకు ఇచ్చారు. దానిమీద బ్రాహ్మీలిపిలో 'అయో మణిలిష్టకాః' అని వుంది ప్రాకృతంలో. పరిశోధకులు దానిని పరిశీలించి 'అర్యమునేః ప్లుష్టకాః' అర్యముని చితాభస్మం అని విశదీకరించారు. ఈ అర్యముని ఆనాటి స్థానిక బౌద్ధాచార్యులలో ఒకరు.

పరిశోధకుల పరిశోధన దృష్టి కిరణాలు గుడిగంటల బ్రాతలమీదను పడ్డాయి. రాజులకాలంలో [ద్రాక్షారామ భీమేశ్వరాలయం ధర్మసత్రంలో ఒక

గంట వుండేది. భోజనాహ్వానికి దానిని వాయించేవారట. ఆ విషయం ప్రాచ్య లిఖిత పుస్తకాలయంలో ఒక తాళపత్రప్రతిలో వుంది. దాక్షారామ భీమేశ్వర స్వామివారి గంటమీద తారీఖు. శాలివాహన శకాబ్దంబులు 1356 ఆనందనామ సంవత్సర వైశాఖ బహుళ 13 బుధవారం, చేయించినవారు పెదారెడ్డి, వేమా రెడ్డి, దొడ్డారెడ్డి. ఈ ముగ్గురు అన్న సత్రవు గంటపమర్పించారు. శాలివాహన శకానికి సరైన తేదీ 1431. ఈ తాళపత్ర ప్రతి 1840 లో లిఖిత పుస్తకాలయానికి చేరింది. ఈగంట ఆరా టీయాలన్నారు ప్రభాకరులు.

వారు వెలుగులోనికి తెచ్చిన ఇలాటి శాసనాంశాలు అసంఖ్యాకాలు. వాటివల్ల లిపి భాషాచరిత్ర పరిణామ క్రమానికి కొత్తమలుపులు ఏర్పడ్డాయి.

చరిత్రకు ప్రభాకరుల సేవ అనిదంపూర్వం. రెడ్డిరాజుల చరిత్రకు, వారి శృంగార శ్రీనాథం, క్రీడాభిరామపీఠిక, రెడ్డిరాణివ్యాసాలు కలికితురాయి వంటివి.

సాతవాహనులు ఆంధ్రులేనని తొలిసారిగా వక్కాణించినవారు వారే. శ్రీ భావరాజు వేంకట కృష్ణరావుగారి ద్వారా ఆంగ్లీకృతమై ఈ వ్యాసం యావద్దేశ చరిత్రకారుల మన్ననా పొందింది.

కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళం ప్రాచీనాంధ్ర రాజధాని అని శ్రీ కాంప్‌బెల్ వ్రాతలబట్టి పలువురు వ్రాసిన వ్రాతలు సరిగావని వారు 1920 లోనే ఖండించారు. స్కాంధపురాణాంతర్గత మనబడే శ్రీకాకుల క్షేత్రం మాహాత్మ్యానికి శ్రీనాథుడు క్రీడాభిరామంలో వర్ణించినదానికి భేదం వుండడంవల్ల రాజధాని కాదని వారన్నారు.

కృష్ణదేవరాయలకు కమల అనే మూడవ భార్య వున్నదని 1914 లో వ్రాశారు. ఆముక్తమాల్యదలోని

అవిభు ననంతరంబ ధ
రా వలయము పూనితీవు రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియు గమలాబ్జముఖియు దేవేరులుగాన్.

అనే పద్యాన్ని వ్యాఖ్యాతలు సరిగా గ్రహించలేదని పెక్కు తాళపత్రగ్రంథాలలో కమలాబ్జముఖి అనే వుందని తెలిపారు.

రాజరాజుకు, సారంగధరునికి ఎలాటి సంబంధం లేదని 1926 లోనే తొలిసారిగా తెలిపారు. అతడొక సిద్ధుడని నిరూపించారు. ఇలాటి కథలు దేశమంతా వున్నాయి. పంజాబులో విశేష ప్రచారమున్న పూరణ్ భగత్ కథ ఇలాటిదే.

వేమన కాలాన్నిగూడ వారు తొలిసారిగా 17వ శతాబ్ది చివరిపాదమని నిర్ణయించారు.

> ప్రస్తుతంపువేళ పద్యంబు జదివిన
> దప్పులున్న మిగుల నొప్పియుండు
> వెలది మరతవేళ బిత్తలై యుండదా ?
> (భామ మరకపట్ల బత్తలైయుండదా ?)

అనే వేమనపద్యం జగన్నాథ పండితరాయల

> అవసర పఠితా వాణీ
> గుణగణ రహితాపి శోభతే పుంసాం,
> రతిసమయే నారీణాం
> భూషాహావిశ్చ భూషణం భవతి.

అనే శ్లోకాన్ని పోలింది కనుక, జగన్నాథుడు వేమనను అనుకరించాడు గనుక అతని కాలం 1412 - 1440 అని కొందరు వాదించగా, ఈ శ్లోకం 1880 నాటి ప్రసంగ రత్నావళిలోనిదని పరిశోధకులు వివరించారు.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు శివాజీ చరిత్ర వ్రాశారు. శివాజీ సమాకాలికులైనవారు వ్రాసిన రచనలను ఆయన చూడలేదు. ఆ విషయాన్ని పరిశోధకులు గుర్తించారు ఈ సంగతిని 1917 మార్చిలోనే ఇలా తెలిపారు : "మహాదేవ పండితుడను విద్వాంసుడు శతసహస్రికయగు సంహితగా 'శివ భారతమ్' అను పేర మహాగ్రంథమును రచించెను. సవిస్తరముగా నాతని

విజయము లిందు వర్ణితములు. మహాదేవ పండితుడను నింకొక విద్వాంసుడు తంజాపురమును వశపరచుకొన్న శివాజీ సోదరుడగు వేకోజీ మహారాజు కడకు వచ్చి, యేకోజీ యెరుగని కొన్ని విజయములు మాత్రము గ్రంథరూపముగా తెలిపియున్నాడు. 'పర్ణాల పర్వతీ గ్రహణోపాఖ్యానమ్' అని దీనికి పేరు. ఇది తంజాపుర పుస్తకశాలలో నున్నది. ఈ రెండు గ్రంథములును శివాజీకాలము ననే రచింపబడినవి. కన్నారజూచి వర్ణించినారు." అని తెలిపారు.

జగన్నాథ పండితరాయలకు లవంగి అనే యవనకాంతతో సంబంధ మున్నట్టు కథ ప్రచారంలో వుంది ఈ కథ శ్రీ రంగస్వామి సరస్వతి అనే పురాతత్వవేత్త తెలిపిన 'విభాగరత్నమాల' అనే గ్రంథాన్నిబట్టి శ్రీనాథుడు ఓడించిన డిండిమ భట్టారకుని వంశం వాడయిన శోణగిరి నాథుని కథయని, ఇతడు ఢిల్లీకి వెళ్ళి అక్కడ ఢిల్లీ పాదుషా ఆస్థాన పండితులను జయించి, లవంగి అనే యవన కన్యకు ముగ్ధుడైన గాథేనని ప్రభాకరులు 1916 లోనే వ్రాశారు.

సి. పి. బ్రౌన్, మెకంజీ సేవలను గుర్తించి వారిని గురించి తొలిసారిగా 1911 మార్చి నెలలో కృష్ణాపత్రికలో వ్రాశారు ప్రభాకరులు. పిదప 1928 సెప్టెంబర్ 1వ తేదీ శనివారం త్రిలింగ పత్రికలో వారు బ్రౌనును గురించి మరొకవ్యాసం వ్రాశారు. దానిని ఇక్కడ పేర్కొంటాను.

"నూర్గార్లు లెక్కసేయక
పేర్గందిన విబుధ వరుల బిలిపించుచు వే
మార్గర్థమిచ్చు వితరణి
ఛార్లెస్ ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్."

"ఆంధ్రభాషోద్ధారకులలో కలకాలమ్ము స్మరింపదగిన మహనీయుడు, మహావిద్వాంసుడు నగు సి. పి. బ్రౌను దొరగారి జీవిత చరిత్రమును, ఆంధ్ర భాషకు వారు చేసిన యసాధారణ మహోపకారమును, వారి యాస్థాన పండితుల విషయమును, వారు రచించినట్టియు, రచింపించినట్టియు గ్రంథముల విషయమును, వారి విద్వద్గోష్ఠిలో నడచిన కథలను, వారికితరులు వ్రాసినట్టియు, వారితరులకు వ్రాసినట్టియు జాబులను సవిస్తరముగా సంఘానించి నేను 'బ్రౌను దొరగారి చరిత' మను పేర గ్రంథరూపముగా వెల్లడించనున్నాను.

"బ్రౌనుదొరగారు కడపలో నొక గొప్ప బంగళా కొని పెంపొందించిరి. ఆ బంగళాను వారు వార్ధకమున మదార్సులో పోస్టుమాస్టర్ జనరల్‌గా నుండు టచే విక్రయించివేసిరి. కడప, మచిలీపట్టణము మున్నగుచోట్ల వారు జిల్లా జడ్జి పనిలో నుండిరి. కడపలో గాని, మచిలీపట్టణమునగాని ఇంక నితరత్రకాని వారిఫోటో దొరకునేమో అని కుతూహల పడుచున్నాను. అ ఫోటో ఎక్కడనేని కలదేని ఎరిగినవారు నాకు తెలుప గోరుచున్నాను. మరియు తెలుగుదేశమున నెక్కడ గాని, ఎవ్వరియొద్దగాని వారు వ్రాసిన చాటువులున్నను, వారికి సంబం ధించిన కథలు పద్యములున్నను దయతో నాకు బంపగోరుచున్నాను, లేదా పత్రికలలో బ్రకటింపగోరుచున్నాను. వానినెల్ల నా గ్రంథమున చేర్చుకొందును. అర్థప్రాణముల నాంధ్రభాషాభ్యుదయమునకై యర్పించి, మన ప్రాచీన వాఙ్మయ మును బరిరక్షించి పెట్టిన యామహనీయుని చరిత్రము ఆంధ్రులకెల్లరకు అవశ్య పఠనీయము. వారి ఫోటో దొరికెనేని అది ఆంధ్రాభిమానులకెల్లరకు ఆనంద ముతో కన్నులకద్దుకొన దగిన దగును. ఎక్కడనేని దొరకునో దొరకదో!"

ప్రభాకరులు 1928 లో ఆరంభించిన ఈ అన్వేషణం 1936 లో ఫలించింది; లండన్‌నుంచి యేట్స్ గారి ద్వారా "బ్రౌన్ గారి వాఙ్మయ జీవిత గాథ" (ఆంగ్లంలో టైప్ ప్రతి) సంపాదించగలిగారు. దానిని డాక్టర్ ఆనంద మూర్తి మణిమంజరి 8 వ సంచికలో ప్రచురించారు.

ప్రభాకరులు బ్రౌన్ గారిని గురించి 1911 లోనే సగౌరవంగా ప్రజలకు తెలిపి, వారి జీవితచరిత్రను వ్రాయడానికి పూనుకొని పెక్కు ప్రయత్నాలు చేయగా, మిత్రుడు బంగోరే ఈ విషయాలేమీ తెలియక ప్రభాక రులను విమర్శించాడు. నేను ఇదేమిటి పెద్దలందరిమీద ఇలా విరుచుకుపడ్డారని అడిగాను అతని దుర్మరణానికి ముందు. "చాల పొరపాట్లు దొర్లాయి. సవరించు కుంటాను." అని అన్నాడు కాని దురదృష్టవశాత్తు దుర్మరణం చెందాడు.

"హైందవ సారస్వతమునకు గనియని చెప్పదగు చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గల విషయరత్న విశేషములు ప్రపంచమునకు దప్పక వెల్లడికావలసినవి. మెస్తరు మెకంజీ, బ్రౌను అను నాంగ్లేయులు మనకు జేసిన మహోపకారము మరువరానిది. పత్రికాధిపతులును, భాషాభిమానులును

నిందలి విషయములను వెలిపుచ్చు వ్రాతలు. పీలునుబట్టి యప్పుడప్పుడు కొన్ని కొన్ని చిన్న చిన్న యుపయుక్తాంశములను వెల్లడింపదలంపుగొని ప్రస్తుత మిద్దానిని వ్రాయించి పంపితిని. బ్రౌను, మెకంజీ దొరలు వ్రాయించిన వ్రాతలు భాషా విషయమున సంపూర్ణ సంస్కారమందని వైనను, పసిబాలుని కైన నర్థమగునట్లు తేటతెల్లముగ నుండును అట్టివానిని మన మతి కౌశలము జూపి సంస్కరింపబూనిన సులువుగా నర్థము కాకపోవునేమో యను తలంపున నున్నదున్నట్టే వ్రాయించి పంపగలిగితిని."

ఈ పీఠికతో వారు ఎఱ్ఱగడ్డవారి పోరాటం ప్రచురించారు. 1914 లో ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధంలో బ్రౌను ఉత్తరాలు, పిదప 1944-45 లో కొన్ని ప్రచురించారు.

తంజావూరు నాయకరాజుల విగ్రహాలను నిర్ధారించిన కీర్తి ప్రభాకరులదే. కుంభకోణంలో రఘునాథరాయలు రామస్వామి దేవాలయం కట్టించారు గొప్పది. ఆ దేవాలయంలోని ఒక స్తంభంపై రఘునాథరాయల, ఆయన కుమారుని విగ్రహాలున్నాయి. ఉత్సవసమయాలలో ఉత్సవ విగ్రహాలు ఆ స్తంభం వద్దకు రావడం, ఆ స్తంభాన్ని పుష్పమాలతో అలంకరించడం ఆచారం. వాటికి, దేవాలయ భాండాగారంలోని విగ్రహాంకుగల పోలికలనుబట్టి అవి రఘునాథ రాయలవేనని ప్రభాకరులు నిర్ణయించారు.

ఇలా చెబుతూపోతే, ఏండ్లూ పూండ్లూ పడుతాయి. ప్రభాకరుల కృషి అపూర్వం, ఋతం, తేజోమయం అని మూడు ముక్కలలో ముగిస్తాను

o o o o

శృంగార శ్రీనాథము గొప్ప ప్రామాణికమైన చరిత్ర గ్రంథం. ఇలాగే తంజావూరు ఆంధ్రనాయకుల చరిత్ర, ఆంధ్రదేశ సంస్కృత కవుల చరిత్ర, తెలుగు కవుల చరిత్ర గొప్పవి.

చరిత్రకెక్కని చరితార్థురాలు తాళ్ళపాక తిమ్మక్క. ఈమె అన్నమాచార్యుని పెద్దభార్య. మంజరీ ద్విపదలో సుభద్రాకల్యాణం పాటగా ఈమె రచించింది. ఈ పాట "తాళ్ళపాకాన్నమయ తరుణి తిమ్మక చెప్పె, తిమ్మప

చెప్పె" అనే పాఠాంతరాలతో తెలుగుదేశమంతా వ్యాపించివుంది తెలుగు సీమంతినుల నోళ్ళలో. దీని తాటాకుల ప్రతి ఒకటి లభించింది ప్రకాశకులకు కాళహస్తిలో. దానిని అక్కడక్కడ లేఖక ప్రమాదాలు సవరించి తిమ్మక్కను సాహిత్య చరిత్ర కెక్కించారు ప్రకాశకులు.

తాళ్ళపాక తిమ్మక్క రచన మరొకటి మేలుకొలుపుల పాట మంజరీ ద్విపదలో లభించింది. దానిని డాక్టర్ నిరకా చక్రవర్తి భారతిలో ప్రచురించింది.

వేములవాడ భీమకవి నివాసం విషయంలో ప్రకాశకుల వాదాన్ని కొందరు ఆక్షేపించారు. చాటుపద్య మణిమంజరిలోను, 'మిగడతరకలు' వ్యాస సంపుటిలోను వేములవాడ భీమకవి తెలంగాణా వాడనడానికీ, ద్రాక్షారామ సమీపవాసి అనడానికి ప్రమాణాలున్నాయన్నారు వారు. వేములవాడ, లేములవాడలు అని రెండూ యతిస్థానాలలో ప్రమాణంగా ఉన్నాయి. ద్రాక్షారామం దగ్గరా ఒక వేములవాడ వుంది.

"ఘనుడన్ వేములవాడ వంశజుడ దా
 క్షారామ భీమేశనం
దనుడన్ దివ్య విషామృత ప్రకట నా
 నాకావ్య ధుర్యుండ భీ
మన నాపేరు నెఱుంగజెప్పితి దెలుం (కళిం)
 గాధీశ కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు వే
 గం దెచ్చి లాలింపురా."

అని చాటువులో ఉన్నది. వేములవాడలో భీమేశ్వరస్వామి ఉన్నారనడం వాస్తవమే. "వేములవాడ వంశజుడ దాక్షారామ భీమేశనందనుడ, భీమన నాపేరు" అని కవి చెప్పినప్పుడు ద్రాక్షారామ సమీపవర్తి అని భావించడంలో పొరపాటులేదు. జనశ్రుతి కూడ ఉంది. వేములవాడ భీమేశ నందనుడను అని చెప్పుకోలేదు; వేములవాడ వంశజుడ అన్నాడు.

(జనశ్రుతి అంటే పోతన విషయం జ్ఞాపకం వచ్చింది పోతన బమ్మెరలో జన్మించి వుంటాడనడంలో సందేహింపనక్కరలేదు. కాని, అతడు ఒంటిమిట్టలో వున్నట్లు, కోదండరాముని ఎదుట తపస్సు చేసినట్లు జనశ్రుతి ప్రబలంగా వుందదంపల్లి మహర్షి తుల్యులు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు నమ్మారు. జనశ్రుతులుకూడ ప్రబల ప్రమాణమే. అంతకన్నా ప్రబలమైన ఆధారాలు దొరికినప్పుడు సత్యదృష్టిగలవారు ఎవరైనా తమ అభిప్రాయాలను మార్చుకుంటారు.)

నాగబు శాసనం విషయంలో మిత్రులు డాక్టర్ కార్తికేయశర్మ అది నాగబువస అనే పదంలోని భాగమని, నాగబు అనే సంపూర్ణ పదం కాదని, తిరుమల రామచంద్రగారు కూడ పొరపడ్డారని ఒక సభలో అన్నారు. శాసనం మూడక్షరాలు ఒక చలువరాతి ఫలకం మధ్యన ఉంతటంవల్ల ఇది సంపూర్ణ పదమేనని నమ్మడానికి అవకాశం వుంది. నాగబుదస అని చెక్కేవాడు ఆ ఐదు అక్షరాలకు తగిన స్థలంలో చక్కగా తీరుగా చెక్కుతాడు గాని, ఖండమధ్యన పంక్తి ప్రారంభించడు ఇదంతా ఆలోచించే ప్రభాకరులు అది తద్భవీకరణ ప్రారంభదశదని భావించారు.

వారు కొన్ని వందల వ్యాసాలు వ్రాశారు. అన్నీ అచుంబిత విషయాలను గురించే. వారి వాఙ్మయ సేవను తెలిపే పట్టికను ఇక్కడ పొందుపరుస్తాను.

## వేటూరివారి రచనలు

(అ) గ్రంథ పరిష్కరణలు :

1. అప్పన 'చారుచర్య' (1922)
2. ఉద్భటారాధ్యచరిత్ర (1935)
3. భగవదజ్జుకమ్ (సంస్కృతము) (1925)
4. మనుచరిత్ర (1926)
5. బసవ పురాణము (1927)
6. బసవోదాహరణము (1926)
7. నీతిద్విషష్ఠికా (సంస్కృతము) (1928)
8. క్రీడాభిరామము (1928)

9. బాలభావ (1930)
10. ఉత్తర హరివంశము (1937)
11. సుగ్రీవ విజయము (1939)
12. హరవిలాసము (1939)
13. గ్రంథ వివరణికలు (19 సంపుటాలు)
14. రంగనాథ రామాయణము (1942)
15. వేంకటేశ్వర వచనములు (1945)
16. అన్నమాచార్య సంకీర్తనములు (1947)
17. అన్నమాచార్య చరిత్ర (1949)
18. ధనుర్విద్యావిలాసము (1949)
19. శృంగారామరుకము (1949)
20. ఆంధ్ర కామందకము (1950)
21. కాటమరాజుకథ (1950)
22. సుభద్రా కళ్యాణము (1950)
23. సారసంగ్రహగణితము (1950) పరిష్కరణ
    పావులూరి మల్లన (1952) ప్రచురణ
    పరిష్కృతాలు – అముద్రితాలు
24. కాశీఖండము
25. కవిలోకచింతామణి–వెల్లంకితాతంభట్టు
26. నైషధపారిజాతీయము–కృష్ణాధ్వరి
27. నన్నెచోడ కుమారసంభవము–8 అశ్వాసములు
28. బేతాళ పంచవింశతి
29. భీమఖండము
30. నీలగిరియాత్రా చరిత్ర
31. కేయూరబాహు చరిత్రము.

(ఆ) సంకలనాలు :

1. చాటుపద్యమణిమంజరి-ప్రథమభాగము (1913)
2. ప్రబంధ రత్నావళి (1918)

3. చాటుపద్య మణిమంజరి—ద్వి. భాగము (1922)
4. చాటుపద్య మణిమంజరి—తృ. భాగము (అముద్రితము)
5. లక్షణోద్ధారము (1948-50) అముద్రితము
6. శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు (1949)
7. శాసన సంకలనము
   (క్రీ. శ. 4వ శతాబ్దినుండి-12వ శతాబ్దివఱకు) అముద్రితము
8. గాంధి రామాయణము (అముద్రితము)

(ఇ) వ్యాఖ్యానాలు:

1. మనుచరిత్ర (1928)
2. ఉత్తర హరివంశము - 4 ఆశ్వాసములు (1948-49)
3. నన్నెచోడకుమార సంభవము - 1వ ఆశ్వాసములో కొంత (1949)

(ఈ) వచన కృతులు.

1. నీతినిధి (ఆంగ్లమునుండి పరివర్తన) (1926)
2. తెలుగుమెఱుగులు (వ్యాససంపుటి) (1948)
3. ప్రజ్ఞాప్రభాకరము (స్వీయోదంతము) (1948-50) ప్రచురణ (1951)
4. మీగడతఱకలు (వ్యాససంపుటి) (1951)
5. సింహావలోకనము ( " ) (1952)

(ఉ) కథలు:

1. కామధేనువుకథ (1914)
2. కరుణకము (1924)
3. కలికి—చిలుక (1924)
4. తక్రానందస్వామి (1930)
5. పుణ్యవతి-భాగ్యవతి (1930)
6. కాకిపగ (అలభ్యము)

(ఊ) చరిత్ర రచనలు :

1. తంజావూరి యాంధ్రరాజుల చరిత్ర (1914)
2. శృంగార శ్రీనాథము (1920)
3. అన్నమాచార్య జీవితచరిత్రము (1949)
4. ఆంధ్రదేశ సంస్కృత కవుల చరిత్ర-కొంతవఱకు (1923-24)

(ఋ) రూపకానువాదాలు :

1. ప్రతిమ (1910 రచన) ముద్రణ 1927. భాసకృతి కనువాదము
2. కర్ణ భారము (1918) భాసకృతి కనువాదము
3. మధ్యమ వ్యాయోగము (1918) భాసకృతి కనువాదము
4. భగవదజ్జుకము (ప్రహసనము) (1924) బోధాయనకృతి కనువాదము
5. మత్తవిలాసము (1935) మహేంద్రవిక్రమకృతి కనువాదము
6. నాగానందము (రెండంకములు మాత్రము) (1952) ప్రచురణ శ్రీహర్షకృతి
7. గౌరీకళ్యాణము (శ్రవ్యనాటిక-స్వతంత్ర రచన) (1944) అముద్రితము

2. వేటూరివారి కవితలు

1. ఎడ్వర్డు పట్టాభిషేక శ్లోకములు (1902) అలభ్యము
2. 'ఒథెల్లో' అనువాదమునకై వ్రాసిన పద్యములు (1907) అలభ్యము
3. పార్థసారథిస్వామిపై (1906-10)
4. శ్రీ వేంకటేశ్వరస్వామి (1910)
5. నూతన వర్షము (ఆంధ్రభారతి—12 సం. 1 సంచిక) (1911)
6. పంచమజార్జి పట్టాభిషేకము (సరస్వతి—కాకినాడ) (1911)
7. శ్రీనివాస నిర్యాణము (24-11-1911) కృష్ణాపత్రిక
8. తంజావూరి యాంధ్రరాజుల చరిత్ర పీఠికలో (1914)
9. చల్లపల్లి జమీందారు అంకితము స్మృతి (9-10-1919) అం. ప.
10. తిరుపతిశాస్త్రి సంస్మృతి (9-4-1921) ఆంధ్రపత్రిక
11. మూన్నాళ్ళ ముచ్చట (ఖండకావ్యము) (1922)

12. రాజరాజనరేంద్ర ప్రశంస (1922)
13. సరస్వతి (ముక్త్యాల) పత్రిక ముఖపత్రముపై (1923 మార్చి)
14. ఏణీపంచకము (1923 ఏప్రిల్, సరస్వతి-ముక్త్యాల)
15. సమస్యా పూరాణము (1923 మే, " )
16. అలవాటు (పద్యకథ) (1923 జూన్ " )
17. ప్రతాపరుద్రకళ్యాణములోని శ్లోకానువాదములు (1923) నవంబరు, సరస్వతి–ముక్త్యాల
18. దివ్యదర్శనము (ఖండకావ్యము) (1924)
19. కృతార్థుఁడు (1924) ఏప్రిల్-భారతి
20. కలికి-చిలుక కథలోనివి (1924) జూన్–భారతి
21. రాదాకృష్ణ నాటక ప్రశంస 1–8–1924
22. ఏత్రనళీయముపై 5–8–1924
23. బాలభారతీ నాటక సమాజ ప్రశంస 11-8-1924
24. మహాత్ముని ఉపవాసదీక్ష 4–9–1924 ఆంధ్రపత్రిక
25. ఆశంసనము-ఆంధ్రపత్రిక-ఉగాదిసంచిక (1924) రక్తాక్షి
26. మహాత్మునకు స్వాగతము 7-3-1925 ఆంధ్రపత్రిక
27. కాళహస్తి–శివరాత్రి 1925 మార్చి–భారతి
28. సప్తపదులు (అనువాదము) (1925)
29. గాథాసప్తశతి (కొన్ని గాథల అనువాదము) (1925)
30. కడుపుతీపు (ఖండకావ్యము) (1925)
31. కపోతకథ ( " ) (1925)
32. విశ్వాసము (ఖండకావ్యము) (1926)
33. దక్షిణాంధ్రబాలుఁడు (దక్షిణ ఆంధ్రపత్రిక) 1927 సం. 1 నుంచి 8
34. శరత్వార్థి (గేయము) 1927 అక్టోబరు–సుభాషి
35. చిన్ననాటి చేష్టలు (ఖండకావ్యము) (1928)
36. జిజ్ఞాసువు (అనుద్రితము) (1928)
37. గోవర్ధన సప్తశతి శ్లోకాలు 1928, ఫిబ్రవరి – ఆంధ్రభారతి
38. చల్లపల్లి జమీందారు శ్రీ శివరామప్రసాద్ పట్టాభిషేక ప్రశంస ( 929)

39. శరణార్థి 1929 అక్టోబరు - గృహలక్ష్మి
40. పూలవిందు (అసమగ్రము – అముద్రితము)
41. అర్ధాంగలక్ష్మి (1930) జూలై -గృహలక్ష్మి
42. తెలుఁగుతెఱవ 1930 అక్టోబరు-గృహలక్ష్మి
43. శరణార్థి (గేయము) ఆనందవాహిని (1930) అక్టోబరు
44. ప్రాణేశ్వరుఁడు (అముద్రితము)
45. సతీర్థ్యసంప్రార్థనము-స్వధర్మ ప్రకాశిని 4 సంపు. 7, 8 సంచికలు
46. సనత్ సుజాతీయము (అనువాదము) అముద్రితము
47. పండితరాయల చాటువులు (2) 1940 ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక 28 సంపు. 2 సంచిక
48. సీతాఫలము (గేయకథ) 1940 సెప్టెంబరు - భారతి
49. నాగరి 1941 సెప్టెంబరు - ఆంధ్రి
50. భజగోవింద శ్లోకాలు అముద్రితము
51. అమరావతీ శిల్పము 1943 జనవరి - భారతి
52. మాతృశ్రీ (ఖండకావ్యము) 1944 ఆం. పత్రిక ఉగాది సంచిక
53. స్వాతంత్ర్య గీతము 15-8-1947
54. డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్యపై (1948)
55. ఆస్థానకవి పట్టప్రదానోత్సవముపై (1949) అక్టోబరు
56. పెండ్లిముచ్చట్లు (అముద్రితము)
57. నానావిధ చాటురచనములు

3. గ్రంథరూపంలో రాని వ్యాసాలు

1. తాళపత్రము 10-1-1914 కృష్ణాపత్రిక
2. సి. పి. బ్రౌనుదొర ఉత్తర ప్రత్యుత్తరాలు 1-6-1914 ఆం. ప.
3. వసుచరిత్రము 19-6-1914 ఆం. ప.
4. ద్విపదకృతులు 10-8-1914 ఆం. ప.
5. సి. పి. బ్రౌనువారి ఉత్తరము 11-8-1914 ఆం. ప.
6. వనితల కవితలు 31-8-1914, 14-9-1914 ఆం. ప.
7. వాడుకభాష 12-9-1914 కృష్ణాపత్రిక

8. ఆంధ్రి నాటక రచనము 28-9-1914 కృష్ణాపత్రిక
9. లవంగి 14-10-1916 "
10. ఆంధ్రశబ్దానుశాసనము 6-12-1916 "
11. మధురకవితలు – చరిత్రాంశములు 28-12-1961 "
12. ఏనాదులు 13-1-1917 "
13. గ్రంథరత్నములు 20-1-1917 "
14. లక్షణగ్రంథముల ప్రస్తావన-మధురగీతములు 10-3-1917 "
15. గ్రామ్యమీమాంస 31-3-1917 "
16. లవంగి 31-3-1917 "
17. రాజులు - కవితలు, మధుర రచనలు 21-4-1917 "
18. ప్రబంధ రత్నాకరము 2-6-1917 "
19. నాడీ గ్రంథములు 6-10-1917 "
20. వరదాంబికా పరిణయము - శివాజీచరిత్రము 1916-17 "
21. ఆంధ్రకవుల చరిత్ర – నన్నయభట్టు 8-12-1917 "
22. ప్రభావతీ ప్రద్యుమ్నము – పురాణపండ
మల్లయ్యగారి వ్యాఖ్యపై (1918) 10 వ్యాసాలు
23. తంజావూరు రాజుల విగ్రహాలు 10-9-1919 ఆంధ్రపత్రిక
24. వాడుకభాషలేఖ 1919 సెప్టెంబరు 'తెలుగు' మాసపత్రిక
25. శివతత్త్వసారము 9-10-1919 ఆంధ్రపత్రిక
26. కృష్ణరాయుడు, పెద్దన 20-1-1922 ఆంధ్రపత్రిక
27. ప్రాచీన వస్త్ర పరిశ్రమ 27-5-1922 త్రిలింగ
28. వృక్షాయుర్వేదము 26-8-1922 త్రిలింగ
29. శ్రీకాకుళక్షేత్రము 1921 ఆంధ్రిపత్రిక
దుర్మతి-మాఘశుద్ధ శనివార, దుర్మతి-మాఘబహుళ శనివారం
30. సారంగధరుఁడు 5-5-1922 ఆంధ్రపత్రిక
31. ప్రాచీన రూపకము (1928) మార్చి, ఏప్రిల్ సరస్వతి - ముక్త్యాల
32. నాయసేనాపతి 1925 ఆగస్టు సరస్వతి - ముక్త్యాల
33. విద్యానాథుఁడు, అనంతవరతామ్రశాసనము
1928 సెప్టెంబరు సరస్వతి – ముక్త్యాల

34. విశ్వనాథుడు 1928 అక్టోబరు సరస్వతి ముక్త్యాల
35. విశ్వనాథుఁడు, నరసింహకవి 1928 నవంబరు సరస్వతి - ముక్త్యాల
36. సి. పి. బ్రౌను దొరగారు 16-12-1928 త్రిలింగ
37. రెడ్డి రాజుల ప్రశంస 1923 అక్టోబరు రెడ్డిరాణి
38. ద్విపద భారతము 1924 జనవరి రెడ్డిరాణి
39. మంచాళ్ళ తామ్ర శాసనము 1924 జనవరి రెడ్డిరాణి
40. అభినయకళ 20-2- 954 ఆంధ్రపత్రిక
41. రెడ్డిరాజుల చరిత్ర 1924 మార్చి, ఏప్రిల్ - రెడ్డిరాణి
42. నాటకకళ - రుధిరోద్గారి - మార్గశీర్షము 'కళ'
43. కలికి — చిలుక కథ 1924 జూన్ భారతి
44. కరుణకము 1924 ఆగష్టు "
45. చెన్నుభట్టు 1924 సెప్టెంబరు - సరస్వతి
46. పశుపతి నాగనాథుఁడు, గౌరన-1924 అక్టోబరు-నవంబరు సరస్వతి
47. వినోదవిమర్శ-రుధిరోద్గారి-ఫాల్గుణ బ॥ శనివారం ఆంధ్రపత్రిక
" రక్తాక్షి-ఆంధ్రపత్రిక
48. సందేశములు రక్తాక్షి-చైత్రశుద్ధ ౧౩ శనివారం "
49. జయంతి కామేశం పంతులు-రక్తాక్షి చైత్ర బ॥ శనివారం "
50. లేఖన ప్రమాదములు-రక్తాక్షి కార్తీక శుద్ధ ద్వాదశి "
51. కొండవీడు త్రైపీయతు 1924 డిసెంబరు - రెడ్డిరాణి
52. బాలకుల పలుకులు రక్తాక్షి — 'సాహితి' సంపు. 4 - సం. 11
53. సుభోజనము 1925 ఫిబ్రవరి - సరస్వతి
54. ఆంధ్రదేశమున తుపాను-బందరుబీభత్సము 21-5-1925 ఆం.ప.
55. నన్నెచోడుడు-క్రోధన-చైత్ర, వైశాఖములు-ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక
56. వేమన ఆంధ్రపత్రిక—ఉగాదిసంచిక-క్రోధన
57. నారాయణతీర్థులు 1925 జూన్, జూలై-భారతి
58. వినోద విమర్శ 1927 నవంబరు
59. ముట్లూరి శాసనము 1927 రెడ్డిరాణి
60. ఇక్ష్వాకురాజులు—పుట్టుపూర్వోత్తరాలు-1928 జనవరి, భారతి

61. వినోద విమర్శ 1928 మార్చి - భారతి
62. ప్రతాపరుద్రగజపతి – ఆంధ్రపత్రిక ఉగాది సంచిక – విభవ
63. విమర్శ విమర్శనము, వినోదవిమర్శ 1928 మే భారతి
64. పాళ్చీచీవాంధ్రశాసనములు 1928 జూన్ భారతి
65. అహదనకరశాసనము 1928 జూలై భారతి
66. అహదనకర పునర్విమర్శనము 1928 సెప్టెంబరు భారతి
67. ఏకమూరు శాసనము 1929 రెడ్డిరాణి
68. షష్ఠీసమాసము 8–4–1929 త్రిలింగ
69. మా మేనత్త (కథ) 1930 ఫిబ్రవరి, మార్చి ఆనందవాహిని
70. మా మామ (కథ) 1930 మే ఆనందవాహిని
71. తకార్నందస్వామి (కథ) 1930 అక్టోబరు ఆనందవాహిని
72. వినుకలి – కనుకలి 1933 నవంబరు – భారతి
73. ఆంధ్రచ్ఛందో విశేషాలు 1935 జూలై భారతి
74. కృష్ణదేవరాయలు – సకలకథాసారసంగ్రహము 1935 అక్టోబరు భారతి
75. ఈశ్వరకరుణామృతము 17-7-1940 ఆంధ్రపత్రిక
76. శ్రీనాథుని కాశీఖండము 31-7-1940 ఆంధ్రపత్రిక వారపత్రిక
77. రేవణ (శబ్దచర్చ) 1941 డిసెంబరు భారతి
78. చాటువులు 15-7-1942 ఆంధ్రపత్రిక
79. సాహిత్యం అన్ని తరగతులవారికి అనుభవింపదగి ఉండాలి 25-1-1943 ఆంధ్రపత్రిక
80. తలటోపి తురుష్కులనుంచి వచ్చిందా ? 27-2-1944 ఆంధ్రపత్రిక
81. భుక్తిపత్రి 16–4-1944 ఆంధ్రపత్రిక
82. నాగార్జున కాలనిర్ణయము 1944 జనవరి భారతి
83. సమీక్ష 13-1-1944 అముద్రితము
84. జ్ఞాన సంపద 1944 ఫిబ్రవరి భారతి
85. ఏలపాటలు 11–6–1944 ఆంధ్రపత్రిక
86. కాటమరాజు కథపై వ్యాసాలు 12–6–1944, 4–8–44, జనవరి, ఫిబ్రవరి 1944 ఆంధ్రపత్రిక

87. టుమ్రీలు 2-4-1944 ఆంధ్రపత్రిక
88. గాలికబుర్లు 4-6-1944 "
89. క్షేత్రయ అక్షరాక్షరము ప్రమాణమే 5-7-1944 "
90. కర్మారి – కనుమారి (శబ్దచర్చ) 9-4-1944 "
91. సారసము - నీరసము " 10-4-1944 "
92. కర్మారి – కనుమారి " 30-4-1944 "
93. ఆనందగజపతి బాల్యంలో 29-10-1944 "
94. దేశభాషలు తలఎత్తాలంటే 5-8-1945 "
95. మట్ల కుమార అనంతరాజు 29-7-1945 "
96. నాగార్జునుఁడు 1945 జనవరి భారతి
97. నేటి తెలుఁగు - నాటి తెలుఁగు 1942 సర్వధారి ఆంధ్రపత్రిక ఉగాది సంచిక
98. నవ్యసాహిత్యపరిషత్ ఉపక్రమోపన్యాసము 5-1-1046 ముక్త్యాలలో
99 మథుర స్మరణము 20-1-1946 నవోదయ
100. భవభూతి అడుగుజాడల్లో 21- -1946 ఆంధ్రపత్రిక
101. దేశావ్యాప్తమైన దుర్భిక్ష మహాక్షోభం 17-2-1946 ఆంధ్రపత్రిక
102. ఉపలబ్ధ ఆముద్రిత ప్రాచీనగ్రంథములు 1946 మే భారతి
103. సజీవరచన 1948 మే భారతి
104. తాళతి – శ్రీ వేంకటేశ్వర పరిశోధన సంస్థ జర్నల్ 1949
105. ప్రాచీన తాళపత్రాలు 7-6-1950 వాణి
106. తాళపత్రి గ్రంథములు 1950 సెప్టెంబరు భారతి
107. తాళ్ళపాకవారి సంకీర్తనలు 1953 ఆగస్టు సంస్కృతి
108. తాళ్ళపాకవారి సంకీర్తనలు 1954 సంస్కృతి

ఈ వ్యాసాలన్నీ కేవలం లౌకిక విషయాలకు సంబంధించినవి. ఆధ్యాత్మిక విషయాలపై వారు వ్యాసాలేమీ వ్రాయలేదు. కాని, వారి ప్రార్థనోపన్యాసాలు ప్రధానంగా ఆధ్యాత్మికాలుగా వుండేవి. వాటిని లెక్కగడితే కొన్ని వేలు దాటుతాయి. మిత్రులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులు, కొత్త రామకోటయ్య మున్నగువారు ఆ ప్రార్థనోపన్యాసాల ప్రధానాంశాలను వ్రాసుకొనేవారు.

ప్రార్థన సమయంలో పలువురు రుగ్ణులు వచ్చేవారు. వారి రోగాలచర్చలో వివిధ వైద్య ప్రక్రియలపై ప్రభాకరుల కాంతి ప్రసరించేది. ప్రార్థనానంతరం అయారోగులకు రోగాల ఉనికిని వారు ఎక్స్‌రేఫోటోలాగ వివరిస్తూంటే, ఆధునిక వైద్యులు విస్తుపోయేవారు. నిదానం, చికిత్స వాటంతట అవే జరిగిపోయేవి.

నా మట్టుకు నాకు వారి ప్రార్థనా సమావేశాలు ఆవేదనల సన్నిధిగా, చికిత్సలకు పెన్నిధిగా, హేతువాదదిమ్మన్యులకు అటకట్టుగా, జిజ్ఞాసువులకు ఆటపట్టుగా కనిపించేవి. నాకూ ప్రార్థన సమయంలో ఏవేవో భావాలు తోచేవి నేనెప్పుడూ చూడని, చదవని ప్రాచీన నగరాలు, విచిత్ర వేషధారులయిన మానవులూ, విచిత్రలిపులూ కనిపించేవి. వాటి భావాలు కొన్నిటిని ప్రభాకరులు బహిరంగపరచేవారు, కొన్నిటిని గోప్యంగా ఉంచేవారు. వ్యాధుల విషయం మాత్రం దాచేవారుకారు.

ఒకమారు నాడీగ్రంథాల చర్చ వచ్చింది. నాడీగ్రంథాలు వ్రాసినవారి ఊహలు కొంతవరకు నిజమని, వారు సత్యానికి చాల చేరువగా రాగలుగుతారని కాని, అంతా జరుగుతుందని అనలేమని అనేవారు. ఆ నాడీకర్తలు కొంత నిగూఢంగా చెప్పడంవల్ల, వ్యాఖ్యాన సాపేక్షం కావడంవల్ల మనం తెలుసుకోలేకపోవడమూ సంభవిస్తుందని అనేవారు. ఆ సమయంలో ఒకరి జాతకాన్ని భుజంగద నాడిలో చదివారు అది తమిళభాషలో వుంది. విశాఖా నక్షత్రంలో రాహువు సంచరించేటప్పుడు దేశంలోను, జాతకుని జీవితంలోను జరిగే సంఘటనలు కొన్ని ఉన్నాయి. జాతకుని జీవితంతోపాటు సమకాలిక పరిస్థితిని వివరించడం నాడీగ్రంథాల పద్ధతి. అక్కడ విశాఖత్తిల్ పాంబు అని వుంది. నాడీగ్రంథం చదివినవారు యుద్ధం రావచ్చునని, విశాఖపట్నంలో బాంబుపడవచ్చునని సూచించారు. ఎవరూ నమ్మలేదు. కాని. యుద్ధం రానేవచ్చింది; విశాఖరేవులో బాంబు పడనేపడింది. ఇలా ఎన్నో చర్చలు జరిగేవి.

ఆంధ్రవాఙ్మయ ప్రపంచంలో ఎటుమాచినా ఏడు నిలువుల ఎత్తున సాక్షాత్కరిస్తారు ప్రభాకరులు. కత్తిమీద సాముగా, సాహిత్య పాంథ్యులకు ఏడుగడగా మనుగడ గడపిన ఆ మహా మనస్వికి, కళాతపస్వికి, జ్ఞానవమేరు

గని మానవంతో గోమటేశ్వరుని గండరువు నిలువున నిలచిన ఆ యశస్వికి ఇవే నా పరస్పహస్ర నమోవాకాలు.

[ పరిశోధన శివ సంచికనుంచి ]

మృత్యు విజయం ప్రిభాకరుల లక్ష్యం. మృత్యు విజయంతోపాటు మావంటివారిలోని అమానుష ప్రివృత్తిని జయించడంకూడ వారికొక సమస్యే. వారి అయుర్దాయంలో ఎక్కువభాగం మా అమానుష ప్రివృత్తే మింగేసిందేమో! తుదకు మిగిలివున్న కాస్తను పొంచివున్న మృత్యువు చప్పరించింది.

"తుదకు నిన్నె జయించె మృత్యువు మహాత్మ !"

ప్రతి మానవుని జీవితమూ మలుపులు తిరుగుతూ ఉంటుంది. మతిమంతులు తమ సంస్కారాన్ని బట్టి, పరిస్థితులకు అనుగుణంగా ఆ మలుపులను మంచిగా మలుచుకొని తమ భవిష్యత్తుకు బంగారుబాటలు తీర్చుకుంటారు. మరికొందరు డోలాయమాన మానసులు వాటిని చేతులారా జారవిడుచుకుని చేటు తెచ్చుకుంటారు. కాని కొందరి జీవితాలలో ఈ మలుపులు వారి ప్రమేయం లేకనే వారిని వారి అభీష్టానికి చేరువ చేస్తాయి. అలాటిది అరుదుగా జరుగుతుంది. అది వారికి కాక వారి ఇష్టులకో, దేశానికో, సాహిత్యానికో లాభకరమూ, కీర్తికరమూ అవుతుంది. వారుమాత్రం దీపంలాగా వెలిగి కాలిపోతూ, సామాన్య ప్రజలు అనుకునే సుఖాలకు దూరంగా కష్టాల నీడలోనే వుంటారు. దీనికి తార్కాణలు ఎన్నైనా చూపవచ్చు చరిత్రలో. బుద్ధుని జీవితంలో మలుపే రాకవుంటే, అతడూ తక్కిన శాక్య రాజకుమారులలాగే ఉండేవాడు. తులసీదాసు ఏరుదాటక పోతే రామచరిత మానసం అవతరించేదా? గాంధీజీ ఆఫ్రికాకు వెళ్ళడమే సంభవించకపోయివుంటే స్వాతంత్ర్యోద్యమం ఏరూపంలో ఉండేదో!

అలాటి అదృష్టపు మలుపే తిరిగింది 'అన్వేషణ జ్యోతి' నిడుదవోలు వెంకటరావు గారి జీవితంలో, ఆయన ప్రమేయమేమీ లేకుండానే. ఆయన తన అదృష్టాన్ని

అరమరికలు లేకుండానే ఈవిధంగా వర్ణించారు:— "నలబదేండ్లనాటి ముచ్చట. నా జీవితమున కొక మలుపు నా సాహిత్యమున కొక వెలుగు నిలిపినది. పుష్కర కాలము బ్యాంకు గుమాస్తాగా పనిచేయు కాలములో హఠాత్తుగా ఒకనాడు ఆంధ్ర భోజులు పిఠాపురం మహారాజావారు వర్తమానమంపగా వారిని దర్శించుటకు వెళ్ళినాను. అపర కృష్ణరాయలైన ఆయనను ఆముక్తమాల్యద పద్యము "ఖనటత్ప యోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య పిండీకృతాంగ భీతాండజములు"తో ఆశీర్వ దించినాను. 'మీరు చదివిన పద్యములో చటులఝంపా అనియున్నది. ఝంపా శబ్దమున కర్థమేమి?' అని ప్రశ్నించినారు. నేను వెంటనే 'ఇంగ్లీషులో జంప్ అనే మాటయే దాని కర్థము' అన్నాను. 'తెలుగు మాటకు ఇంగ్లీషు అర్థమా?' అన్నారు.... అంతటితో వదలలేదు. ఆ పద్యానికి అర్థం చెప్పమన్నారు ఆముక్త మాల్యద పద్యాలు ఇనుప గుగ్గిళ్లు. నన్ను పరీక్షించడాని కడిగినారేమో నాకు తెలియదు పద్యార్థము వివరముగా విశేషములతో వినిపించినాను. మహారాజావారు 'మేము నన్నెచోడుని కుమారసంభవము చదువుతున్నాము. కాని అది కాళిదాసు కృతికంటే భిన్నముగా ఉన్నదే. కారణమేమి?' అన్నారు. 'కాళిదాసుని కుమార సంభవము కావ్యకళాదృష్టితో పరాంకోటి కెక్కినది. కాని, నన్నెచోడుని కృతి యందు కావ్యదృష్టితోపాటు వీరశైవ సంప్రదాయకమగు ఆధ్యాత్మిక మత విషయాలు నిండి యున్నవి.' అని బదులు చెప్పినాను. వారు 'ఇది యేమి? కేవలము రసవిషయకమగు కావ్యమున మత సంప్రదాయ ప్రవేశమెట్లు?' అని ప్రశ్నించినారు. నేను 'రాయలవారు రసైకమగు గోదా శ్రీరంగనాయకుల ఉదంతమున విశిష్టాద్వైత మత సంప్రదాయమును నిబంధించి యున్నారుకదా?' అన్నాను. ఇంతలో ఆస్థానకవి ఓలేటి వెంకటశాస్త్రిగారు వచ్చినారు. 'దబ్బాటు అనే పదమునకు ప్రయోగమున్నదా?' అని రాజావా రడిగినారు. వారు స్ఫుర ణలో లేదన్నారు. నేను వెంటనే అప్పటికి ఇరువదేండ్ల క్రిందటివారు రచించిన పద్యమును చదివి ప్రయోగము తెలిపినాను. పది నిమిషము లనుజ్ఞగొని వచ్చిన నేను వారితో పన్నెండు పదుల నిముషములు (రెండుగంటలు) గడపినాను, అవే నా జీవితములో అమృతగడియలు. ఆనాడే వారు నన్ను అంకెలనుండి తప్పించి అక్షరములలో ప్రవేశపెట్టవలెనని తీర్మానించుకున్నారు. సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితునిగా నియమించినారు .. పిఠాపురం రాజా వారు నాకు నిత్య స్మరణీయులు."

అప్పుడే అదే వెంకటరావుగారి జీవితంలో మలుపు; ఆయనే అన్నట్టు ఆయన సాహిత్యంలో వెలుగు నిలిపింది. ఆ అనందం అగ్గలం కాగా ఆయన...

"అంకెల బారులం బడి యహర్నిశ మిట్టటు గొట్టుకొంచు నే
వంకయు బుద్ధికి న్నెద రపంతయు లేకను సాహితీ రసం
బింకగనున్న వేళ నను నెంతయు బ్రీతి దెలుంగువారిది
వ్యాంకము నందు నిల్పిన మహాప్రభు నెన్నెద సూర్యరాడ్విభున్."

అని పిఠాపురం రాజావారిని స్తుతించారు. నిజమే పాపం! ఎంత అంకెల గారడీని ఆకళించుకొన్నా, ఉక్కు కటకటాల వెనుక, ఉక్కు తెరలమధ్య ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో పనిచేయడం సాహిత్యలుబ్ధులైన ఆయనకు ఎంతో విసుగు పుట్టించి ఉంటుంది!

"చనియెన్ ద్వాదశహాయనంబులపయిన్
షణ్మాసకాలంబు బ్యాం
కునకే దేహపు టస్థిచర్మములు రెం
డున్ ధారగా బోసి జీ
వనమున్ బుచ్చితి సేవచేసితి మనో
వాక్కాయ కర్మంబులన్
వినియోగించితి నాదు ధీపటిమ వ
న్నెందెచ్చు నెద్దానిలోన్!"

అని ఆ విసుగులోను ఆత్మవిశ్వాసం ప్రకటించారు. అలాటి పరిస్థితిలో తమను సాహిత్య పథంలో పయనింపజేసిన పెద్దమనిషిని ప్రశంసించడం, అశువుగా పద్యాలు చెప్పడం సహజం.

నిడుదవోలు వెంకటరావుగారు 1903 జనవరి 7వ తేదీన విజయనగరంలో జన్మించారు. నాయనగారి పేరు సుందరం పంతులుగారు, తల్లిగారిపేరు జోగమ్మ గారు. నిడుదవోలు వారిది కూనలమ్మ కమనీయంగా చెప్పిన "కవితారసపుజల్లు, ఖడ్గాలగలగల్లు" చెల్లిన ఆరువేల నియోగి కరణాలవంశం. ఆ వంశంలో ఏడుతరాలకు పైన కవిపండితు లున్నారు. ఆ వంశంవారిది పూర్వం పశ్చిమ గోదావరి జిల్లాలోని నిడుదవోలు సమీపంలో వున్న నరేంద్రపురం. వెంకటరావుగారి

తాతముత్తాతలు విజయనగరానికి పదిమైళ్ళలోని అమరాము రావివలస అనే గ్రామానికి వలసవచ్చి కరణీకం సంపాదించారు. తండ్రి సుందరం పంతులు గారు స్వయం కవిపండితులు, పార్థివలింగపూజా ధురంధరులు, పౌరాణికులు. ఆయనకు బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు వాచోవిధేయాలు. ప్రాచీన సాహిత్యంపై ముఖ్యంగా వీరశైవ సాహిత్యంపై ఆదరం ఉన్నవారు గనుక ఆయన ఇంట్లో వెంకటరావుగారు జన్మించడానికి ముందే దాదాపు ఆరువేల ముద్రితాముద్రిత గ్రంథా లుండేవి. "మా నాయనగారు నిడుదవోలు సుందరం పంతులుగారు క్రిందటి శతాబ్దంలోనే తెలుగు దేశంలో మొట్టమొదటిసారిగా గ్రంథాలయం నిర్వహించారు. అనేక తాళపత్ర గ్రంథాలు సేకరించి సంత సించేవారు. ఆ కాలంలో కవులూ, పండితులూ తమ ముద్రిత గ్రంథాలను ఆయనకు గౌరవాభిమాన పురస్సరంగా పంపుతూ వుండేవారు. 1914 లో మా తండ్రిగారు పండితారాధ్య చరిత్ర అచ్చు వేయించారు. అంతకు ముందెవరూ ఈ మహోద్గ్రంథాన్ని అచ్చువేయలేదు. రోజూ బసవపురాణం నుంచి గాథలూ, ఇతర శివపారమ్య ప్రబోధక కథలూ మా నాన్నగారు చదివి వినిపిస్తూండేవారు కుటుంబంలోని మమ్మల్నందరినీ కూర్చోబెట్టుకొని. ఎటు చూసినా మా ఇంట్లో పుస్తకాలే కనబడుతుండేవి. మా ఇల్లు స్వయంగా గ్రంథాలయం కాబట్టి నాకు ఎటునూదినా సాహిత్య వాతావరణమే. నాకు పదమూడు పద్నాలుగేళ్ళప్పుడు మా ఇంటికి మానపల్లి రామకృష్ణకవిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వచ్చే వారు; తాళపత్ర గ్రంథాలను సేకరించడానికిగాను. అప్పుడే ఆ మహోదయుల దర్శనం లభించింది. ప్రభాకరశాస్త్రిగారు మా ఇంట్లో నెలరోజులపాటు ఉన్నారు అప్పుడే పరిశోధనాభిలాష నాతో ప్రవేశించింది కాబోలు!" అన్నారు ఒక సందర్భంలో వెంకటరావుగారు.

"మనజేసె తెలుగునాటను
పనుపడి ప్రథమాంధ్ర పుస్తకాండారము నా
జనకుడగు సుందరమ్మను
నవరతము సంస్మరింతు .. "

అని ఆయన తమ నాయనగారిని ఇటీవలకూడా స్మరించారు.

వెంకటరావుగారి చిన్ననాటి చదువు విజయనగరంలోను, ఉన్నత పాఠశాల చదువు విశాఖపట్నం సి.బి.ఎం హైస్కూలులోను జరిగాయి. విజయనగరం పండిత ప్రకాండుల పుట్టినిల్లు గనుక, ఇల్లుకూడ సరస్వతీ దేవాలయం గనుక చిన్ననాటినుంచే ఆయనపై సాహిత్య సురభి సమీరాలు వీచడంలో ఆశ్చర్యంలేదు. పద్యాలు కంఠస్థంచేయడం, చక్కగా చదువడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య కంఠస్థం చేయడం అనడం పొరపాటు. ఆయనచూచిన రసవంతమైన ప్రతిపద్యమూ కనులద్వారా మెదడులో ముద్రపడిపోయేది. ఆయన పద్యాలు చక్కగా చదవడం, జ్ఞాపకం పెట్టుకోడం ఒకమారు ఆయనను చిక్కులో పెట్టాయి. విజయనగరంలో వెంకటరావుగారి గురువు సెట్టి లక్ష్మీనరసింహంగారు రచించిన చిత్రహరిశ్చంద్రీయం నాటకం వేస్తున్నారు. లోహితాస్యుని పాత్రధారి బాలుడు రాలేదు. వెంకటరావుగారిని ఆ వేషం వేయమని లాక్కుపోయారు నాటకం బాగానేరక్తికట్టించారు బాల వెంకటరావుగారు. ఇంటికి తిరిగివచ్చిన పిదప తల్లి జోగమ్మగారు అటువంటి విషాదభరితమైన పాత్రను కొడుకు వేసినందుకు తెగ చీవాట్లు పెట్టారట "నీకు మతుందా ? చచ్చిపోయే వాడి వేషం కడతావా ?" అని. వాస్తవ మేమంటే తండ్రి ప్రోద్బలం వల్లనే ఆ పాత్రను బాల వెంకటార్రావు అంగీకరించారు. ఇంటర్‌మీడియట్ విశాఖపట్నంలోని ఎ వి ఎన్. (అంకితం నరసింగరావు) సతీమణి కాలేజీలో చదివారు. అప్పుడు సుందరం పంతులుగారు విశాఖపట్నం జిల్లా బోర్డు ఆఫీసులో సీనియర్ అకౌంటెంటుగా వుండేవారు. వెంకటరావుగారు బి.ఎ. మళ్ళీ విజయనగరం మహారాజా కళాశాలలో చదివి ఉత్తీర్ణులయ్యారు. బి.ఎ. చదువుతున్నప్పుడు రసపుత్ర విజయం నాటకకర్త అయిన ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు ఆ కళాశాలలో అధ్యాపకులు. ఆ నాటకంలోని సమాస బహుళాలైన పద్యాలను చాలావాటిని కొండలయందు నుద్దండులై యున్నట్టి దండి మరాఠీలదండు—వంటి గడబిడ ప్రాస పద్యాలను వెంకటరావుగారు రచించారు.

బి.ఎ. చదివేకాలంలో తండ్రిగారు విజయనగరం సంస్థానంలో కొలువులో వున్నారు. ఆర్థిక పరిస్థితి అంత బాగున్నట్టులేదు. బి.ఎ. పరీక్షకు కట్టడానికి డబ్బులేదు. ఏమిచేద్దామా అని ఆలోచిస్తుండగా వెంకటరావుగారికొక చక్కని ఆలోచన తోచింది. అప్పటికే వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ అని

పుస్తక ప్రచురణసంస్థ సుప్రసిద్ధమైంది. రామస్వామిశాస్త్రిగారి కుమారుడు వెంకటేశ్వరశాస్త్రిగారు నిర్వహిస్తున్నారు ఆ సంస్థను. ఆ సంస్థ ప్రచురించిన పెక్కు పుస్తకాలు తమ యింట్లో వున్నాయి. అంతటి ప్రచురణకర్త సహాయం చేయకపోతారా అనే ధీమాతో "విద్యార్థి విన్నపము" అనే పేర పద్యాలలో వెంకటేశ్వరశాస్త్రిగారికొక ఉత్తరం వ్రాశారు వెంకటరావుగారు. దానిలోని కొన్ని పద్యాలను ఉదాహరించడం 20 ఏండ్ల ప్రాయానికే ఆయన కవితాధార ఎంత చక్కగా కుదిరిందో తెలుసుకొనడానికి సహకరిస్తుంది.

"అవధరింపుము నిడుదవోలన్వయుండు
వేంకటామాత్యు దత్యంత వినయ మెసగ
శతసహస్రమ్ములను సమస్కృతు లొనర్చి
నమ్రుడై చేయునట్టి విజ్ఞాపములు.

"అక్షరాభ్యాసంబునందిన దాదిగా
చదువునం దెప్పుడు శ్రద్ధ గలిగి
ప్రతి తరగతియందు బహుమానము ల్గొని
ఒక యేడు తప్పక నొంది జయము
దేశచరిత్రలు తెలుగు భాషయు నాకు
నభిమాన పాఠ్యము లై చెలంగ
ప్రథమ శాస్త్ర పరీక్ష ప్రథమంబు తరగతి
జయమొంది పట్టప్రశస్తి జెంద

విజయనగర మహారాజ విశ్రుతాంగ్ల
సత్కళాశాల నిప్పుడు చదువువాడ
ఈ పరీక్షకు గట్టుట కింత కొన్ని
దినములే గడువయ్యా సుధీంద్ర చంద్ర!

"ధనసహాయము నొనరింపు డనుచు మిమ్ము
వేరుగా గోర నిద్దియె విప్పిచెప్ప
నా యవస్థకు మారు విజ్ఞాపనంబు
చేతనైనంత యుపకృతి చేయవయ్యా

"దానములలోన నుత్తమ
దానంబులు రెండు నన్నదానము విద్యా
దానంబని ధౌమ్యుడు యను
సూనునితో బలికె సుమ్మి సుగుణాధారా !

"ఇదివర కెన్నదే నొకరి యీవికినై చెయిచాపలే దికన్
కుదిరిన దానిలోన సమ కూర్చి పఠించితి నింతదాక ముం
దదియును చాలదన్న భయ మల్లన బుట్టి కడంక దొట్టి మీ
పదముల బట్టినాడ నదుపాయ మొనర్చుము దేశబాంధవా!"

వాస్తవానికి వెంకటరావుగారి సాహిత్య జీవితం అంతకు ఐదారేండ్లముందే ప్రారంభమయింది 1919 అక్టోబరు 2న గాంధీజీ 50వ జన్మదినోత్సవం జరిగింది విజయనగరంలో. అప్పుడాయన గాంధీజీపై పద్యాలు వ్రాసి సభలో చదివారు. అంతకు ముందు 1018లో పరవస్తు రంగాచార్యులకు దేశంలోనే తొలిసారిగా మహామహోపాధ్యాయ బిరుదం ఇచ్చినప్పుడు కాబోలు ఆయనను సముచితంగా ప్రశంసిస్తూ పద్యాలు చదివారు. గాంధీజీపైన చెప్పిన పద్యాలు 1919 10-2న స్థానిక వారపత్రిక "భారతమాత"లో ప్రచురితమయాయి. గాంధీ సాహిత్యానికి వెంకటరావుగారి పద్యాలతోనే తెలుగుదేశంలో నాందీప్రస్తావన జరిగింది. (రాయప్రోలు సుబ్బారావుగారి "మోహనదాస కరమచంద్ర కరుణాసాంద్ర" అనే శీర్షికగల వ్యాసం తెలుగునాట గాంధీ సాహిత్యానికి శ్రీకారం అని ఒకప్పుడు వ్రాశాను. అంతకుముందే 1919లోనే వెంకటరావు గారు శ్రీకారంచుట్టారు) ఆయన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని 'విద్యార్థి వీరుడు' అనే ఖ్యాతినిగూడ పొందారు.

వెంకటరావుగారు పరవస్తువారిపైన చెప్పిన తొలిపద్యాలతో భావుకతకు, కల్పనకు అంతగా తావులేదు గనుక, ఆ సంవత్సరమే చెప్పిన మరి రెండు ఖండికలనే నేను తొలి కవితగా పరిగణిస్తాను. ప్రథమ ప్రపంచయుద్ధం కొన సాగుతున్న సమయం. అప్పుడు 1918 అక్టోబర్ రెండవ తేదీన విశాఖపట్నం సముద్రతీరానికి ఒక యుద్ధ నౌక వచ్చింది. అది పట్టణంమీద అన్వేషణజ్యోతిని (సెర్చ్‌లైట్‌ను) ప్రసారం చేసింది. దానిని చూచి పులకించిన యువకవి వెంకట

రావుగారు 'అన్వేషణజ్యోతి' అనే శీర్షికలో కొన్ని పద్యాలు చెప్పారు. అవి తర్వాత 1921 ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో ప్రచురితమయ్యాయి. ఆ పద్యాలలో నవకవి ప్రబంధ ధోరణి పరుగులువారింది.

"దివ్యతరకాంతి జాలము తేజరిల్ల
పాండుర గభస్తి చయములు పరిఢవిల్ల
చంద్రిక నడంచి సకలదిశల్ వెలింగె
యుద్ధ నౌకాగ్రమునను—డి యొక్క జ్యోతి.

"ఒకసారి పురసౌధ నికరాగ్రములనుండి
నిండారు వెన్నెల నీటుజూపు
ఒకమాటు పర్వత నికటోర్వి పైనున్న
కటిక చీకటి వెల్గుగా నొనర్చు
ఒకతేప దూరమౌ మత్తరాంభోనిధి
స్థంభాగమంత విస్పష్టపరచు
ఒకపాలి సంచరింపు బొడ్డున నిలుచున్న
చూపరులకు వింత చూఅబుచ్చు

మించిపై కెక్కు మున్నిటిమీద నక్కు
నల్లజలమెల్ల తెల్లగా నడగద్రొక్కు
పొదవురేనిక్కు నొక్కట నిడుపుతక్కు
దాని వర్ణింప నలవియె నూనవులకు !

"ద్యుతిదే నెంతటి సూక్ష్మవస్తువును విద్యుత్కాంత సంవ్యాప్తమై
యతి దూరంబున జూడగల్గుటను దా'నన్వేషణ జ్యోతి'యై
క్షితిపై గ్రాలెను దృష్టిమార్గమును గాంక్షించంగ నా జూపు నం
చిత పాశ్చాత్త్య కళా ప్రభావమును సూచించున్ మనోజ్ఞంబుగన్."

అన్వేషణజ్యోతిని చూచిన మీదటే కలిగిందో, అంతకుముందే కలిగిందో కాని, విశాఖపట్నం లైట్‌హౌస్ పయినకూడ పద్యాలుచెప్పే బుద్ధి కలిగింది ఆయనకు. 'సముద్రదీప స్తంభ గృహము' అనే శీర్షికలో ఆయన కొన్ని పద్యాలు చెప్పారు. అవీ 1918 నాటివే గనుక కొన్ని ఉదాహరించటం ఉచితం.

"పొలుచును విశాఖపురిని సముద్రతీర
మునను సందర్శించులో చొచ్చుకొనుచు ముక్కు
లాగు నొకకొండ నిలుచు నాంగ్లమున నదియు
పేరఁదాల్చెను నచట 'డాల్ఫినుసు నోసు.

ఇట్టి చిత్రము వేరొక రేవు పట్టణముల
నెచ్చటను గానరాదని మెచ్చుగొలుపు
కొండపైనను నొక స్తంభ ముండు దాని
పైన వెలగును నొక్కదీపంబు నదియు
పెద్ద రాంతరు పెట్టిన యుద్దినుండు
అద్దముల మధ్యలో కడు నిద్దముగను."

వెంకటరావుగారు 1924 లో విజయనగర కళాశాలలో విద్యార్థిగా వున్నప్పుడు జరిగిన సంఘటనలు రెండింటితో విద్వత్కవివరులకు సన్నిహితులయ్యారు 1924 లో తణుకులో మహోపాధ్యాయ ఆచంట సాంఖ్యాయన శర్మగారి అధ్యక్షతన ఆంధ్ర సాహిత్య పరిషత్తు 13వ విద్వత్సభ జరిగింది. అప్పటి విద్వత్సభలంటే ఇప్పటిలాగ ఎవరో ప్రసంగించడం, తక్కినవారు వినడం, వక్త ఏ అవాకులు చెవాకులు వాగినా, మనకెందుకులే అని ఊరుకుండడం కాదు. వక్త ఏతప్పు చెప్పినా వెంటనే శ్రోతలలోని పండితులు నిగ్గదీసేవారు. చర్చలు, వాద ప్రతివాదాలు సమస్యా పూరణాలు, ఆశుకవితార్థంబులు ఉండేవి తణుకు సభలో "రాణికి పాదములు పట్టు రాణ విధించెన్" అనే సమస్యనిచ్చారు ఎవరో. వెంకటరావుగారు దానిని

"ప్రాణికి నాయువు పట్టును,
వాణికి సరసమ్ము పట్టు, వరకంకణ సు
శ్రేణికి కైపట్టును, పా
రాణికి పాదములు పట్టు రాణ విధించెన్."

అని పూరించారు. తక్కిన పూరణాలను ఈ పూరణం తోసి రాజన్నది. పండితులు తల లెగురవేశారు. 1924 లోనే మద్రాసులో ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ తృతీయ వార్షిక సమావేశం జరిగింది. దానిలో వెంకటరావుగారు

నన్నెచోడునికాలం అనే శీర్షికతో ఒక పరిశోధనవ్యాసం వ్రాశారు. ఆ వ్యాసంలో ఆయన చరిత్రాంశాలు కూలంకషంగా చర్చించారు పండితులు తలలూపారు. ఈ రెండు సంఘటనలతో నిడుదవోలువారిపై విద్వత్కవుల, పరిశోధకుల చూపు పడింది. కాని ఆ చూపు కుదరలేదు ఆ చూపు కుదరడం- ప్రమాణబుద్ధి ఏర్పడడం తర్వాత పది సంవత్సరాలక్కాగాని జరుగలేదు.

ఈ పది సంవత్సరాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆయన 1925 లో పట్టభద్రులయ్యారు. ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో గుమాస్తాగా చేరారు. విచిత్రమైన సంఘటనలు పెక్కు- వెంకటరావుగారి మాటలలో నే రెండు సంఘటనలను ఇక్కడ ఉదాహరిస్తాను:- "గాంధీజీ 1929 లో భారతదేశ పర్యటనచేస్తూ విజయనగరం వచ్చారు. చాలమంది ఆయనను చూడడానికి వెళ్ళారు. మా నాన్నగారితోపాటు నేనూ వెళ్ళాను గాంధీజీ హిందీలో ప్రసంగిస్తూ, హిందీని ఎవరైనా మాట్లాడగలరా! అని ప్రశ్నించారు. వెంటనే మా నాయనగారు ఆయనతో హిందీ భాషలో మొదట నమస్కరిస్తూ, ధారాళంగా సంభాషించారు. ఆయన హిందీ వాగ్ధోరణికి మహాత్ముడు చాలా మెచ్చుకొన్నారు. మా నాన్నగారు ఆ సందర్భంలో చర్ఖాపంచకం అనే పద్యాలు చెప్పారు. గాంధీజీ ప్రసంగాన్ని నాన్నగారు తెలుగులోకి అనువదించారు. ప్రసక్తాను ప్రసక్తంగా ఆయన హింసపైన ఒక పద్యం చెప్పారు:

"హిందూభూమిని భిన్నభాషలకు దా నేకత్వమున్ గూర్చుచున్
పొందించున్ సమతైక్య భావమును భిన్నులైన్న దేశస్థులన్
హిందూ రాజ్య రమా సుభాషితమునై పేలాగతి న్వెల్గుగా
హిందీభాషను నేర్వగా వలయు జుం డీ భారతీయ ప్రజల్."

మా తండ్రిగారికి హిందీభాష వచ్చునని నాకుకూడ అంతకు ముందు తెలియదు. నా పెదతండ్రి జోగిరాజుగారు హిందీ భాషలో పండితులు. ఆయన ప్రతిదినమూ తులసీదాసు రామాయణమును పారాయణం చేసెడివారు.

"విజయనగరంలో కాంగ్రెస్ స్వర్ణోత్సవ సభ జరిగింది. కాంగ్రెస్ సంస్థపై పద్యాలు చదివాను. నన్ను భద్దరు శాలువాతో సత్కరించారు. ఆఫీసులో నాకు మరో సత్కారం జరిగింది. పై అధికారులు ఇలాంటి పనులలో పాల్గొన

వస్థలి వార్షిణంగు ఇచ్చారు. శృంగార గ్రంథమాల సంపాదకులు గంటి సూర్య నారాయణశాస్త్రిగారి 'కల్యాణి' పత్రికలో తరచు పద్యాలు, పరిశోధనవ్యాసాలు వ్రాసే వాడిని "

అహర్నిశలు సహర్నిశ చేయక గదపని సంసారం, బ్యాంకి ఉద్యోగం, నిత్య కృత్యాలకు కూడ నియమబద్ధమైన కాలపరిమితి, తండ్రిగారు సుందరం పంతులుగారి నుంచి సంక్రమించిన 'కాశీవళ సంపుట ప్రకర కాంతారం'లో నిర్విరామ పరిశ్రమ. వీటివల్ల ఆయన ధారణ పదునెక్కింది. ఏక సంతతోనే గ్రహించిన విషయాలు మెదడులోని అరలలో చేరి, అవసరమైనప్పుడు గూళ్ళ నుంచి గనగుఁనమంటూ వచ్చే పావురాలవలె వెలికి రావడం మొదలుపెట్టాయి. 1924 లో ఆయన రావిపాటి త్రిపురాంతకుడు రచించిన (13-14 శతాబ్ది) త్రిపురాంతకోదాహరణాన్ని గొప్ప పీఠికలో ప్రచురించడం, 1935 లో నంది కేశ్వరశాస్త్రి రచితమైన వీరశైవ సిద్ధాంత ప్రతిపాదకమైన వీరశైవ ప్రమా ణాష్టకావరణము అనే గ్రంథానికి ప్రామాణికమైన పీఠికను రచించడమూ జరి గాయి త్రిపురాంతకోదాహరణాన్ని సుగృహీత నామధేయులు మానవల్లి రామ కృష్ణ కవిగారు 1912 లో 'విస్మృతకవులు' శీర్షికతో అదివరకే ప్రకటించారు. కాని, వెంకటరావుగారు కవి కాలనిర్ణయాదులతోపాటు కావ్యస్థానం నిర్ణయించ డంలో అప్పటి గొప్ప పరిశోధకుల సరసన నిలబడ్డారు. ఈ రెండు పీఠికలూ ఆయనకు గొప్ప కీర్తిని తెచ్చాయి. ఇంతలో ఆయనకు విజయనగరం నుంచి కాకినాడకు తబాదలా ఆయింది. ఈ తబాదలా జీవితంలోనూ గొప్ప మార్పు తెచ్చింది. ఇలాటి ద్వంద్వాలు బ్యాంకిలో అంకెల సంకెళ్ళలో పడడం సమం జసం కాదనుకున్నారు పిఠాపురం రాజా సూర్యారావు బహద్దరువారు. గుమాస్తా పనికి రాజీనామా ఇప్పించి తమ కళాశాలలో తెలుగు ట్యూటరుగా నియమించారు. 1928న ప్రారంభమైన బ్యాంకి జీవితం 1932తో సమాప్తమైంది. సంవత్సరం పాటు కళాశాలలో పని చేసిన పిదప సూర్యారాయాంధ్ర నిఘంటువులో పద సంగ్రాహకులుగా చేరారు వెంకటరావుగారు.

ఈయనకు ఇప్పటికి సరియైన పని దొరికింది; చేతినిండా పని; నోటినిండా పని; మెదడునిండా పని. ఈయన ధారణకు నిఘంటు ప్రధాన సంపాదకులైన జయంతి రామయ్య పంతులుగారు, పండితులు వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

గారు విస్తుపోయేవారు. నిడుదవోలువారి దృష్టికి పడిన ప్రతిదానికి ప్రయోగం వెంటనే స్ఫురించవలసిందే, నేనూ చదివాను. అన్నట్టుకాక, ఈయనకు కంట బడ్డ ప్రతి విషయమూ ఒంటబట్టిపోవలసిందే. ఆయా గ్రంథాల ముద్రణాది వివరాలతోసహా ఏ విషయమైనా అడిగిందే తడవుగా చెప్పడంలో ఈయనకు ఈయనే సాటి. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుందన్న సామెతగా, ఒక్క పదం ప్రస్తావిస్తే, నన్నయ మొదలు నేటివాక అన్ని గ్రంథాలలోని ఆ పద ప్రయోగ సరళి నిర్ఝరపాతంగా మనపై దూకవలసిందే, ఝంఝూమారుతంగా మనపై వీచవలసిందే అందుకనే ఎవరో 'ఈయనకు' "ప్రయోగమూషిక మార్జాల" అనే బిరుదమూ ప్రసాదించారు. ఈయన తెలుగు సాహిత్యంలో మరచిందిలేదు, ఒడలు మరచి చదవిందిలేదు తెలుగు భాషలో ఏ మూల ఏము న్నదో చూపగల జగాదీవిటీ ఈయన. కనుక త్వరలో సూర్యారాయాంధ్ర నిఘంటువులో అసమగ్రమైన మూడవ సంపుటి సమాప్తి కావడానికి, నాల్గవ సంపుటి సిద్ధంకావడానికి కృషిచేశారు ఆ సమయంలోనే 1941 లో మద్రాసు విశ్వవిద్యాలయం ఎం ఎ. లో సర్వప్రథములుగా వచ్చి సువర్ణపతకం పొందారు. పిదప మరల పిఠాపురం రాజాకాలేజీలో సంవత్సరంపాటు పనిచేశారు. తర్వాత 1944 లో మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో సహాయోపన్యాసకులుగా చేరి, 1949 నుంచి తెలుగుశాఖాధ్యక్షులై, 1964 లో రీడరుగా పదవినుంచి విర మించారు. అనంతరం మద్రాసునుంచి హైదరాబాదుకు తరలి వచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో యూనివర్సిటీ గ్రాంట్సుకమిషన్ ప్రొఫెసర్‌గా నాలుగేళ్ల పని చేశారు 1982 అక్టోబర్ 15 రాత్రి కన్నుమూశారు.

వెంకటరావుగారి ప్రతిభ పరిశోధన, రచనా వ్యాసంగాల ప్రజ్ఞావాహిని 1940 నుంచి 1982 అక్టోబరు 10 వరకు అవిచ్ఛిన్నంగా నాలుగు దశాబ్దాల పాటు పెక్కుపాయలుగా ప్రవహించింది. ఈ ప్రజ్ఞావాహినిలో అనర్ఘరత్నాలు ఎన్నో కొట్టుకొని వచ్చి ఆంధ్రావళికి అందాయి. చివరి ఐదురోజులు మాత్రమే ఆయన ఏమీ వ్రాయలేదు. నన్నయభట్టు మొదలు నేటిదాకా ప్రముఖులైన వివిధ రంగాలవారిని కీర్తిస్తూ మనిషికొక పద్యంచొప్పున 2000 పద్యాలు చెప్పారు. "వెంకటేశ్వరా" అన్న మకుటంతో. ఇటీవల కీర్తిశేషులైన పార్ల మెంటు సభ్యులు హెచ్. వి కామత్‌కు పార్లమెంటులో అత్యధిక సంఖ్యాకు లతో, సన్నిహితమైన సంబంధం వుండేదట. వెంకటరావుగారికి నమకాలిక

కవిపండిత పరిశోధక రచయితలు వేలమంది సన్నిహితంగా తెలుసు, కనుకనే మనిషికొక పద్యం వ్రాశారు. చివరకు నామీద కూడ ఒక పద్యం ఉన్నట్టు ఆయన జ్యేష్ఠపుత్రుడు శివసుందరేశ్వరరావు చూపించారు, నేను పరామర్శకు వెళ్ళినప్పుడు నేను ఆశ్చర్యపోయాను! ఆ పద్యం ఇది:

"అరయగ ప్రాకృతంబునను నంచితరీతిని సంస్కృతంబునన్
గురుమతిశోధ తెల్గునను కోవిదుడై తగు రీతినెంతయున్
పరువడి వ్యాసరాజము లపారముగా రచియించె నద్ధిరా
తిరుమల రామచంద్రియును దీప్తిని మించెను వేంకటేశ్వరా."

ఆయన పెక్కు సభలలో సన్మానాలు పొందారు. ఆయనను షష్టి పూర్తి సందర్భంలో 'జంగమ విజ్ఞానసర్వస్వం' 'ఏకసంథాగ్రాహి' అనే బిరుదాలతో గౌరవించారు. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర చూచి ముగ్ధులై కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు 'పరిశోధన పరమేశ్వర' బిరుదంతో సత్కరించారు. వీరశైవ వాఙ్మయానికి ఆయన చేసిన సేవకు కానుకగా వరంగల్ వీరశైవులు ఆయనకు సువర్ణమంటా కంకణాలు బహూకరించారు. వీటన్నిటి మకుటాయమానంగా ఆంధ్రవిశ్వవిద్యాలయం 1978 లో ప్రత్యేక స్నాతకోత్సవంలో కళాప్రపూర్ణ బిరుదంతో సన్మానించింది. ఆంధ్రప్రదేశ్ గవర్నర్, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఛాన్సలర్ సమక్షంలో 1978 అక్టోబర్ 28న ఈ బిరుద ప్రదానసందర్భంలో పి. జగదీశ్వరరావు గారు వెంకటరావుగారి ప్రశస్తి చేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ 1976 జనవరి 18వ విశిష్టసభ్యత్వంతో గౌరవించింది. త్రిపురాంతకోదాహరణానికి తెలుగు భాషా సమితి (మద్రాసు) బహుమతి 1949 లో లభించింది. స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వ సత్కారం పొందిన తొలి తెలుగు గ్రంథం ఇదే. 'ఆంధ్ర వచన వాఙ్మయము' అనే వచన వాఙ్మయ చరిత్రకు 1956 లో తెలుగుభాషా సమితి బహుమతి లభించింది. "కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము" అనే గ్రంథానికి 1963 లోను, "విజయనగర సంస్థానము–సాహిత్యపోషణ" అనే గ్రంథానికి 1968 లోను రాష్ట్ర సాహిత్య అకాడెమీ బహుమతులు వచ్చాయి. [illegible] పేట ఆంధ్రసారస్వతపరిషత్తు విద్వత్సభలో విద్యారత్న బిరుదప్రదానం

చేశారు. కళాప్రపూర్ణ బిరుదప్రదాన సందర్భంగా- అభిమానులు చెన్నపురిలో జరిపిన సభలో

"ప్రథిత వేదము వేంకటరాయశాస్త్రి
పొందగా బుట్టిన కళాప్రపూర్ణ బిరుదు
సార్థకంబయ్యె సాహిత్య జగతి నేడు
నిడుదవోల్వేంకటరాణ్మనీషి వలన "

అని వివిధరీతుల పద్యాలతో ప్రశంసించారు. అరబ్బీ, పారసీక, సంస్కృ తాంగ్లాదిభాషలలో ఉద్దండపండితులు, ఖురాన్‌షరీఫ్‌ను సంస్కృతీకరించినవారు, సెషన్స్ జడ్జిగా వుండినవారు అయిన గుండేరావు హర్కారేగారు వేంకటరావు గారి ప్రతిభకు ముగ్ధులై చెప్పిన శ్లోకాన్ని కూడా ఉదాహరించడం అవసరం.

"నక్షత్రేషు యథా శశీ నిడదవోల్ శ్రీవేంకట శ్శాస్త్రవిత్
సంసత్స్వద్భుత తత్త్వశోధన కలా పూర్ణః సతాం వల్లభః,
అజ్ఞానం హరతి క్షణాత్ హృదయగం జ్యోత్స్నాం కిరన్ చిన్మయీం
జీయాద్దివ్య శరత్ శతం భగవతో విష్ణో ర్దయాలేశతః."

ఛాయాగ్రహణ యంత్ర సదృశమైన ధారణతో గ్రహించిందంతా ఒంట బట్టించుకొని, ఒంటబట్టినదంతా తరచిచూచి కొత్త విషయాలు కనుగొని, కనుగొన్నదానినంతా కనిపించిన వారికల్లా అందజేయాలనే ఉత్కంఠాపారవశ్యంతో గద్గదనదద్గోదావరిలా పారినీ వేంకటరావుగారి ప్రజ్ఞావాహినిని ప్రధానంగా పన్నెండు పాయలుగా విభజించవచ్చు: (1) కవితలు – ఖండకావ్యాలు: చాటువులు, (2) మౌలికపరిశోధన గ్రంథాలు, (3) మౌలిక పరిశోధనవ్యాసాలు, (4) ప్రాచీన గ్రంథపరిష్కరణం, (5) మెకంజీ రికార్డుల ఆంగ్లానువాదాలు, (6) పీఠికలు. (7) సమీక్షలు, (8) ఆంగ్లరచనలు, (9) రేడియో ప్రసంగాలు, (10) సభా ప్రసంగాలు, (11) అప్రకటిత రచనలు, (12) సభ్యత్వాలు.

## 1. కవితలు – ఖండకావ్యాలు :

1918 లో అన్వేషణ జ్యోతితో ఆరంభమైన వేంకటరావుగారి కవిత నిడుదవోలు వెంకటరమణ అనే పేరుతో సమకాలిక పత్రికలన్నింటినీ అలంకరించింది; మించుపల్లి – తెలుగుపొలుపు – (1969) లో

"జిలిబిలిసేత లొంటిపడు సిగ్గులు తగ్గులు పేరజంపుట
గ్గలికలు నింత నింత నెరగారవము ల్నెర జవ్వనంబునన్
కులుకు మెరుంగు జూపు తపకు ల్పైపకార తెలుంగు కబ్బముల్
పొలుపములైన క్రొత్తవలపుల్ తలపుల్ పొలపుల్ వెలార్చెడిన్."

అని ఆయనే అన్నట్టు నాలుగు దశాబ్దాలపాటు క్రొత్త వలపులు, తలపులు, పొలపులు వెలార్చింది. ఆయన మించుపల్లెలో ఇలా అన్నారు :

"గాదెయు బోదెయు గేదెయు
వేదనినాదంబు హోమవేదిక యావుం
బూదయు బాదును బాదుక
లేదని కన్పట్టు గృహము లే దచ్చోటన్."

జాతీయాలు, నుడికారాలూ తొణికిసలాడే ఈ ఖండకావ్యం—కావ్యమనే అందాము—ప్రాచ్యపట్టపరీక్షకు పాఠ్యగ్రంథంగాను ఉంది. ఆయనే దానికి చిన్న గద్యవ్యాఖ్య కూడ వ్రాశారు. పలువురు విద్వత్కవుల ప్రశంసలు పొందిం దీ కావ్యం. పానగల్లు రాజా శ్రీ పార్థసారథి రాయణిం వారు స్వయంగా వ్రాసిన ప్రశంసా లేఖవల్ల అప్పటి రాజకీయ నాయకులు గూడ దీని యెడల ఎంతగా ఆకృష్టులయ్యారో తెలుస్తుంది.

శ్రీశ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి వందనములు.

ఆర్యా, మీరు ప్రీతితో బంపిన గ్రంథములు రెండును చేరినవి. చాల సంతోషమైనది. కృతజ్ఞుడను.

చాల కష్టించి, శోధించి త్రిపురాంతకోదాహరణమును గురించి వ్రాసినారు. గ్రంథశోధనాసక్తులగు పండితులకు మిక్కిలి యుపయోగకరముగా నున్నది.

మించుపల్లి కేవలము శుద్ధాంధ్రమని తలంచితి. ఆవల జూడగా సంస్కృత పదములనుగూడ నుపయోగించి యున్నారు. అదియే మేలు. ఉప్పును బులుసు గలసిన రుచిగానుండునుగాని, ఒక్కొక్కటియేమైన రుచిగానుండవు. మించుపల్లె చదువరులకు జక్కని తెలుగుపలుకుల దెలిసికొనుటకు దోడ్పడుచున్నది.

'దినుసులందెల్ల మెత్తనివి పూలు' భావము మిక్కిలి చక్కగా నున్నది. చదువరుల మేలుకై ఇట్టి గ్రంథముల నింకను వ్రాయుదురని వేడెద.

పానగల్ మహల్
పానగల్లు
11-5-47

బుధజన విధేయుడు
పా. పార్థసారథి వ్రాలు

గుడివాడలోని ఆంధ్ర నలందా అనే సంస్థ వెంకటరావుగారిని 1959లో తృతీయ వార్షికోత్సవంలో సన్మానించింది. అప్పుడాయన 'ఆంధ్రనలందా' అనే మకుటంతో కందపద్య శతకం రచించారు. ఇది ప్రాచీన నవీనాంధ్ర కవులస్తుతి రూపమై ధారాళంగా సాగుతుంది.

"శృంగారాధ్యాత్మిక న
త్సంగతి వేవేలు చేసె సంకీర్తనలన్
రంగుగ దిరువెంకట విభు
నంగణమున నన్నమయ్య ఆంధ్ర నలందా!"

భాషారాష్ట్రోద్యమానికి ప్రాణాలు పణం పెట్టిన పొట్టి శ్రీరాములుగారిపై ఉదాహరణకావ్యం పొట్టి శ్రీరామోదాహరణము — రచించారు. కళికోత్కళికా విరహితమైన ఈ లఘుకావ్యానికి ఉదాహరణ వాఙ్మయంలో విశిష్టస్థానం వుంది

ఆయన చాటువులు, ప్రాసంగిక పద్యాలు వేలకొలది చెప్పారు. అవి చాల వరకు గ్రంథరూపం కాకపోయినా, ప్రచురిత మయ్యాయి. చిన్ననాటి సమస్యాపూరణం ఒకటి ఇదివరకే ఉదాహరించాను. ఒక చాటువు వర్తమాన దేశకాల పరిస్థితులను తెలిపేదిది:

"మంత్ర యుగంబునందు నసమానము దివ్యము యోగదృష్టియున్
తంత్ర యుగంబునందు బహుధా ప్రతిభాంచిత లౌక్యదృష్టియున్
యంత్రితమయ్యె నప్పు (డల) నంతట భారతదేశమందు నా
యంత్ర యుగంబు మించె ధనయంత్రమె రేబవలున్ భ్రమించెడున్."

నవీనులంతా చిన్నయసూరిపై కత్తికట్టారు. చిన్నయసూరి నియంత అని, సాహిత్య స్టాలిన్ అని అపవ్రగాదు దమ్మించ్యారు దానికి జవాబుగా వెంకట

రావుగారు వచన కవితలో ఒక ఖండిక వ్రాసి పెట్టుకున్నారు. (ఎందుకు ప్రచురించలేదో !)

"షేక్ మియాకీ గోకులాష్టమికీ
ఎంత సంబంధమో
సినీ రైటరుకి చిన్నయ సూరికీ
అంతే సంబంధం.

కుర్చీలో కూనిరాగాలు తీసినా,
కుక్కమీద కవిత్వం కట్టినా,
సినీ వాలిగా నిసిలో సుగ్రీవుండై
అరడీలు, గారడీలు పేరడీలు చేసినా
అన్నీ తెలిసిందనడం
చిన్నయయోగ్యత్వం.

సాహిత్యానికి స్టాలిన్‌గారికి
చాలా దూరం చాలా దూరం
దూరం దూరం.
అరుదర్లింకు సాహిత్యానికి
అంతకంటె ఎక్కువదూరం
ఆ అంగడిలో దూరడానికి
సరుకెక్కడిది ? పరువెక్కడిది ?"

రెండు దశాబ్దాలక్రితం గురుజాడ అప్పారావుగారి జననతిథి గురించి పెద్ద దుమారం రేగింది. వెంకటరావుగారు 'గురుజాడ జననతిథి' అనే శీర్షికతో గేయకవిత వ్రాసి పెట్టుకున్నారు. (దీనిని కూడ ప్రచురించినట్టు లేదు)

"నీ పుట్టిన దినమేదో
నీ కొడుకుకు తెలియదంట
దినచర్యను వ్రాసికొన్న
పుట్టు తేది మరచినావె
అప్పరావు చెప్పరావ
ఆందోళన పడుచుండగ !

అవసరాలకెట్లయితే
అమరినదీ ఒక్కతేది
నీ వ్రాతల కలదో లేదో
మా వ్రాతల కెక్కినది
నిజమేమొ ఎవ్వడెరుగు ?

నిన్న మొన్న నీ రూపము
కన్నులెదుట నున్న నీదు
పుట్టు తేది తెలియలేదు
పూర్వమున్న కవుల గుంపు
కాల నిర్ణయము చర లు
కలము వెంట ప్రవహించెను
కాకితములు నిండెనన్న
ఆశ్చర్యం బేమి కలదు ?

ఆంధ్రులకు నున్నదంత
ఆర్భాటము కాక ఏమి ?
అప్పరావు చెప్పరావ
ఆందోళన పడుచుండ."

నవకవిత్వం ఇలాగే కొనసాగించివుంటే బాగుండేదేమో అనిపిస్తుంది ఈ గేయాలూ, వచన కవిత చూస్తుంటే.

## 2. మౌలిక పరిశోధన గ్రంథాలు :

(అ) తెలుగు కవుల చరిత్ర : ఇంతవరకు వచ్చిన కవిచరిత్రలలో ఇది సమగ్రం, సాటిలేనిది. అజ్ఞాతయుగంనుంచి క్రీస్తుశకం 1250 వరకు వున్న కవుల చరిత్ర, సాహిత్య చరిత్రతోపాటువుంది. శాసన పద్యరచయితలను కూడ ఈయన కవులతో చేర్చి తెలుగులో నూతన సంప్రదాయం సృష్టించారు. ఇది తెలుగు బోధించే దేశవిదేశ విశ్వవిద్యాలయాలలో ప్రామాణికంగా గ్రహింప దగినది.

(ఆ) దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము : నాయకరాజులకాలంలోను, మహారాష్ట్రరాజుల కాలంలోను తమిళ, కర్ణాటక ప్రాంతాలలో వెలసిన తెలుగు వాఙ్మయ చరిత్ర ఇది. తంజావూరు, మధుర, పుదుక్కోటాది వివిధ రాజ్యాలలో విరబూసిన వివిధ సాహిత్యశాఖలను సమగ్రంగా చర్చించిన గ్రంథం. ఇదివరకు తంజావూరు ఆంధ్రనాయకులను గురించి, సాహిత్యం గురించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, కురుగంటి సీతారామయ్యగారు మొదలయినవారు వ్రాసినవి చాల సంగ్రహాలు. 800 పుటల ఈ ఉద్గ్రంథం దక్షిణాంధ్రయుగ సాహిత్యానికి అద్దంపట్టి, తర్వాతి పరిశోధనకు మార్గదర్శకం కావడమేకాక, యక్షగానాది దేశి రచనల ప్రత్యేక పరిశోధనలకూ దారిచూపింది. ఇవి రెండూ మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణలు. సుప్రసిద్ధ నాటకకర్త, మద్రాసు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి 1962 ఆగస్టు 28న ఆకాశవాణి మద్రాసు కేంద్రం నుంచి ప్రసంగిస్తూ, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయాన్ని బహుధా కీర్తించారు. "వెంకటరావుగారి గ్రంథంపై సమీక్ష- వారి విశాల దృష్టికి, పరిశోధన ప్రజ్ఞకు, సాహిత్య జ్ఞానానికి తార్కాణమిది దక్షిణాంధ్రరచనలలో అసభ్య శృంగారం ఎక్కువగా వున్నదన్న అపనింద పూర్తిగా తొలగించారు. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమును గురించి ఇంత అమూల్యగ్రంథము రచించిన నిడుదవోలు వెంకటరావుగారిని, సాహిత్య ప్రియులందరు కొనియాడవలెను. ఇట్టి ఉత్కృష్ట గ్రంథాన్ని ప్రకటించిన మద్రాసు విశ్వవిద్యాలయం వారూ ప్రశంసార్హులు"

మధురై విశ్వవిద్యాలయ వైస్ చాన్స్‌లర్ డాక్టర్ ఎం. వరదరాజనార్ ఈ గ్రంథాన్ని ఇలా కొనియాడినారు : 17-8-19[illegible]1.

"ది సదరన్ స్కూల్ ఇన్ ది తెలుగు లిటరేచర్ - అనే మీ అమూల్యమయిన ప్రచురణ నేను ఎరిగినదే. అది తెలుగు పండితులకే కాకుండా తమిళనాడు చరిత్రకారులకు కూడా ఉపయోగకరంగా ఉంటుంది. అది తెలుగు విశ్వవిద్యాలయాలన్నిటిలోనూ వాడబడటం, రెండు పరిష్కరణలు వెలువడటం నాకు సంతోషాన్ని కలిగిస్తోంది."

(ఇ) ఆంధ్రవచన వాఙ్మయము : తొలి తెలుగు శాసనం మొదలు 1900 వరకు వున్న వచనవాఙ్మయ చరిత్ర. దీనికి 1958లో తెలుగుభాషా సమితి బహుమతి లభించినది.

(ఈ) కర్నాటాంధ్రముల పరస్పర ప్రభావము : ఇది కన్నడ, తెలుగు భాషాసాహిత్య సంస్కృతుల పరస్పర సంబంధాన్ని, నన్నయకు పూర్వంనుంచి జరిగిన ఆదానప్రదానాలను తెలిపి ఉభయ ప్రజలకు సమైక్యం సాధించే ఉత్తమ గ్రంథం. ఇది 1962లో రాష్ట్రసాహిత్య అకాడెమీ బహుమతిని అందుతుంది.

(ఉ) విజయనగర సంస్థానము - సాహిత్య పోషణ : ఇది విజయనగర సంస్థానాధీశులైన ఆనంద గజపతి మున్నగు సాహిత్యాభిమానులు, పోషకులు చేసిన సాహిత్య సేవను వర్ణిస్తుంది. వెంకటరావు గారు విజయనగరం వారు గనుక, ఆయన నాన్నగారు గురుజాడ అప్పారావు గారితోపాటు సంస్థానంలో పనిచేసినవారు గనుక, పెక్కు ఆసక్తికర విషయాలు తెలిపారు. దీనికి కూడ రాష్ట్ర హహిత్య అకాడెమీ బహుమతి 1963 లో లభించింది.

(ఊ) భాషా పరిశోధన - ప్రయోగవిశేషాలు : నిఘంటువుల కెక్కని అపూర్వ ప్రయోగాల అమూల్య గ్రంథమిది. మహావైయాకరణులు పర్యుల దిన సితారామస్వామిశాస్త్రిగారు దీనిని ప్రశంసిస్తూ "కాల్డ్‌వెల్‌ను విమర్శించుచు నొక ద్రావిడ వ్యాకరణమును వ్రాయ గుతూహలము గలదు. దానికి మీతోగూడి మీవంటివా రొకరును, విద్వాన్ వెంకటరాజులు రెడ్డిగారి వంటివారల సహకారా లుండవలయును." అని 1951 ఫిబ్రవరి 26న ఒక ఉత్తరం వ్రాశారు.

(ఋ) చిన్నయసూరి జీవితము – హిందూధర్మశాస్త్ర సంగ్రహము : చిన్నయసూరి శతజయంతి సందర్భముగా రచించిన చిన్నయసూరి జీవిత చరిత్ర ఇది. దీనితోపాటే, ఇదివరకు లభ్యంకాని హిందూ ధర్మశాస్త్ర సంగ్రహమనే చిన్నయసూరి అనువాద గ్రంథాన్ని ప్రచురించారు. ఈ అనువాదం లండన్ లోని బ్రిటిష్ మ్యూజియంలో ఉండగా, దాని మైక్రోఫిలిం నకలు తెప్పించి, ప్రచురించారు. చిన్నయసూరికి, వెంకటరావుగారికి శాశ్వతాశీయంగా విశ్వవిద్యా లయ సేవాకాలంలో పోలికలున్నాయి. చిన్నయసూరి 1848 నుంచి 1862 వరకు పనిచేయగా, వెంకటరావుగారు 1944 నుంచి 1864 వరకు చేశారు.

(ఋ) ఉదాహరణ వాఙ్మయ చరిత్ర: 1945 లో త్రిపురాంతకోదాహరణానికి పీఠిక వ్రాసిన అనుభవంతో ఉదాహరణ వాఙ్మయచరిత్రకు పూనుకొని, యావదాంధ్రవళి ప్రశంసాపాత్రంగా రచించారు ఉదాహరణ కావ్యాలు తెలుగులోనే ఉన్నాయి ఎక్కువగా. ఈ గ్రంథం ఉదాహరణ వాఙ్మయ క్రమాభివృద్ధిని వర్ణిస్తుంది. వెంకటరావుగారి రచనలన్నీ ఒక ఎత్తు, ఉదాహరణ వాఙ్మయం ఒక ఎత్తు అని అన్నా అనుచితంకాదు. రెండు దశాబ్దాలుగా మరుగుపడిన ఉదాహరణ వాఙ్మయశాఖను ఈయన పునరుద్ధరించి విశ్వనాథ సత్యనారాయణగారువంటివారు ఈ శాఖను చేపట్టే విధంగా ఉదాహరణ వాఙ్మయ చరిత్ర మూలంగా ప్రవర్తింపజేశారు. నాటినుంచి ఈనాటి వరకు దాదాపు 40 మంది కవులు ఈ శాఖలో రచనలు సాగించి ఈయనను ఉదాహరణ వాఙ్మయోద్ధారక అని కీర్తించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రథమ కులపతి డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి "ఇది గొప్ప చారిత్రిక పరిశోధన; సాహిత్య విమర్శ". అని ముక్తకంఠంతో ప్రశంసించారు.

(ఎ) పోతన – దీనిని నేషనల్ బుక్ ట్రస్టువారు (న్యూఢిల్లీ) ప్రచురించారు – 1961.

(ఏ) నియోగి సర్వస్వము: నియోగిశాఖ పుట్టుపూర్వాల వివరాలున్న గ్రంథం. దీనిని హైదరాబాద్ నియోగి మహాసభవారు ప్రచురించారు.

(ఐ) కొప్పరపు కవుల చరిత్ర: ఆశుకవితకు, శతావధానానికి పేరు పొందిన కొప్పరపు సోదరుల చరిత్ర ఇది. దీనిని నియోగి మహాసభ ప్రచురించింది.

## 3. మౌలిక పరిశోధన వ్యాసాలు:

వెంకటరావుగారు దేశంలోని భారతి, సాహితి, త్రిలింగ, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం, కళ్యాణి, నా సంపాదకత్వంలో వెలువడిన పరిశోధన మున్నగు పత్రికలకేగాక, మద్రాసు విశ్వవిద్యాలయంవారి అన్నల్స్ ఆఫ్ ఓరియంటల్ రీసెర్చ్‌వంటి సంచికలకు, కళింగసంచిక, కాకతీయసంచిక, రెడ్డి సంచిక వంటి చరిత్రాత్మక సంచికలకు, పెద్దల సన్మాన సంచికలకు దాదాపు

పదారు వందల వ్యాసాలు వ్రాసి వుంచారు. అవి చాలావరకు భాషావాఙ్మయ, కవిచరిత, దేశగ్రామ, ప్రజాచరిత్రలకు సంబంధించినవే. పదప్రయోగాలను గురించి చర్చ విశేషంగా చేశారు. కవిచరిత్రలలో లేని పలుపురు పెద్దలను గురించిన పెక్కు విశేషాలు వీటివల్ల తెలుస్తాయి. వ్యాసాల్లో సంస్కృత వాఙ్మయానికి సంబంధించిన మౌలిక వ్యాసాలూ వున్నాయి. తెలుగు భాషాసమితి వారి విజ్ఞాన సర్వస్వానికి పెక్కు వ్యాసాలు వ్రాశారు. తమిళకజగం ప్రచురించిన కమిళ్‌కలైకలంజానికి (తమిళ విజ్ఞాన సర్వస్వానికి) తెలుగు సాహిత్య, చరిత్ర, భాషాసంస్కృతులను గురించి చాలా వ్యాసాలు వ్రాశారు. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశానికి కూడ పెక్కు వ్యాసాలు వ్రాశారు. ఇన్ని వ్యాసాలు వ్యాసిన వారు మరే పరిశోధకులూ లేరు.

భారతి మాసపత్రికతో ఆయనకుగల సంబంధం ప్రత్యేకంగా పేర్కొనదగ్గది. వెంకటరావుగారు వ్రాసిన ప్రతి అక్షరాన్నీ భారతి, ఉగాది సంచిక, ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం ప్రచురించాయి. కేవలం ప్రయోగాలేకాక, ప్రజలకు ఆసక్తి కలిగించే విషయాలు వెంకటరావుగారి లేఖినినుంచి రావాలని అప్పటి సంపాదకులు శ్రీ శివలెంక శంభు ప్రసాదుగారి కోరిక. ఆ విషయాన్నే ఆయన వెంకటరావుగారికి వ్రాసిన ఒక లేఖలో తెలియజేశారు.

భారతి కార్యాలయం
మద్రాసు, 30-6-64

శ్రీ వెంకటరావుగారికి
నమస్కారములు

మీరు నాకు హైదరాబాదులో స్వయంగా ఇచ్చిన వ్యాసం జులై నెల భారతిలో రాగలదు.

ఒక మనవి ఇలాంటి వ్యాసాలుకాక సాహిత్యంలో ప్రజలకు అభిరుచి కలిగించే వ్యాసాలు వ్రాసిన మంచిది. పదప్రయోగాలు, యతిప్రాసలు మొదలైన వాటిని గురించి వ్రాయవద్దని మనవి.

చిత్తగించవలెను.
శంభుప్రసాదు.

ఇలా వ్రాయడంలో ఉద్దేశం ప్రజలకు వెంకటరావుగారు దగ్గరగా వుండాలనే. మరొక ఉత్తరం శంభు ప్రసాదుగారికి వెంకటరావుగారి ఎడల సౌజన్యం, గౌరవం ఎంత నిండుగా వున్నాయో తెలుపుతుంది.

మద్రాసు,
11-6-71.

శ్రీ వెంకటరావుగారికి
నమస్కారములు.

ఆ. భా. తెలుగు రచయితల మహాసభవారు తమకు సన్మానం చేయుట ఎంతో సమంజసముగా నున్నది. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారిని ఆ సందర్భంలో తమరు స్మరించుట సమంజసముగానే యున్నది. కాని నాకు మీరు ఋణపడియన్నాననుట ఏమాత్రమూ సమంజసముగా లేదు. మీరే నాకూ, భారతికి కూడ పెద్ద అండ. మీ సద్భావమున్న చాలు.

చిత్తగించవలెను
శివలెంక శంభుప్రసాదు.

## 4. ప్రాచీనగ్రంథ పరిష్కరణ :

ప్రాచీన గ్రంథ పరిష్కరణలో మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగార్లకు దీటైన వెంకటరావుగారు విపుల పీఠికతో పరిష్కరించిన ప్రాచీన గ్రంథాలు కోకొల్లలు. పీఠికలు వ్రాయడం మనకు పాశ్చాత్యులనుంచి సంక్రమించిన పద్ధతి. బెర్నార్డ్‌షా పీఠికలు సుప్రసిద్ధాలు. ఆయన "మిరాక్యులస్ బర్త్ ఆఫ్ ఎ లాంగ్వేజ్" అనే పుస్తకానికి వ్రాసిన పీఠిక పుస్తకాన్ని మించి పోయింది. వెంకటరావుగారు బెర్నార్డ్‌షాలాగ మొదట్లో బ్యాంకులో పనిచేశారు. పీఠికలూ పెద్దవి వ్రాశారు. కనుక ఆయనను ఆంధ్ర బెర్నార్డ్‌షా అని అప్పులు అనడం కద్దు. ఆయన బృహత్పీఠికలతో పరిష్కరించిన ప్రబంధాలను మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం, తంజావూర్ సరస్వతీమహల్ లైబ్రరీ, వావిళ్ళ రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, ఆంధ్ర గ్రంథమాల మున్నగు సంస్థలు ప్రచురించాయి.

పరిష్కరించిన పుస్తకాలు కొన్ని : (అ) ఖడ్గలక్షణ శిరోమణి, ఇదొక అపూర్వ శాస్త్రగ్రంథం. ప్రచురణ మ ప్రా ఖాం. (ఆ) విద్యావతీ దండకం, మ. ప్రా. ఖాం. (ఇ)కట్టా వరదరాజు రామాయణం నాలుగు సంపుటాలు, త. ప. (ఈ) రాజగోపాలవిలాసం కాళకవి రచించిన ఈ ప్రబంధం ఏకైక ప్రతి లభించింది. పీఠిక పెక్కు చారిత్రికాంశాలతో అపూర్వమైంది. త. స. (ఉ) శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యుడు. కృష్ణాపత్రిక ప్రచురణ, (ఊ) అన్యవాద కోలాహలము - ఏకామ్రనాథుడు. వా. రా. (ఋ) నన్నిచోడుని కుమారసంభవము. వా. రా. (ౠ) పాల్కురికి సోమనాథుని బసవపురాణము. ఆంధ్ర గ్రంథమాల. (ఎ) నాచనసోముని ఉత్తరహరివంశము, వా.రా. (ఏ) ఉత్తర హరివంశం తృతీయాశ్వాసం నవ్యాఖ్యానం, విజయభాస్కర పబ్లికేషన్స్, (ఐ) భాస్కర రామాయణము, వా రా. (ఒ) ఆంధ్రమహాభాగవతము, వా. రా. (ఓ) విప్రనారాయణ చరిత్ర - చదలవాడ మల్లన, ఆంధ్ర సాహిత్య పరిషత్తు. (ఔ) నాదిండ్ల గోపకవి కృష్ణార్జున సంవాదము. వా. రా. (అం) వసుచరిత్ర, వా. రా. (అః) ధనాభిరామము, (క) వాల్మీకి చరిత్ర - తంజావూరు రఘునాథరాయలు, ఆంధ్ర విజ్ఞానసమితి, (ఖ) కదిరీపతి శుకసప్తతి, వా. రా. (గ) యాజ్ఞవల్క్య చరిత్ర, (ఘ) సత్యభామాసాంత్వనము శృంగార కావ్య మండలి, (ఙ) రాధామాధవసంవాదము. ఆం. వి. స. (చ) సీతారామాచరిత్ర ఆ. సా. ప. (ఛ) భగవద్గీత, వా.రా. (జ) అమరుకం-శిష్టు సర్వశాస్త్రి, (ఝ) సకల నీతి సమ్మతము, రాష్ట్ర సాహిత్య అకాడెమీ, (ఞ) ప్రబంధమణి భూషణము, రా. సా. ల. (ట) చారుచర్య, వా. రా. (ఠ) శ్రీ వేంకటేశశతకము- తాళ్ళపాక అన్నమయ్య, వా. రా. (డ) శతక సంపుటం, రా. సా. ల. (ఢ) కవి జనాశ్రయం, వా.రా. (ణ)ఛందోదర్పణం, వా.రా. (త) లక్షణ సార సంగ్రహం, ఆ. సా. ప. (థ)అప్పకవీయం, వా.రా. (ద) కవి సంశయ విచ్ఛేదము, వా.రా. వ్యాకరణాలు: (ధ) పట్టాభిరామ పండితీయము, న) రావిపాటి గురుమూర్తిశాస్త్రి వ్యాకరణం, (ప) ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణం, (ఫ) లఘు వ్యాకరణం, (బ) ప్రౌఢ వ్యాకరణం, వా.రా. (భ) ఉద్భటారాధ్య చరిత్ర, (మ) బసవోదాహరణం (సంస్కృతం — పాల్కురికి సోమనాథుడు) ఆ. సా. ప. (య) శబ్దరత్నాకరం-బహుజనపల్లి సీతారామాచార్యుల నిఘంటువు. అదనంగా పదివేల పదాలను అనుబంధంగా ఇచ్చారు. బైబిల్ సొసైటీ.

వెంకటరావుగారి గ్రంథ పరిష్కరణ పద్ధతి ఎలా వుంటుందో మిత్రులు మన్నవ ఉపేంద్రరావు గారు చక్కగా తెలిపారు. దానిలోని ముఖ్యాంశాలు తెలియజేస్తాను: "శ్రీ నిడుదవోలు వారి పరిశోధన తీరు ఎలా వుంటుందని ఆసక్తి కలగటం సహజం అది ఏవిధంగా తెలుసుకోవాలంటే ఆ గ్రంథాలన్నీ చదవాలి, ఆ గ్రంథాలంత గ్రంథం వ్రాయాలి. ఐతే ఒక మెతుకు పట్టి చూచి నట్టుగా, వారు శివతత్త్వసారమునకు వ్రాసిన పీఠికను అతి క్లుప్తంగా చూద్దాం. శివతత్త్వసారమనేది ముందు ఏ రూపంలో ఎవరికి దొరికింది, తాళపత్రప్రతి, దానికాలం, వ్రాతప్రతి, ముద్రితప్రతులు – ఇప్పటికెన్ని, ఎవరెవరివలన ఏయే కాలాల్లో ముద్రిత మయాయి. కన్నడ శివతత్త్వ సారం ఎప్పుడు, ఎవరు బయట పెట్టారు. దానివల్ల కలిగినమేళ్లు, నష్టభాగ పూరణము, అర్థసంస్కరణ, యతి సంస్కరణము, గ్రంథకర్తృత్వము, పండితారాధ్యుల కాలనిర్ణయము, దానికాధార భూతమైన కథలు, శాసనాలు, వానివాని సమన్వవధి, పండితారాధ్యుల జీవిత చరిత్ర, వారి సంతతి, శివతత్త్వసారకృతికర్త, నన్నెచోడుని కృతిభర్త, ఒక్కరే యని నిరూపణ పండితుని మిగిలినకృతులు. అక్షరాంకగద్య, (ఇది అముద్రితం గనుక మొత్తం వ్రాశారు. ఇలాగే స్తుతి శ్లోక పంచకం, పర్వతాష్టకం, శివశరణ పదము మొత్తల ఇచ్చారు.) అలభ్యకృతుల జాబితా. శివతత్త్వసార కావ్యత్వచర్చ, కందపద్య రచన, శివతత్త్వసారానికి అనుకరణలు, సంస్కృత సాహిత్యంలో శివతత్త్వసారము, శివభక్తులుగా సంస్కృత మహాకవులు, పండితత్రయము, బసవవాఙ్మయము, భక్తులకథలు, ఛందోవిశేషాలు, వలపలగిలక, వ్యాకరణ విశేషాలు, పండితారాధ్యుని ప్రశస్తి, సాహిత్యము, మతసంప్రదాయాలు – ఇలా వరదనీరులాగ బండ్లనుముంచి, అడ్డమువచ్చినవాన్ని, చుట్టుపక్కలదాన్ని అంతా లాక్కుంటూ, నురుగులతో ఉరుకుతూ పారుతుంది. అసలు విషయం కంటే చుట్టుపట్ల విషయం ఎక్కువగా వున్నదే అనిపిస్తుంది. కాని నిజం కాదు. ప్రసక్తాను ప్రసక్తంగా వచ్చిన చుట్టుపట్ల విషయాలకంటె అసలు విషయమే అత్యధికం. అర్థసంస్కరణము– అనే విషయంకింద 'అన్నదు' అన్న దానిని గూర్చి, పూర్వపీఠికలో వున్న పొరపాటునుగూర్చి దాని అర్థనిర్ణయంలో శ్రీ వెంకటరావుగారి బహుభాషానేతృత్వము, పరిశోధక సామర్థ్యము తెలియడమే గాక సంప్రదాయ విజ్ఞతకూడ స్పష్టమౌతుంది. పూర్వముద్రణలో

నిన్నెరుగుచు దన్నెరుగని
యన్నడు శివయోగమగ్న డనబడు మదిలో
నిన్నును దన్ను నెరింగెడి
యన్నడు శివయోగమగ్న డనబడును శివా.

అని ఉన్నదనీ, దాని పీఠికలో అనాడు అనుటకు అన్నడు, మలహడు అనుటకు మలహు అను మారు రూపములు కానవచ్చుచున్నవి. అనువాక్యము కలదని, ఆ అభిప్రాయ పొరపాటని "కన్నడభాషలో అన్నన్, అన్నళ్ అనగా అలాంటి వాడు, అలాటిస్త్రీ అను నర్థములు కిట్టెల్ నిఘంటువులో నున్నవి. కన్నడమున అన్నన్ తెలుగున అన్నం 'డు' అన్నడు అని రూపాంతరము చెందినది. అని వ్రాశారు సిడుదవోలువారు. అద్వైతయోగులు తమ్మ మరచి బ్రహ్మనుమాత్ర మెరుగుదురు. ఆవిధంగా నిజస్థితిని తెలుసుకోరు. అది సరిగాదు. శివయోగులు శివుని, కన్ను కూడ యోగస్థితిలోగూడ తెలిసివుంటారు. కనుక పై పద్యం

నిన్నెరుగుచు దన్నెఱుగని
యన్నడు శివయోగిమగ్నడనబడ దెపుడున్
నిన్నును దన్ను నెరింగెడు
యన్నడు శివయోగమగ్న డనబడును శివా.

అని ఉండాలని తీర్మానించారు. వారి రచనలు మొత్తం చూస్తే ఇలాటి అధికార నిర్ణయాలు అసంఖ్యాకంగా కనిపిస్తాయి...." (1973-11-8 కృష్ణాపత్రిక)

## 5 మెకంజీ రికార్డులు :

గడచిన శతాబ్దంలో సర్వేయర్ జనరల్‌గావున్న కర్నల్ కాలిన్ మెకంజీ నారాయణరావు, వెంకటరావు అనే మహామేధావులను నియమించి దక్షిణాపథం లోని, ముఖ్యంగా తెలుగుదేశంలోని మారుమూల పల్లెల వివరాలు సేకరించారు. వీటిని లోకల్ రికార్డ్స్ అంటారు. వీటిలో ఆనాటివరకువున్న తెలుగుజాతి సర్వస్వం నిక్షిప్తమై వుంది. ఇవి 200 సంపుటాలలో వున్నాయి. ఇవే దక్షిణ భారత చరిత్రకు, ముఖ్యంగా తెలుగునాడు చరిత్రకు మూలాధారం. ఈ రికార్డు లలో ఎక్కువభాగం తెలుగులో వుంది వెంకటరావుగారు చరిత్రలోను, తెలుగు

లోను నిష్ణాతులుగనుక వాటిని ఆంగ్లంలోకి అనువదించేపనిని మద్రాసు విశ్వ విద్యాలయంలో జూనియర్ లెక్చరర్‌గా వున్నప్పుడు స్వీకరించారు. ఆయన 96 సంపుటాల విషయాలను - దాదాపు సగం సంపుటాల విషయాలను - ఆంగ్లంలో సంక్షేపించారు. దీనివల్ల చరిత్రకు మహోపకారమైంది.

## 6. పీఠికలు :

ఆధునికుల పెక్కు గ్రంథాలకు వెంకటరావుగారు పీఠికలు వ్రాసి వాటి శోభను ఇనుమడింపజేశారు. (అ) వీరశైవ సముచ్చయం - వీరశైవ సంప్రదాయానికి చెందిన గ్రంథం - భాస్కరలింగశాస్త్రి, (ఆ) మూలస్థానేశ్వరస్తుతి శతకం - తిరుపతి వేంకటకవులు సంస్కృతం, (ఇ) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర - వంగూరు సుబ్బారావు, (ఈ) శతకవుల చరిత్ర - వంగూరి సుబ్బారావు, (ఉ) దుర్గాధిపతులు - కె. వెంకటరాయశర్మ, (ఊ) అష్ట దిగ్గజ కవులు - కె. ఎస్ కోదండరామయ్య (మాజీ మద్రాసు ఎం.ఎల్ ఎ), (ఋ) అడిదము సూరకవి - ఎ. ఎన్. రామారావు, (ౠ) చిత్ర రత్నాకరం - జి. శ్రీరామ మూర్తి, (ఎ) ఛందోరీతులు - రావూరి దొరస్వామిశర్మ, (ఏ) కఠోపనిత్ - వి. వరలక్ష్మి, (ఐ) ఇవంతా - కె. హనుమంతరావు, (ఒ) మా మహారాజా వారితో దూరతీరాలు - కె వెంకటరావు, ఇది పిఠాపురం మహారాజుగారి విదేశ యాత్రాచరిత్ర, (ఓ) జానుతెనుగు - డాక్టర్ పల్లమూడి గోపాలకృష్ణయ్య, (ఔ) మానవల్లి రచనలు - డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు సంకలనం, (అం) అమరుకం - ఎ వెంకటేశ్వరశర్మ, (అః) పుష్పరాజ విలాసము - భట్టారం మల్లిఖార్జున, (క) దీపసభ - డాక్టర్ బోయి భీమన్న, (ఖ) గణేశ్వరీయం - కె. యస్. రఘురామస్వామి. ఈ పీఠికలో గాణాపత్యానికి సంబంధించిన అమూల్య విషయాలు చెప్పారు. (గ) దాశరథీశతకం - డాక్టర్ దాశరధి కృష్ణమాచార్యులు, (ఘ) షట్పదీమేఘసందేశం - జి. వీరయ్య - 17వ శతాబ్దంనుంచి వున్న మేఘ సందేశాల అనువాద చరిత్రను వివరించారు. (ఙ) గోవింద రామాయణము - ఆత్మకూరి గోవిందాచార్యులు. ఈ పీఠిక తెలుగులోని రామాయణ సాహిత్య సమీక్ష (చ) గిడుగు వంశవృక్షము - గిడుగు లక్ష్మీకాంతమ్మ, (ఛ) వీరభారతం - వి. లక్ష్మీపతిరావు, (జ) పారాశరీయ హోర - విజయ

రామ గజపతి, (ఝ) తిక్కన-పూమారు సుబ్బారావు, (ఞ) ఎస్త్రేర. (నాటక)- బి. పురుషోత్తం (ట) విక్రమాంకదేవ చరిత్ర - శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి.

## 7. సమీక్షలు :

వెంకటరావుగారు వివిధ పత్రికలవారు పంపిన గ్రంథాలను (వందల కొలది) సమీక్షించారు. ఎక్కువగా భారతి మాసపత్రికలో సమీక్షలు వెలువడ్డాయి తెలుగుదేశంలో గ్రంథ సమీక్ష అంటే ప్రత్యక్ష విరోధమే. విమర్శను సహించని తెలుగుజాతి లోపమది. వెంకటరావుగారు ప్రతి విషయంలోను ప్రామాణికత్వం కోరేవారు గనుక సమీక్షలను కొంత కరకుగానే జేసేవారు. దానివల్ల ఆయనకు పలువురు శత్రువులయ్యారు. సత్యంబ్రూయాత్ ప్రియం బ్రూయాత్ - అనే స్వభావం కాదు వారిది. సత్యం ఎప్పుడూ నిప్పే గనుక, పరుషంగావుంటే ఏం ? - అన్నది వారి భావం.

## 8. ఆంగ్ల రచనలు :

వెంకటరావుగారు చక్కని విక్టోరియన్ ఇంగ్లిషు వ్రాసేవారు. జర్నల్ ఆఫ్ ది మద్రాసు యూనివర్సిటీకి, ఓరియంటల్ కాన్ఫరెన్సులకు ఆయన ఆంగ్లంలో అమూల్యమైన మౌళికవ్యాసాలు వ్రాసి ఆంధ్రేతరులకు తెలుగు గొప్పదనాన్ని, వారికి తెలియని వారి భాషల విషయాన్ని తెలిపారు.

[అ] కులశేఖర ఇన్ తెలుగు, [ఆ] ది లిటరరీ అండ్ ఫిలసాఫికల్ వర్క్స్ ఆఫ్ తరిగొండ వెంకమాంబ, [ఇ] తెలుగు లిటరేచర్ అండర్ మైసూర్ రూలర్స్ [ఈ] డిసర్టేషన్ ఆఫ్ తెలుగు లాంగ్వేజ్ బి. యి. ఎల్లిస్, [ఉ] హిస్టరీ ఆఫ్ తెలుగు లింగ్విస్టిక్స్, [ఊ] త్రీ డికేడ్స్ ఆఫ్ తెలుగు ప్రోజ్, [ఋ] స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ తెలుగు లింగ్విస్టిక్స్, [ౠ] పయనీర్స్ ఆఫ్ ఇంగ్లీష్ రయిటింగ్ ఇన్ ఇండియా, [ఎ] ది డేట్ ఆఫ్ నన్నెచోడదేవ, [ఏ] ఏజ్ ఆఫ్ శ్రీనాథ ఇన్ తెలుగు లిటరేచర్, [ఐ] ఆంధ్రభోజ ఎ. త్యాగరాజ మొదలియార్, [ఒ] తమిళియన్స్ కంట్రిబ్యూషన్ టు తెలుగు లిటరేచర్, [ఔ] తెలుగు ఇన్ఫ్లుయన్స్ ఇన్ ది సౌత్, [అం] ఎల్లిస్ కంట్రిబ్యూషన్ టు ద్రవిడియన్ ఫయిలాంజీ, [అః] తెలుగు అండ్ కన్నడ లిటరేచర్, [క] విచిత్ర

రామాయణ ఇన్ తెలుగు, ఇంటర్‌నేషనల్ ఓరియంటలిస్ట్స్ కాన్ఫరెన్స్‌కి పంపిన వ్యాసాలు : [ఖ] జీనియస్ ఆఫ్ తెలుగు లాంగ్వేజ్ ఎండ్ లిటరేచర్ [గ] మయూరాస్ సూర్య శతక ఇన్ తెలుగు లిటరేచర్, [ఘ] తెలుగు లెక్సికోగ్రఫీ [ఆలిండియా లింగ్విస్టిక్స్ కాన్ఫరెన్స్]. [జ] రామాయణ ఇన్ తెలుగు లిటరేచర్ [ఆల్ ఇండియా పి. ఇ. ఎన్. కాన్ఫరెన్స్] [చ] త్రీ డికేడ్స్ ఆఫ్ తెలుగు ప్రోజ్ [ఆకాశవాణి సాహిత్య సమ్మేళన్] [ఛ] ఎ సర్వే ఆఫ్ గ్రమాటికల్ లిటరేచర్ ఇన్ తెలుగు, [జ] తెలుగు స్క్రిప్ట్ రిఫార్మ్ సెమినార్ [ఝ] వసంత రాజీయం-కె. బి. పాఠక్ కమ్మెమొరేషన్ వాల్యూమ్. [ఞ] కృష్ణదేవరాయ ఎండ్ హిస్ లిటరరీ సర్కిల్ — విజయనగర సెక్సెంటినరీ వాల్యూమ్, [ట] మయూర శతక — కె. వి. రంగస్వామి అయ్యంగార్ కమ్మెమొరేషన్‌వాల్యూమ్, [ఠ] తమిళ్ పోయెట్స్ ఎండ్ పాట్రన్స్ ఆఫ్ తెలుగు లిటరేచర్ — ప్రొఫెసర్ ఆర్ సేతుపిళ్ళె కమ్మెమొరేషన్ వాల్యూమ్, [డ] లిటరరీ జర్నలిజమ్ [తెలుగు] వి. ఆర్. నార్ల షష్ట్యబ్దపూర్తి కమ్మెమొరేషన్ వాల్యూమ్, [ఢ] తెలుగు ఎ లింక్ బిట్వీన్ నార్త్ ఎండ్ సౌత్ — ఆంధ్ర సావనీర్ న్యూఢిల్లీ, [ణ] వర్క్స్ రిలేటింగ్ టు దత్తాత్రేయ కల్ట్ ఇన్ తెలుగు లిటరేచర్. ప్రొఫెసర్ టి. ఎమ్. పి. మహాదేవన్ 60యత్ బర్త్‌డే వాల్యూమ్, [త] తెలుగు లిటరేచర్ అండర్ నేషనల్ గవర్న్‌మెంట్. మదరాస్ గవర్న్‌మెంట్ సావనీర్. [థ] గిరిజన్ ఎండ్ డెవలప్‌మెంట్ ఆఫ్ తెలుగు డ్రామా - మదరాస్ నాటక అకాదమీ, [ద] తెలుగు కంట్రీ—లాండ్ ఆఫ్ డాన్స్ రొమాన్స్. జుబిలీ వాల్యూమ్ ఆఫ్ మదరాస్ ఆర్యవైశ్య సమాజ్. [ధ] తెలుగు లిటరేచర్ అండ్ మధుర నాయక్స్, జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ సొసయిటీ, రాజమండ్రి.

## 9. రేడియో ప్రసంగాలు :

వెంకటరావుగారు మద్రాసులో ఆకాశవాణి కేంద్రం పెట్టినప్పటినుంచి రేడియో ప్రసంగాలు చేశారు. తర్వాత హైద్రాబాద్ కేంద్రంలోను చేశారు. వందకు పైగా వుంటాయి ఆ ప్రసంగాలు. రేడియో ప్రసంగాలు సామాన్య ప్రజలకు ఉద్దేశించినట్టివి గనుక వాటితో సారళ్యం తప్పదు. వెంకటరావుగారు (అ) తమిళ సంస్కృతిపైన 12, (ఆ) ఆర్య సంస్కృతిపైన 16, (ఇ) చరిత్రపైన 10, (ఈ) సాహిత్య చరిత్ర, కావ్యాలు 40, (ఉ) భాషాశాస్త్రం

10, (ఈ) కళావిజ్ఞానాది శాస్త్రాలు 25 ప్రసంగాలు చేశారు. వెంకటరావుగారి మొట్టమొదటి రేడియో ప్రసంగం దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఊర్వశి కావ్యం పైన – పాటపాడించు సఖీ ఊర్వశీ 19-7-1944.

## 10. సభా ప్రసంగాలు :

వెంకటరావుగారు గొప్ప వక్త అని అనను. కాని, ఆయన ప్రసంగాలు విషయగర్భితాలు, పరిశోధన పరిమళ భరితాలనే దృష్టితోనే వినేవారు. ఆ మేరకు శ్రోతలకు సంతృప్తిగా ఉండేవి. ఆ యన పెక్కు సభలలో ప్రసంగించారు. వాటిలో కొన్ని పేర్కొంటాను. (అ) తెలుగు నాటక సాహిత్యానికి కోలాచలం శ్రీనివాసరావుగారి ఈవి – కోలాచలం శ్రీనివాసరావు 20 వ వర్ధంతి, బళ్ళారి, 1944, (ఆ) వీరేశలింగం సమకాలికులు – వీరేశలింగం 105వ జయంతి రాజమండ్రి 1953, (ఇ) గుడివాడ – పరిసర బౌద్ధ శిథిలాలు – ప్రథమాంధ్ర పరిశోధక మహాసభ అధ్యక్షోపన్యాసం, గుడివాడ 1959, (ఈ) హైస్కూలు, కాలేజీ తెలుగు పండితుల పుట్టు పూర్వాలు – అఖిలాంధ్ర ఉపాధ్యాయ పండిత పరిషత్తు పంచమ సమావేశం, అనంతపురం 1980, (ఉ) పాల్కురికి సోమన-అతని కృతులు – పాల్కురికి సోమన జయంతి, వరంగల్లు 1960. వెంకటరావుగారికి బసవపురాణం 'శ్రీ గురుదేవు నంచితగుణోత్తంసు' అని ప్రారంభించి, 'అనుపమంబుగ సప్తమాశ్వాసమయ్యె' అనే చివరి అర్ధం వరకు కంఠపాఠం. అలాగే పండితారాధ్య చరిత్రకూడ. కనుక ఆ సభలో అరగంటసేపు వాటిలోని కొన్ని ఘట్టాలు ఒప్పజెప్పారు. సువర్ణహస్త కంకణంతో సన్మానం జరిగింది. (ఊ) మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి గ్రంథం సమీక్ష – ఆంధ్రనలంద తృతీయ వార్షికోత్సవం, గుడివాడ 1961, (ఋ) బోయి భీమన్న కావ్యాలు – ఆంధ్ర నలంద చతుర్థ వార్షికోత్సవం, గుడివాడ 1962.

## 11. సభ్యత్వాలు :

వెంకటరావుగారు విశ్వవిద్యాలయంలో స్థానాపన్నులుగాను (ఎక్స్ అఫిషియో), సమర్థతతోను పెక్కు సంఘాలలో సభ్యులుగా వున్నారు. 1957 లో మద్రాసు విశ్వవిద్యాలయం శతజయంతి జరిగినప్పుడు తెలుగుశాఖ పుస్తక ప్రదర్శనం ఏర్పాటుచేశారు. దానిలో అందరినీ ఆకర్షించింది 1869 నాటి

మదార్రసు విశ్వవిద్యాలయం మెట్రిక్యులేషన్ పరీక్ష ఇంగ్లీషు వాచకం. దాని ప్రమాణం ఇప్పటి ఎం. ఎ. తో సమానమని తర్వాత జరిగిన గోష్ఠిలో పలువురు అభిప్రాయపడ్డారు. ఆయన సభ్యులుగావున్న సంఘాలు కొన్ని : (అ) కందుకూరి వీరేశలింగం పంతులు శతజయంతి సంఘం, (ఆ) గురజాడ శత జయంతి సంఘం, (ఇ) అచంట వెంకట సాంఖ్యాయనశర్మ శతజయంతి సంఘం, (ఈ) ఆదిభట్ల నారాయణదాసు శతజయంతి సంఘం, (ఉ) దక్షిణ రైల్వే మండలం అనువాద సంఘం, (ఊ) లింగ్విస్టిక్ సొసైటీ ఆఫ్ ఇండియా, (ఋ) ఫిలిం సెన్సార్‌షిప్ ప్రాంతీయబోర్డ్, (ౠ) రాష్ట్ర సాహిత్య అకాడెమీ, (ఎ) ప్రాచ్య లిఖిత పుస్తక విక్రయ సంఘం అధ్యక్షత, (ఏ) మదార్రసు విశ్వ విద్యాలయం అన్నల్స్ ఆఫ్ ఓరియంటల్ రీసెర్చ్ సంపాదకత్వం, (ఐ) జాయింట్ కంపయిలర్, కంపేరిటివ్ ద్రావిడియన్ వొకాబులరీ, (అం) సాటి సామెతలు - దక్షిణభారత బుక్ ట్రస్ట్, (అః) ప్రథమాంధ్ర ప్రదేశ ప్రాచ్య లిఖిత గ్రంథాలయ స్థాపన సంఘ సభ్యత్వం.

## 12. అప్రకటిత రచనలు :

వెంకటరావుగారి అప్రకటిత రచనలు చాల ఉన్నాయి. వాటిలో ముఖ్య మైనవి: (అ) తెలుగు కవుల చరిత్ర రెండవభాగం, (ఆ) అచంట వెంకట సాంఖ్యాయనశర్మ జీవితం, (ఇ) గాంధీ సాహిత్యం, (ఈ) రామలింగేశ్వర శతకం, (ఉ) చాటుపద్య మణిహారం దీనిలో ఆయన అప్పుడప్పుడు వ్రాసిన చాటువులు ప్రకటితాలు, అప్రకటితాలూ వున్నాయి. ఊ) వెంకటేశ్వరశతకం. ఇది నన్నయ మొదలు నేటివరకు వున్న కవులు, ప్రముఖులపై చెరి ఒక పద్యంగా వ్రాసింది. 2000 పద్యాలు, (ఋ) శబ్ద రత్నాకరానుబంధం. ఇది చాల ముఖ్యమైనది. ఇదివరకు ఏ తెలుగుకోశంలోనూ చేరని 10 వేల పదాలను కార్డులపై ఎక్కించివుంచారు. ఉదాహరణకు ఒక కార్డు వివరణ: ఒరవడి - ఇది తప్పు. వఱువడి, వరువడి, వరివడి సరైన రూపాలు. తమిళంలో వరివశివు, వరివు. కన్నడంలో బరదెదొడ, పరువది. మలయాళం - బరిముళి, వడి పాలీలో వుంది. (ఎ) కొమరాజు లక్ష్మణరావుగారి జీవిత చరిత్ర, ఆంధ్రాంగ్లాలలో, (ఏ) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, ఆరు సంపుటాలు (నోట్స్), (ఐ) సూర్యశతకం, (ఒ) సాయిబాబా దండకం.

## విచిత్ర వ్యక్తిత్వం :

వెంకటరావుగారిది విచిత్రమైన వ్యక్తిత్వం. శిమాయికత, ఆగ్రహం, ఆవేశం కలబోసిన స్వభావం. సాహిత్యంతప్ప లౌకిక విషయాలు తెలియవు. ఆ కారణంగానే ఉద్రేకపడే ప్రకృతి. సాహిత్యంలోలాగే వ్యక్తిగత విషయాలలోను శాఖాచంక్రమణం ఎక్కువ. ఎంత శత్రువైనా ఎదుటబడితే కౌగిలించుకొనే సరళత. 1966 లో కాకోలు వేలూరి శివరామశాస్త్రిగారి స్మారక సభలో వెంకటరావుగారు ప్రసంగించారు. కాటూరి వెంకటేశ్వరరావుగారు అధ్యక్షులు. ఆయన వెంకటరావుగారిని పరిచయంచేస్తూ "బందరులో ఒక నాదస్వర విద్వాంసుడుండేవాడు, ఆయన ఆలాపన గంటసేపు వాయించేవాడు. కృతి ప్రారంభమయ్యేవేళకు తెల్లవారేది. అలాగే వెంకటరావుగారి ప్రసంగంలో పీఠికాభాగం ఎక్కువ" అన్నారు. ఎవరేది చెప్పినా నమ్మి, విరుచుకుపడేవారు. ఒక చిన్న సంఘటన నాకు సంబంధించింది మరువలేను. అది వెంకటరావుగారి పరప్రత్యయనేయస్వభావానికి సంబంధించింది. ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంగా ఆంధ్రపత్రిక పెద్దప్రత్యేక సంచిక వేయదలచింది. అప్పుడు నేను ఆంధ్ర పత్రికలో పనిచేస్తున్నాను. నార్లగారి తరపున ఆయనను కలుసుకొని ఆధునిక సాహిత్యంపై ఒక వ్యాసం వ్రాయండని కోరాను. సరేనని ఒప్పుకొన్నారు. పత్రిక పక్షాన ఉత్తరం కూడా తర్వాత ఆయనకు అందింది. ఇంతలో తెలుగు భాషా సమితిలో పనిచేసే వారొకరు ఆయనను రెచ్చగొట్టారు. "మాస్టారూ! మీతో ప్రాచీన సాహిత్యం పైన వ్రాయించకుండ ఆధునిక సాహిత్యంపై వ్రాయమనడం మిమ్మల్ని అవమానం చేయడానికే." — అని ఆయన చెవిలో వేశాడు. దానితో వెంకటరావుగారు రెచ్చిపోయారు. ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం సమీపిస్తున్నది. పత్రిక ప్రత్యేక సంచిక చాలవరకు పూర్తయింది. వెంకటరావుగారి వ్యాసంకోసం పదిసార్లు తిరిగాను. (ఆయన వద్దకు 'పరిశోధన' పత్రికకై వ్యాసాలకోసం తిరిగేవాణ్ణి, దానికి వ్యాసయాత్ర అని పేరుపెట్టాను.) మరి పదిసార్లు వ్యాసయాత్ర చేశాను. నార్లగారు "ఇంకా రాలేదే వ్యాసం?" అని పదే పదే అడుగుతున్నారు. వెంకటరావుగారు ఏదో సాకు చెబుతున్నాడు. చివరిసారిగా అడిగాను—అప్పుడు నామీద విరుచుకుపడ్డారు. "మీ పత్రికలవాళ్ళ కసలు బుద్ధుందా? నన్ను అవమానం చేస్తారా? అసలసలు వైసనలు చాన్సులరు గూడ నాకు లెక్కలేదు. మీ పత్రికలు ఒకలెక్కా? ఆయన అసలసలు చెప్పాడు నన్ను

అవమానించడానికే అసలీ సబ్జక్టిచ్చారట." అని. ఆయనకు కోపం వచ్చినప్పుడు అసలు ఆసులో కండెలాగ మాటల మధ్య, సమాసాల మధ్య దొర్లేది. నాకు ఆశ్చర్యమయింది. "ఎవరండీ ఆయన?" అనడిగాను. చెప్పారు. నాకు మరింత ఆశ్చర్యమయింది. "నేను మీ వద్దకు ఇరవైసార్లు తిరిగాను. ఎడిటర్ నుంచి మీకు ఉత్తరం వచ్చింది. మీరు ఏ విషయమైనా గొప్పగా వ్రాయగలరనే కదా, ఉత్తరం వ్రాయడం. ఇలా వుండగా, ఆయ నెవరండీ? పత్రికకూ, ఆయనకూ ఏమి సంబంధం? ఆయన చెబితే మీరు వినడ మేమిటి! మిమ్మల్ని అవమానించదలచ కుంటే ఇన్నిసార్లు మీ వద్దకు తిరుగుతానా?" అన్నాను. నాదంతా అరణ్యరోదన మయింది, ఆయన ససేమిరా వినలేదు. ఆయన వ్యాసం లేకనే ప్రత్యేక సంచిక వెలువడింది. వారం తర్వాత నేను ఆయనను కలుసుకొన్నాను. "మీ అమూల్య మైన వ్యాసం లేనందుకు విచారంగా వుంది సార్. మీరు ఎవరిమాటో విని కోప గించుకొన్నారు. మీ సరళతను వాళ్లు దుర్వినియోగం చేసుకుని మిమ్మల్ని రెచ్చగొట్టారు." అన్నాను. అటు తర్వాత కొన్నాళ్ళకు గాని ఆయన కుదుటపడ లేదు. అదేవిధంగా ఆరుద్రగారి సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రపై భారతిలో ధారావాహికంగా విమర్శలు వ్రాసినా, ఆయన తమ జ్యేష్ఠపుత్రులు శ్రీ సుంద రేశ్వరరావు ఆరుద్రగారిని ఇంటికి ఆహ్వానించినప్పుడు ఎంతో ఆప్యాయంగా మాట్లాడారు. "ఏదో వ్రాస్తుంటాను. అదంతా మనస్సులో పెట్టుకోకు." అన్నారు.

ఇంతయినా ఆయన ప్రేమగౌరవార్హులుగానే వుండేవారు. ఆయన వ్యక్తి గత లోపాలను కప్పిపుచ్చే గొప్పగుణాలు సరళతా, అసాధారణమైనధారణ, నిరంతర పరిశ్రమ. ఆంధ్ర సాహిత్యంలోని ప్రయోగాలన్నీ నాలుకచివర నాట్య మాడేవి. ఆంధ్రదేశచరిత్ర, వాఙ్మయాలేకాక తక్కిన అనేక విషయాలు, ధర్మ శాస్త్ర, న్యాయశాస్త్ర విషయాలు వాచోవిధేయాలు. పలువురు విశ్వవిద్యాలయా ధ్యాపకులకు గీర చాలవుంటుంది. వెంకటరావుగారికి అది ఏకోశానా లేదు. ఒక స్థానంలో వున్నవారు సామాన్యంగా ఇతరులను గుర్తించరు. ఏదో వాత్సల్య దృష్టితో చూస్తారు. వెంకటరావుగారు ఏకొద్ది యోగ్యతవున్నా సరే, ఎలాంటి అరమరలూ లేక తమతో సాటిగా గౌరవించేవారు. పలువురు సంఘ సంస్కర్త వాదులేకాని, సంస్కర్తలు కారు. వెంకటరావుగారు తమ పెద్దకుమార్తె సౌ. జోగా బాయికి శాస్త్రోక్తంగా వర్ణాంతర వివాహం చేశారు. వారి నాల్గవ అబ్బాయి పంజాబు సూదీ తెగకు చెందిన విద్యావంతురాలిని వివాహమాడారు.

తెలుగు సాహిత్యంపై ఆయన సేవా ప్రభావం ముప్పేటగా పడిందని నా నమ్మకం. 1. ఉదాహరణ వాఙ్మయ చరిత్రను ఆయన వెలువరించినపిదప, దాని ప్రభావం కవులపై పడి దాదాపు 50 ఉదాహరణ కావ్యాలు వెలువడ్డాయి బడేబడే కవులే దానికి పూనుకున్నారు. దానితో ఆయన ఉదాహరణ వాఙ్మయోద్ధారకు లయ్యారు. 2. ఆయన దక్షిణదేశీయాంధ్రవాఙ్మయం దక్షిణాంధ్రంలోని వివిధదేశి రచనాశాఖల సమగ్ర విస్తృత పరిశోధనకు కారణమయింది. ఆ మహాగ్రంథం తన ప్రభావాన్ని తర్వాతి పరిశోధనలపై పూర్తిగా నెరపింది. 3, వీరశైవ వాఙ్మయ ప్రచారం. అదివరకు వీరశైవ వాఙ్మయం సంవృతద్వారం. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు బసవపురాణానికి గొప్ప ప్రామాణికమైన పీఠిక వ్రాసి ఆ సాహిత్యభండారం తలుపులు తెరిచారు. వెంకటరావుగారికి వారి నాన్నగారి నుంచి సంక్రమించిన వీరశైవ సాహిత్యం ఎంతో మేలు చేకూర్చింది, దాని సహాయంతో ఆయన ఆ సాహిత్య ద్వారాలు బార్లా తెరిచి, గొప్ప ప్రచారం చేశారు. చేతికందినవి అందినట్టు సాహితీవల్లభులకూ చూరలిచ్చారు.

అన్వేషణ జ్యోతితో ఆరంభమయిన అన్వేషణ జ్యోతి 15-10-1982 రాత్రి హైదరాబాదులో ఆరిపోయింది.

వెంకటరావుగారికి ఐదుగురు కుమారులు· శివసుందరేశ్వరరావు, పార్వతీశ్వరరావు, జగ్గారావు, సర్వేశ్వరరావు, సూర్యనారాయణరావు. కుమార్తెలు సౌ॥ జోగాబాయి, సౌ॥ లక్ష్మి. కుమారులలో శివసుందరేశ్వరరావు, సర్వేశ్వర రావు సాహిత్యంలో వున్నారు. శివసుందరేశ్వరరావు తండ్రికి దీటయినవాడు. వెంకటరావు గారు ఆయనను గురించి

> "అరయ నాదు సాహితికి నంతయు నేకము నైనరీతిగా
> వారసుడయ్యె నాకు నల వాదగు తోడును చేతితోడుగా
> అరయ నాదు సేవలను సంచిత రీతిని చేయు శ్రద్ధతో
> పేరిమి వాని బ్రోవుముర పేరుగలాడవు వెంకటేశ్వరా."

అని అవసానకాలంలో కోరారు. తండ్రిగారు మిగిలించిపోయిన పనులన్నీ ఆయన చేయాలి, అముద్రిత రచనలు ప్రచురించే బాధ్యత నెత్తిపై వేసుకోవాలి.

"ప్రతి పదానికీ ప్రయోగము చూపి ప్రామాణికమైన గొప్ప నిఘంటువును-అదిన్నీ అనుకూలసాధన సాహాయ్యసంపత్తి లభించిన, ఒకే సంపుటమున పదునైదు వందలు, లేక 2000 పుటలతో రచించి ఆంధ్రమహాజనులకు అంద జేయగలను." అని వెంకటరావుగారు నాతో 1981 జనవరిలో అన్నారు. అనంతరం శబ్దరత్నాకరాన్ని అనుబంధంతో క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీకోసం ప్రచురించారు. 1975 లో కలుసుకొన్నప్పుడు "దానిని సంస్కరించాను, 35 వేల పదాలతో నా ప్రతిజ్ఞమేరకు సిద్ధపరిచాను." అన్నారు దానిని వెలుగులోకి రావడానికి, తక్కిన వాఙ్మయ చరిత్రాదులు ప్రచురణ కావడానికి శివసుంద రేశ్వరరావు, సాహిత్యాభిమానులు ప్రయత్నించాలి.

తెలుగుభాష వెలుగుతున్నంతవరకు, తెలుగు వాఙ్మయం ప్రవహిస్తు న్నంతవరకు, తెలుగులో పరిశోధన పరిఢవిల్లుతున్నంతవరకు మానవల్లి రామకృష్ణ కవిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, నిడుదవోలు వెంకటరావు గారు విద్యుత్కాంతులు వెలార్చుతూనే వుంటారు. ✿

[ భారతి 1985 డిసెంబర్ సంచికనుంచి ]

పఱ్పనాబ నుయర్వ్వఱవుయరుమ్ పెరు న్తిఱలోన్*
ఎఱ్పర నెన్నైయాక్కిక్కొణ్డెనక్కేతన్నై త్తన్ద
కఱ్పగమ్*ఎన్నముదమ్ కార్ ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్
వెఱ్పన్*విశుమ్బోర్ పిరా నెన్నై త్తామోదరనే. ౧౧

పఱ్పనాబన్ - నాభియందు పద్మముగలవాఁడును, ఉయర్వ్వఱ - తనకంటె నితరవస్తువులకతిశయము లేకుండునట్లు, ఉయరుమ్ - వృద్ధిఁబొందుచున్న, పెరుమ్ - అధికమైన, తిఱలోన్ - బలముగలవాఁడును, ఎఱ్పరన్ - నాయందాసక్తిగలవాఁడును, ఎన్నై - నన్ను, ఆక్కిక్కొణ్డు - దాసునిగాఁజేసుకొని, ఎనక్కే - నాకే, తన్నై - తనను, తన్ద - ఇచ్చిన, కఱ్పగమ్ - కల్పవృక్షమువంటివాఁడును, ఇన్ - మధురమైన, అముదమ్ - అమృతమువంటివాఁడును, కార్ - వర్షాకాలమందున్న, ముగిల్ పోలుమ్ - మేఘమువంటివాఁడును, వేఙ్గడమ్-వేఙ్కటాద్రియనెడి, నల్ - విలక్షణమైన, వెఱ్పన్ - తిరుమలయందు వేంచేసియున్నవాఁడును - విశుమ్బోర్ - పరమపదవాసులకు, పిరాన్ - స్వామియైన, తామోదరన్ - దామోదరుఁడు, ఎన్నై - నాస్వామి

తా॥ పరమభోగ్యుఁడై, ఆశ్రితపరతంత్రుఁడైన శ్రియఃపతి వేఙ్కటాద్రియందు నిత్యసూరులతోఁగూడ వేంచేసియుండి నన్నువశపఱచుకొని నాకు సకలవిధకైఙ్కర్యములనిచ్చి నాయందు మిక్కిలి వ్యామోహముగలవాఁడై యున్నాఁడని.

తామోదరనై త్తనిముదల్వనై ఞాలముణ్డవనై*
ఆమో తరమఱియ వొరువర్క్కెన్ఱే తొழுమవర్గళ్*
తామోదరనురువాగియ శివఱ్కుమ్ తిశైముగఱ్కుమ్*
ఆమో తరమఱియ వెమ్మానై యెన్నాழிవణ్ణనై యే. ౧౨

అ॥ తనిముదల్వనై - అద్వితీయకారణమై, ఞాలముణ్డవనై - భూమిని మ్రింగినవాఁడైన, తామోదరనై - దామోదరునియొక్క, తరమ్ - ప్రభావమును, అఱియ - తెలిసికొనుటకు, ఒరువర్క్కు - ఒకరికైనా, ఆమో - సాధ్యంబగునా? ఎన్ఱు - అని, (నిశ్చయించి) తొழுమవర్గళ్ -ఆశ్రయించువారై, తామోదరన్ - దామోదరునికి, ఉరువాగియ - శరీరముగానున్నవారైన, శివఱ్కుమ్ - రుద్రునికిన్ని, తిశైముగఱ్కుమ్ - బ్రహ్మకున్ను, ఎన్ - నాకుసేవసాయించిన, ఆழி వణ్ణన్ - సముద్రమువంటికాన్తిగల, ఎమ్మానై - నాస్వామియొక్క, తరమ్ - మహిమను, అఱియవామో - తెలిసికొనుటసాధ్యంబగునా?

తా॥ జగత్సృష్టిసంహారకారకుఁడైన శ్రియఃపతియొక్క మహిమను మనకంటెఁ దెలిసికొనువారెవరున్నారని యభిమానముగల బ్రహ్మరుద్రులుగూడ యాభగవంతుని మహిమనెఱుఁగరని.

†† వణ్ణమామణిచ్చోదియై యమరర్ తలైమగనై*
కణ్ణనై నెడుమాలై త్తెన్ కురుగూర్ చ్చడగోపన్*
పణ్ణియ తమిழ்మాలై యాయిరత్తుళ్ళివై పన్నిరణ్డుమ్*
పణ్ణిల్ పన్నిరునామప్పాట్టణ్ణల్ తాళణైవిక్కుమే. ౧౩

అ॥ వణ్ణమ్ - కాన్తిగల, మా - గొప్పదైన, మణి - నీలమాణిక్యమువంటి, శోదియై - తేజస్సుగలవాడై. అమరర్ - నిత్యసూరులకు, తలైమగనై - నిర్వాహకుఁడై, కణ్ణనై - ఆశ్రితసులభుఁడై, నెడుమాలై - (ఆశ్రితులయందు) మిక్కిలి వ్యామోహముగలవాఁడైయున్న శ్రియఃపతి విషయమై, తెన్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియై, శడగోపన్-నమ్మాழ్వార్లు, పణ్ణియ - చేసిన, తమిழ్ మాలై - ద్రావిడశబ్దసందర్భములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, పణ్ణిల్ - గానమందుపాడఁదగిన, పన్నిరునామప్పాట్టు - కేశవాదిద్వాదశనామములననుసరించిసాయించిన పాశురములైన, ఇవై పన్నిరణ్డుమ్-ఈపనిరెండును, అణ్ణల్-సర్వేశ్వరునియొక్క, తాళ్ - శ్రీపాదంబులను, అణైవిక్కుమ్ - పొందించును

తా॥ సర్వేశ్వరునియొక్క కల్యాణగుణములను స్త్రీబాలులుకూఁడననుసంధించి యుజ్జీవింపునటుల పరమదయాళువైన నమ్మాழ్వార్లు ద్రావిడభాషయందు సాయించిన తిరువాయ్మొழిలో కేశవాదిద్వాదశనామములవిషయమై సాయించిన ఈతిరువాయ్మొழిని యనుసంధింపువారు శ్రియఃపతియొక్క శ్రీపాదములను దప్పకపొందుదురని. ౧౩.

ఆழ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౮-వ, తిరువాయ్మొழి.

అవతారిక:— ఈతిరువాయ్మొழిలో, సర్వేశ్వరునియొక్క మోక్షప్రదత్వమననుభవించి ప్రీతియుక్తులై, ఓచేతనులారా! మీరుకూడ సంసారదుఃఖమును వదలి మోక్షమును బొందవచ్చును. ఈసర్వేశ్వరుని యాశ్రయించుఁడని సంసారులకుపదేశించుచున్నారు

౹౹ అణైవదరవణైమేల్ పూమ్పావైయాగమ్
పుణర్వదు*ఇరువరవర్ ముదలుమ్ తానే*
ఇణైవనామ్ ఎప్పొరుట్కుమ్ వీడుముదలామ్*
పుణైవన్ పిఱవిక్కడల్ నీన్దువార్క్కే. ౧

అ॥ అణైవదు - (సర్వేశ్వరుఁడు) చేరుట, అరవు - ఆదిశేషుఁడనెడి, అణైమేల్ - శయ్యమీద, పుణర్వదు - కౌగలించుకొనుట, పూ - సుందరియైన, పావై - శ్రీమహాలక్ష్మియొక్క, ఆగమ్-తిరుమేనును, అవర్ - అట్టిప్రసిద్ధులైన, ఇరువర్ - బ్రహ్మరుద్రులిరువరికిని, తానే - స్వయముమే, ముదలుమ్ - కారణమైయుండును, ఎప్పొరుట్కుమ్ - సమస్తవస్తువులకున్ను, ఇణైవనామ్ - సజాతీయుఁడైయుండును వీడు - మోక్షమునకు, ముదలామ్ - హేతువైయుండును, పిఱవి - సంసారమనెడి, కడల్ - సముద్రమును నీన్దువార్క్కు-ఈదిదాటువారికి, పుణైవన్ - తెప్పయైయుండును.

తా॥ సకలజగద్రక్షకుండై శేషశాయియైన శ్రియఃపతియే సంసారదుఃఖములనుబోఁగొట్టి మోక్షమునిచ్చువాఁడుగనుక, ఓభక్తులారా! వానినే యాశ్రయింపుఁడని ౧.